GEETHASAPTHASATHI BY
CHALLA LAKSHMINARAYANA SASTRI

ప్రథమ ముద్రణ : 1960
రెండవ ముద్రణ : 1998



వెల : రూ 50/-

ప్రతులకు :

**చల్లా సుశీల**
5/519 తిరువళ్లువర్ వీధి,
సదాశివనగర్, మధుర - 625 020.

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
44-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001.
విశాలాంధ్ర బుక్ హౌస్, హన్మకొండ,
విజయవాడ, హైదరాబాదు, విశాఖ పట్టణం,
కాకినాడ, గుంటూరు, తిరుపతి, అనంతపురం.

ముద్రణ :

**నాగార్జునా ప్రింటర్స్**
డాక్టర్ రాధాకృష్ణన్ నగర్,
మద్రాసు - 21.

# కృతజ్ఞతాంజలి

గీతాసప్తశతి ద్వితీయ ముద్రణం వెలుగు చూడడానికి ముఖ్య కారణం శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం ఉదారంగా చేసిన ఆర్థిక సహాయం. వారి సహాయం చిరస్మరణీయం.



చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి,

గ్రంథకర్త.

# నే నెరిగిన మా నాన్న గారు

'నాన్నా'

మా అమ్మ ప్రసన్నంగా కనిపించలేదు.

'నాన్నా.....'

'నాన్నగారూ అనాలి' మా అమ్మ నన్ను మందలించింది.

మా అమ్మ పట్ల నా కెంత గౌరవమో అంత భయం కూడా. ఈ ఒక్క విషయంలో మాత్రం ఆమె మాటను నేను పెడచెవిని పెట్టినట్లు నా అభిప్రాయం. నేను పొన్నేరి (చెంగల్పట్టు జిల్లా) బోర్డు ఉన్న పాఠశాలలో ఫిఫ్త్‌ఫారం చదివే రోజులో ఆ రామ భక్తురాలు కాలధర్మం చెందింది. నాటినుంచీ నేను మా నాన్నలోనే మా అమ్మను దర్శించాను. ఆమె జీవించిన నాళ్లల్లో కూడా మాతృసౌఖ్యానికి నోచుకోని భాగ్యహీనుణ్ణి. ఆమెకు ముట్టుకడుపు నొప్పి. నెల నెలా నరకయాతన పడేది. అధ్యాపక వృత్తి నిర్వహించే మా నాన్న ప్రతినెలా ఆర్థికంగా పడిన యాతన తలచుకుంటే నాకు మనస్సు మనస్సులో ఉండదు. అంత కడుపు నొప్పిలోను. అటూ యిటూ దొర్లుతూ, మా అమ్మ రామదాసు కీర్తనలు పాడేది. ఇంట్లో ఉన్న ఒక్క వెండి కంచం మార్వాడీ కొట్టుకి వెళ్లేది, నా ద్వారా. ఒకసారి మా అమ్మకి మదరాసులో మేజర్ ఆపరేషన్ జరిగింది. ఆపర్షన్ జరిగిన రోజున ఆసుపత్రి గేటు వద్ద దీనవదనుడై మా నాన్న కూర్చొని వుండడం చూశాను. ఎప్పుడూ సంతోషంగా నవ్వుతూ కనిపించే మా నాన్న దీనంగా ఉండడం అదే మొదటిసారి, నేను చూసినంతవరకు, నిర్ఘాంతపోయాను, 'నాన్నా' అన్నాను ఎప్పటిలా.

'అమ్మ ఎలా వుంది?'

'ఇప్పుడే బెడ్డుకి తీసుకువచ్చారు. నన్ను బయటికి వెళ్లమన్నారు.'

ఉత్తరీయం చాటు చేసుకుని మా నాన్న కంట తడిపెట్టడం చూశాను.

ఆపరేషన్ జయప్రదంగా జరిగిందన్నారు. కాని వ్యాధి తగ్గలేదు. చివరికి హోమియో మందు వాడుతూ మా అమ్మ తెనాలిలో వాళ్ల చెల్లెలిగారింట కన్ను మూసింది. మా నాన్నకు టెలిగ్రాం పంపించారు. పొన్నేరి నుంచి ఆయన వచ్చేటప్పటికి దహనం జరిగింది.

'అమ్మ పోయింది.'

మా నాన్న నన్ను కౌగిలించుకున్నాడు. మనస్సులో బాధ పడివుండవచ్చు. పైకి పొక్కలేదు. అప్పు డాయనకి 35 ఏళ్లు.

మా అమ్మ పోయిన కొత్తల్లో, మా నాయనమ్మ కొన్ని రోజుల పాటు పొన్నేరిలో మా దగ్గర ఉండేది. ఒక రోజు రాత్రి ఆవిడకీ మా నాన్నకీ జరిగిన సంభాషణ నా చెవిలో పడింది.

'పెద్ద దాన్ని, నా మాట విని పెళ్లి చేసుకోరా.....'

'వద్దమ్మా.....'

'నిన్నెవరు చూస్తార్రా?'

'దేవుడే...... నేను పెళ్లి చేసుకుంటే, రాధ నెవరు చూస్తారు? (మా నాన్న నన్ను నాన్నా, రాధా అని పిలిచేవాడు). వాడికి నా అనేవాళ్లు ఎవరున్నారు చెప్పు? వాడు దిక్కు లేనివాడు కావడం నా కిష్టం లేదు.....'

నేనంటే మా నాన్నకు అంత ప్రేమ. నా దృష్టిలో ఆయన ప్రేమమూర్తి ! మా అమ్మ మరణించడానికి ముందూ ఆ తర్వాత - నా భార్య కాపరానికి వచ్చేంతవరకు - మా నాన్న వంట చెయ్యడం, నేను వంటపనుల్లో సహాయంగా ఉండడం జరిగింది. ఆ విధంగా మా తండ్రీ కొడుకుల మధ్య విడదీయ లేనంతగా సంబంధం ఏర్పడింది. నన్ను పెంచి పెద్ద చేసిందీ నాకు విద్యాబుద్ధులు నేర్పిందీ - అంతా మా నాన్నే.

లోకం దృష్టిలో మా నాన్న కష్టజీవి. కాని ఆయన ఎప్పుడూ ఆ విధంగా అనుకోలేదు. ఉదయం లేచింది మొదలు ఎనిమిదిన్నర దాకా రచనా వ్యాసంగం. తర్వాత వంట వార్పులు. ఆ తర్వాత ఆదరాబాదరా నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని పాఠశాలకు కొంచెం ఆలస్యంగా వెళ్లడం, సాయం సమయం ఇంటికి వచ్చినప్పటినుంచీ పాకశాలకు వెళ్లేంతవరకూ కాగితాలూ, కలంగా కూర్చోవడం, భోజనానంతరం కృష్ణగీతాలు రామచరిత్ మానస్ నుంచి దోహాలు రాగయుక్తంగా చదవడం – ఇదీ ఆయన దైనందిన చర్య.

సాయంకాలం దీపాలు పెట్టేవేళ సభక్తికంగా ఇది 'ఆయన పెట్టిన దీపం' ఆయన పెట్టిన వరం' అంటూ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని స్మరించేవాడు మా నాన్న. స్వగ్రామమైన లక్ష్మీపురంలో దగ్గరి బంధువు చల్లా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వద్ద విద్యాభ్యాసం చేసినా, గుడివాడలో జంధ్యాల శివన్నశాస్త్రిగారి వద్ద హిందీ చదివినా, చెళ్లపిళ్ల వారినే మా నాన్న తనగురువుగా భావించాడు. చెళ్లపిళ్ల వారిచ్చిన సర్టిఫికెట్లుతో బందరు శ్రీ రామా హైస్కూలులో సహాయాంధ్ర పండిత పదవి సంపాదించాడు. ఆ యోగ్యతాపత్రం చాలా రోజులు మా యింట్లో ఉండేది. తరుచుగా తిరుపతి వేంకట కవులు పద్యాలు మోహనరాగంలో చదువుతూ వుండేవాడు. రచనలలో గురుప్రార్థన విధిగా ఉండేది. 1932 లో ప్రచురితమైన మా నాన్న తొలి కావ్యం విరజోపాఖ్యానం ప్రబంధంలో లోపలి టైటిల్ పేజీలో ఇలా ఉంది. 'ఇయ్యది కింకవీంద్ర ఘటా పంచాననేత్యాది బిరుదాంకితులగు శ్రీశ్రీశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి ప్రియశిష్యుడును మచిలీపట్టనస్థ....' ఫలానా వారిశిష్యుణ్ణి అని సగర్వంగా చెప్పుకుని మా నాన్న సంతోషించడం నేను ఎన్నోసార్లు చూశాను. ఆ ప్రబంధంలో గురుస్తుతి యిలా సాగింది.

'తాలిమి మీర నెంతు గవితావనితా హృదయాంబుజాంతరా
లోల మధువ్రతున్, సుకవిలోలుని, వాక్యసుధారసప్రభా
శాలిని, దిర్పతి ద్విజల సత్సమిత్రు మదీయ దేశికున్
శ్రీలుని జెళ్లపిళ్ల కులసింధు సుధాకరు వేంకటేశ్వరున్.'

నెల్లూరులో నేను ఇంటర్ చదివే రోజులలో ఒకనాడు తిప్పరాజు వారి సత్రం వద్ద బహూభాషా కోవిదులు కోట సుందరరామ శర్మగారు'నువ్వు శాస్త్రిగారి అబ్బాయివి కాదుటోయ్' అన్నారు. అవునండీ అన్నాను. వెంటనే ఆయన తాలిమి మీర నెంతు కవితా వనితా..... అంటూ పద్యం చదివి, 'నువ్వూ అలా కవిత్వం చెప్పాలయ్యా' అన్నారు. మా నాన్న యింత గొప్పగా కవిత్వం చెపుతాడా..... అనుకుని నేను నిజంగానే గర్వపడ్డాను. నాకా పద్యం నోటికి రానందుకు సిగ్గుపడ్డాను. ఆ తర్వాత ఏడెనిమి దేళ్లకు మదరాసు సర్ త్యాగరాయ కళాశాలలో నేను పనిచేసే రోజుల్లో, ఒక రోజు సాయంకాలం చైనా బజారులో అనుకుంటాను, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారిని కలుసుకోవడం జరిగింది. 'నువ్వు ద్రావిడాంధ్ర సేతువవుతున్ననందుకు సంతోషమే కాని మీ నాన్న గారిలా .... ఏమిటా పద్యం... చెళ్లపిళ్ల కులసింధు సుధాకరు వేంకటేశ్వరున్...' అంటూ ఆ పద్యం చదివారు. నా సంతోషానికి మేర లేనట్లుగానే, నా విచారానికీ అవధి లేకపోయింది. అప్పటినుంచీ మా నాన్న రచనల్ని శ్రద్ధాసక్తులతో చదవసాగాను. నాకు కనువిప్పు కలిగించిన ఆ సాహిత్యోపాసకులకు కృతజ్ఞుణ్ణి !

'జ్ఞానం బున్నది లేదు చేవ'గా ఉన్న పరిస్థితిలో కూడా చెళ్లపిళ్లవారు శిష్యవాత్సల్యంకొద్దీ మైథిలికి అభిప్రాయం వ్రాసి పంపారు (7-2-1950) చెళ్లపిళ్లవారు. 'ధార సులభసాధ్యంగా ధారాళంగా ఉన్నది. పోకడలు వగయిరా ప్రాచీన శైలిలో నున్నను అవి ఆధునికులకు సైతం హృదయంగమంగానే కన్పట్టుచున్నవి, అన్నారు. ఆయనవి సత్యసూక్తులు. మా నాన్నది ప్రాజీనుల శైలి. ప్రబంధ శైలి. అయినా ఆయన ఆధునికతకు విరోధి కాదు. కవిత సులభసుందరంగా ఉండాలన్నదే ఆయన పరమాశయం. ధార సులభసాధ్యంగా ధారాళంగా నున్నది అని గురువుగారు చెప్పడంవల్ల, ఆ శిష్యునికి కలిగిన సంతృప్తి అనిర్వచనీయం. 'అయినా మా గురువుగారు చెప్పినంత లలిత లలితాంగా మధురమోహనంగా చెప్పడానికి యింకా ప్రయత్నిస్తాను' అని మా నాన్న అనగానే, పోకడలలో నవ్యత్వం సాధించడానికి

ప్రయత్నించగూడదా ? అని నేను నాకు తోచిన మాట చెప్పాను.

నా మాటలు కటువుగానే ఉన్నవనుకుంటాను. కొంతసేపయిన తర్వాత, 'నాన్నా నాకు పిరికి మందు పొయ్యకు, నా ధోరణి నాది' అన్నాడు మా నాన్న, నవ్వుతూ.

బుద్ధుడన్నా కరుణరసప్రధాన మైన కథలన్నా ఆయనకి అంతులేని అభిమానం! బుద్ధుని కథను 6 అంకాలలో విశ్వజ్యోతి అనే నాటకంగా (1948) తీర్చిదిద్దగా, దయావీరుడైన జీమూతవాహనుని కథను సుప్రభాతం అనే ఖండకావ్యంగా (1950) మలచి పండితుల ప్రశంస చూరగొన్నాడు. అలాగే ఆయన లేఖిని నుంచి మణిమేఖల అనే ఖండకావ్యం (కల్పితకథ) వెలువడింది. ఇంతకు చెప్పవచ్చిందేమిటంటే, ప్రసిద్ధ కథలనే కాక కల్పిత కథలను కూడా ఆయన అభిమానించారు.

తెలుగు భాషా సాహిత్యాలంటే ఎంత ఆదరభావమో మానాన్నకి హిందీ సాహిత్యమన్నా అంత ఆదరభావం. ఆయన కొంతకాలం హిందీ ప్రచారకుడుగా పనిచేశాడు. కీర్తి శేషులు మోటూరి సత్యనారాయణ, పందిరి మల్లికార్జునరావు ప్రభృతులు ఆయన మిత్రులు. ఫలానావారి కుమారునిగా కూడా ఆ పెద్దలిద్దరూ నన్ను చాలా గౌరవంగా చూసేవారు. శాస్త్రిగారూ నేనూ ఒకే ప్రాంతానికి చెందిన వాళ్లమని మోటూరివారు సహర్షంగా చెప్పేవారు. మిత్రులంటే మా నాన్నకి ఎనలేని గౌరవం. అలాగే బంధువులన్నా కూడా.

మేము ఢిల్లీలో ఉన్న రోజుల్లో మా నాన్న 'బిహారీ సత్‌సఈ' అనే ప్రశస్త హిందీ కావ్యానువాదాన్ని ప్రారంభించాడు. ప్రతి పద్యంలోను ఒక అలంకారం నిక్షిప్తమైన కావ్య మది. తనకు తెలిసినంతవరకూ అలాంటి కృతి ఏ ఐరోపీయ భాషలోను లేదని భారతీయ భాషా సాహిత్య మర్మజ్ఞుడైన గ్రియర్సన్ పేర్కొనడం పరిశీలించదగింది. కవి హృదయాన్ని గ్రహించేందుకు మా నాన్న పడిన శ్రమను తలచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. గ్రంథాలయాలను

సందర్శించాడు. పండితుల్ని సంప్రదించాడు. పొద్దస్తమానం అదే ధ్యాస. చివరికి ఆయన కృషి విరివానగా 1963లో ఫలించిది. ఆ తెలుగు సేతను ముట్నూరి సంగమేశం, ఎ. రమేష్ చౌదరి, భీమ్‌సేన్ నిర్మల్ వంటి ఉభయభాషా పండితులు బహూధా ప్రశంసించారు. రామచరితమానస్, రైల్వే టైంటేబుల్ తప్ప మరేమీ హిందీ సాహిత్యంలో చెప్ప దగినవి లేవని భావించే నా తమిళమిత్రులు ఈ సత్‌స ఈని చదివితే, ఇంత గొప్ప సాహిత్యం హిందీలో ఉన్నదా అని ఆశ్చర్య చకితులవుతారు. మా నాన్న చేసిన తెలుగు సేత అని కాదు కాని, నిజంగానే బిహారీలాల్ కావ్యం ప్రశస్త మయింది. మచ్చుకి రెండు మూడు పద్యాలు. కవి హృదయాన్ని నలుగురికీ తేటతెల్లం చెయ్యాలన్న ఉద్దేశంతో అనువదించిన కావ్యం.

వ్యయము దగ్గించుకొని లోభియైన మాన
చిట్టి చేతుల బిచ్చమ్ము బెట్టు మనుచు
కోడలిని నిల్ప, పురిలోని కోడెగాండ్రు
బిచ్చగాండ్రౌచు మూగిరి బిచ్చమునకు.

షండు డగు వైద్యుడొకని మోసం బొనర్చి
ధనము గొని 'వీర్య వృద్ధికై తగిన యౌష
ధం బిదే' యని యిడగ, తత్తరుణి నవ్వి
యనియె 'మీరేల సేవింప' రని ఛలోక్తి !

యాచకుడు ద్వారమున నిల్చెనన్న వార్త
విని వెలికి రాని లుబ్ధుని విధిని, ప్రేమ
భరిత సుస్వాంతులౌ సతీపతుల నోట
మాట రాదయె ప్రథమ సమాగమమున !

విరివానకు ఆంధ్రప్రదేశ ప్రభుత్వం వారి ఉత్తమానువాద పురస్కారం లభించినప్పుడు సంతోషిస్తూ చెళ్లపిళ్ల వారిని సభక్తికంగా మా నాన్న స్మరించుకున్నాడు.

రణతిక్కన (కావ్యం, 1956), దివ్యజ్యోతి (భక్త కన్నప్ప కథ, నాటకం) మొదలైనవి మా నాన్న రచనలలో పేర్కొనదగినవే అయినా, మైథిలి (రామాయణం బాల, అయోధ్యా కాండలు) గీతాసప్తశతి (భగవద్గీతానువాదం) ఆయనకి పరమ సంతోషం, తృప్తి ఇచ్చిన రచనలు. మూలంతోపాటు అనువాద సహితంగా వెలువడింది గీతాసప్తశతి. తేటగీతిలో సాగింది. తెలుగు సేత వీలయినంతవరకు సరళసుందరంగా ఉండాలని మా నాన్న ఆశయం.

సర్వ భూతమ్ములకు సర్వసముడ నౌదు.
ఒకనియెడ లేదు ద్వేష, మింకొకని పట్ల
లేదు ప్రేమమ్ము, నన్ను గొల్చెడు సుజనుల
యెడల నేనుందు, వారు నా యెడల నుంద్రు.

కంటి చూపు తగ్గినా, ఒక కంటికి ఆపరేషన్ జరిగినా మా నాన్న రచనా వ్యాసంగం మాత్రం మానుకోలేదు. ఆపరేషన్ చేసిన కన్ను మూసుకుని ఒంటికంటితో ఆయన ఒక శతకమూ, ఒక నాటకమూ వ్రాసే రోజుల్లో, 'ఎందుకు నాన్నా యింత కష్టపడి రాయడం ?' అని నేను మాటి మాటికి అనేవాణ్ణి. నే నలా అనడం ఆయనకి నచ్చేది కాదు. 'రాతలో వున్న ఆనందం మరి దేంట్లోను నాకు లేదు' అని మౌనం వహించేవాడు. నిజమే. ఆ రచనాసక్తి కనుక లోపించి వుంటే, కష్టాలనే నెమరు వేసుకుంటూ జీవితాన్ని నరకప్రాయం చేసుకుని ఉండేవాడేమో !

మొదటినుంచీ చివరిదాకా మా నాన్న జీవితం అధ్యాపక వృత్తిలోనే సాగింది. పదవు లేమీ నిర్వహించలేదు. అష్టావధానాలు చేసి, సాహిత్యోపన్యాసాలు చేసి పిన్నలలో పెద్దలలో చివరికి తమిళ సోదరులలోను తెలుగు భాషా సాహిత్యాల పట్ల ఆదరాభిమానాలు పెంపొందించాడు. నాకు

తెలిసి ముగ్గురు నలుగురు తెలుగు విద్వాన్ పరీక్షకు కూర్చున్నారు, ఆయన వద్ద చదివి. యువకులు కొందరు రచనారంగంలో ప్రవేశించారు. ఇదే ఆయన చేసిన సాహిత్య సేవ. 3 కావ్యాలు, 2 ఖండకావ్యాలు, 4 శతకాలు, 4 నాటకాలు, 2 వచన రచనలు, 4 అనువాదాలు, హిందీలో మంచి 1 శతకం ఆయన చేసిన రచనలు. తనకున్న స్వల్ప పరిధిలో మంచి రచనులు చేసి ప్రబంధ కవి శిరోమణి,కవితా విశారద మొదలైన బిరుదులు పొందాడు.

త్రిభాషా పండితుడైన మా నాన్నకు గల విద్వత్తు నాకు లేదు; గురుభక్తి లేదు; సంప్రదాయ ప్రియత్వం లేదు; కష్ట సహిష్ణుత లేదు; తృప్తి అంతకన్నా లేదు. దీక్షాగుణం లేదు. మా నాన్న వల్ల నాకు సంక్రమించింది దైవభక్తి, సాహిత్యానురక్త. ఇవే నాకు పదివేలు !

కాలధర్మం చెందడానికి ముందు సుమారు మూడు నాలుగు నెలలు అనారోగ్యంతో మా నాన్న చాలా యాతన పడ్డాడు. అప్పట్లో అన్నీ మంచంలోనే. తెల్లవారితే క్రిస్మస్ అనగా, 1968 డిసెంబరు 24న రాత్రి ఒంటి గంటకు ఆయన జీవిత నాటకానికి తెరపడింది. ఆ రాత్రి బాగా స్పృహ ఉండగా తనకు నచ్చిన యీ కింది పద్యం నా చేత నాలుగైదు సార్లు చదివించుకుని చిరునవ్వు నవ్వుతూ విన్నాడు మా నాన్న. అదే కడపటి నవ్వు !

'మురళిగనైన పుట్టి యదుముఖ్యుని కెంజిగురాకు మోవిపై
తిరముగ తాండవింపనయితిన్‌గద, ఎంతటి పాపచిత్తునో
యెరుగను, వేయునేటి కిదె బృంద జరించు ముకుందు పాదసం
స్ఫురితము లోర్వగా గరికపోచగనైన జనింపనైతిగా'.

మొదట్లో చెప్పవలసింది చివరికి చెప్తున్నాను. పాఠకులు మన్నించగలరు. మా అమ్మ మందలించినా, నేను 'నాన్నగారూ' అని మా

నాన్నను ఎన్నడూ పిలవలేదు. అలవాటులేని ఆపోసన ఎందుకని, నే నెరిగిన మా నాన్న అనే వ్యాసం మొదలు పెట్టాను.

## మా నాన్నగారికి సంబంధించిన కొన్ని వివరాలు :

జననం : గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, దంతలూరులో మాతామహుల యింట – 1903. జనవరి 7.

చదువుసంధ్యలు: కృష్ణాజిల్లా లక్ష్మీపురంలో (స్వగ్రామం) చల్లా సుబ్రహ్మణ్య శాస్త్రిగారి వద్ద కావ్యపంచకం, గుడివాడలో జంధ్యాల శివన్న శాస్త్రిగారి వద్ద హిందీ, తెనాలిలో సంస్కృత కళాశాలలో వ్యాకరణాదులు అభ్యసించారు. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి వద్ద కావ్యనాటకాదులే కాక కవితా రహస్యాలు హృద్గతం చేసుకున్నారు. మదరాసు విశ్వవిద్యాలయం వారి విద్వాన్ పరీక్షలో కృతార్థులై తెలుగు పండిత పదవి నిర్వహించారు. – చెంగల్పట్టు జిల్లా పొన్నేరి, సత్తివీడు (ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్) బోర్డు ఉన్నత పాఠశాలల్లో ఉద్యోగం.

రచనలు : మైథిలి, రణతిక్కన మొ.. కావ్యాలు, విశ్వజ్యోతి, దివ్యజ్యోతి మొ.. నాటకాలు, గీతాసప్తశతి, విరివాన మొ.. అనువాదాలు.... విరివానకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఉత్తమానువాద పురస్కారం లభించింది.

మరణం : మదరాసులో 1968, డిసెంబరు 24

---

1996 అక్టోబరు 10వ తేది విశాలాంధ్రలో 'కైతలోనే జీవితానందాన్ని అనుభవించిన లక్ష్మీనారాయణశాస్త్రి' అనే శీర్షికను ప్రచురితమైన వ్యాసమిది. సంపాదకులకు కృతజ్ఞుణ్ణి.

శ్రీమత్పరదేవతాయై నమః

# గీతా సప్తశతి

## తొలిపలుకు

**నామప్రాశస్త్యము :**

శ్రీమద్భగవద్గీతకు 'గీతా సప్తశతి' యను నామకరణము శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారే నిర్ణయించిరి. ఆచార్యులవారు తమ గీతాభాష్యోపోద్ఘాతమున నామప్రాశస్త్యమును గూర్చి కావించిన ప్రశంస కీ క్రింది పలుకులే తార్కాణములు.

"తం ధర్మం భగవతా యథోపదిష్టం వేదవ్యాస స్సర్వజ్ఞో భగవాన్ గీతాఖ్యై స్సప్తభి శ్లోకశతై రుపనిబబన్ధ."

—గీతాభాష్యమ్.

ఇక్కారణమున మదాంధ్రీకృత శ్రీమద్భగవద్గీతకు గీతాసప్తశతీ నామమే ప్రకృతమున నిర్ణీత మైనది.

భగవద్గీత యందుఁ గల యేడువందల శ్లోకము లే యే పాత్రల మూలమున నుద్దిష్టము లైనవో వాని నీ క్రింది పథకమున గనుంగొన వీలగును.

| క్రమసంఖ్య | | ధృతరాష్ట్రుఁడు | సంజయుఁడు | అర్జునుఁడు | భగవానుఁడు | మొత్తసంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1 వ అధ్యాయము | ... | 1 | 25 | 21 | — | 47 |
| 2 వ ,, | ... | — | 3 | 6 | 63 | 72 |
| 3 వ ,, | ... | — | — | 3 | 40 | 43 |
| 4 వ ,, | ... | — | — | 1 | 41 | 42 |
| 5 వ ,, | ... | — | — | 1 | 28 | 29 |
| 6 వ ,, | ... | — | — | 5 | 42 | 47 |
| 7 వ ,, | ... | — | — | — | 30 | 30 |
| 8 వ ,, | ... | — | — | 2 | 26 | 28 |
| 9 వ ,, | ... | — | — | — | 34 | 34 |
| 10 వ ,, | ... | — | — | 7 | 35 | 42 |
| 11 వ ,, | ... | — | 8 | 33 | 14 | 55 |
| 12 వ ,, | ... | — | — | 1 | 19 | 20 |
| 13 వ ,, | ... | — | — | — | 34 | 34 |
| 14 వ ,, | ... | — | — | 1 | 26 | 27 |
| 15 వ ,, | ... | — | — | — | 20 | 20 |
| 16 వ ,, | ... | — | — | — | 24 | 24 |
| 17 వ ,, | ... | — | — | 1 | 27 | 28 |
| 18 వ ,, | ... | — | 5 | 2 | 71 | 78 |
| | | 1 | 41 | 84 | 574 | 700 |

ఇది యిటు లుండ నించుమించుగఁ గొన్ని పాఠముల నేడు వందలకు మించి (750-60) న శ్లోకములు గూడఁ గనుపట్టు చున్నవి. వాని నన్నిటిని ప్రక్షిప్తము ల ని గ్రహింప వలసి యుండును.

## సందర్భము :

పశ్చిమగోదావరీమండలాంతర్గత మగు గణపవరమున కనతి దూరము నందుండు 'అడవికొలను' గ్రామ వాస్తవ్యులును, విశేషించి మదాప్తులును నగు శ్రీయుతులు పోశెముశెట్టి రామమూర్తి గారీ భగవద్గీతను దెలిఁగింప వలసినదిగా ఒకానొకప్పుడు నన్ను, గోరిరి. 'వల్లె' యని యంటినే కాని అప్పటి కాముచ్చటఁ దీర్పలేక పోయితిని.

ఉద్యోగము నుండి విశ్రాంతిఁ బొందిన తరువాత ఢిల్లీలోఁ (హస్తినా పురమున) గాపుర ముండుట దటస్థించినది. ఆచట నైష్ఠిక బ్రహ్మచారి యగు 'శ్రీశ' నామక మహాశయులతోఁ నాకుఁ గొంత పరిచయ మేర్పడినది. తత్సందర్భమున మున్నెప్పుడో నాటఁబడి మోసులెత్తిన సంకల్ప బీజమునకు శ్రీశమహాశయుల ప్రోత్సాహము ప్రబలదోహద మైనది. అదియే నేటికి ఫలరూపముగఁ బరిణమించినది. అనువాద మారంభమై ఆఱు మాసములలో ముగిసినది. రామమూర్తిగారును తమ వాగ్దాన ప్రకారమున నీ కృతిని బ్రకటించి నాకెంతయో మోదమును గల్గించిరి. వీరికి నేనెంతయును కృతజ్ఞుఁడను. ఇంతియగాక మహోదారులగు శ్రీ రామమూర్తిగారికిని, తత్కుటుంబములోని వారికిని జిరాయురున్నతులను బ్రసాదించుగాత మని గీతాచార్యుఁడగు శ్రీమద్రాధాకృష్ణుని నిత్యమును బ్రార్థించు చుందును.

## కథా సందర్భము :

అరణ్యాజ్ఞాతవాసముల నెపమునఁ బదుమూఁడు వత్సరములు వెళ్లించిన పాండవులు, మా భాగమును మాకుఁ బంచియీయ వలసినదిగా కౌరవుల యొద్దకు శ్రీ కృష్ణుని రాయబారిగా పంపిరి. కాని శౌరి, సంధికి బదులు యుద్ధమునే నిర్ణయించి కాని గమ్యస్థానమునకుఁ జేరి కానియొను యుద్ధ వార్త వినగనే పాండవులు, కౌరవుల తోడఁ బోరాడుటకు సంసిద్ధులైరి.

ఉభయపక్షముల నిలిచిన పదునెనిమిది అక్షౌహిణుల సైన్యము విభాగింపఁ బడిన తరువాతనే సమర మారంభ మైనది. తరువాతి వృత్తాంత

మును విన నెంచి కొనిన జాత్యంధుఁ డగు ధృతరాష్ట్రుఁడు వ్యాసునిచే నియమింపఁబడిన సంజయునితో సాగించిన సంవాద రూప మగు (ధర్మక్షేత్రే కురుక్షేత్రే) శ్లోకము తోడనే భగవద్గీత ప్రారంభ మైనది.

## వ్యాసకవితావిశిష్టత :

వ్యాస మహర్షి, కొన్ని తావుల శబ్దముల తోడనే కందుకక్రీడ సల్పి నటుల. కవితా విషయమున గోచరించు చుండును. మచ్చునకీ శ్లోకమును గమనింపఁ దగును.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం.
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్.
ప్రథమాధ్యాయము. ౧౧ వ శ్లోకము

దుర్యోధనుఁడు ద్రోణాచార్యులవారితో సంభాషించు సందర్భము లోని దీశ్లోకరాజము. మనబలము భీష్మ రక్షితం బగుటఁ బరిమితశక్తికి మించి శత్రుదుర్భేద్యమై యపర్యాప్త మైనది. పాండవబలము భీమాభిరక్షిత మయ్యును పర్యాప్త మై (పరిమిత శక్తిగలదై) సులభ సాధ్య మగుచున్నది. అని యీశ్లోకమునకు ముఖ్యార్థము.

'భీష్మ' శబ్దమందలి 'ష' కారమును దొలఁగించినచో వాస్తవముగ నిందలి రెండు శబ్దములును 'భీమ' శబ్దములే యగుచున్నవి. ఈ 'ష' కారముండుట చేతనే మొదటి 'భీమ' శబ్దము పర్యాప్తమునకు మించి అపర్యాప్తమైన దనియు రెండవ శబ్ద మట్టిది కామిం జేసి పర్యాప్తమే యైన దనియు నిందలి విషయమునుబట్టి మనము గ్రహింపవలయును. మొత్తము మీఁద నీ నాలుగుశబ్దముల కవినాభావ సంబంధమున్నట్లు గను పట్టుచున్నది. కనుకనే యీ శబ్దము లను వదింపఁబడక యథాతథముగ నుంచుటయే మంచి దని పెద్దల యాశయము. ప్రస్తుతము తదాశయమును గుర్తించి రచింపఁబడిన మఱొండు పద్య మిట నుదాహరింపఁబడుచున్నది.

అనఘ! భీష్మాభిరక్షితం బైన మనదు
బల మపర్యాప్త మని మీక తెలియఁ గాదె
భీము పాలిత పాండవోద్దామ బలము
సుగమము జయింపఁ బర్యాప్త మగుట మనకు

తడ విన కొలఁది నిట్టి వెన్నియో కనుపట్టుచుండును.

## అనువాదవిశిష్టత :

మూలమునకు యథానువాద మైనను గొన్ని తావుల వ్యాఖ్యాన భావములను గూడ నౌచిత్యమున కాశ్రయించితిని. మచ్చున కిందొక పద్యమును బొందు పఱచు చున్నాను.

దేవ! నీ మేనఁ బశుపతిన్ - దివ్యభుజగ
తతి - సురల - మునులన్ - భూతవితతిఁ గాంచి
తనియ కద్దానఁ; బుడమి నెత్తమ్మి లోని
మేరు వను కర్ణికన్ బరమేష్ఠిఁ గంటి

181 వ పేజి 15 వ పద్యము.

ఇట్టివే కొలఁది మాత్రమే కనుపట్టును.

## కొన్ని మతాంతరములు :

వ్యాఖ్యానకారుల భావము ననుసరించి సాంఖ్యయోగ మందలి వివాదగ్రస్త మగు నలుబదియాఱవ శ్లోకమునకు మఱి రెండు పద్యము లిందు పొందు బఱుపఁ బడు చున్నవి.

(1) ఎల్లకడలఁ దటాకముల్ వెల్లివిరియఁ;
కూపజలలాభ మెంత గైకొనఁగ నగునొ—
బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడౌ బ్రాహ్మణునకు
సకల నిగమైక లాభమ్ము సైత మంతె!

(2) సలిలపరిపూర్ణ మైన కాసార మందు
కొలఁది జల మంది కొని వాడు కొన్న యటులఁ

దనరు వలసిన దాని మాత్రమ్మె సర్వ
వేదముల నుండి గొను బ్రహ్మవేత్త ద్విజుఁడు.

ఇట్టివి మఱి కొన్ని గోచరించినను సవరించి కొనవచ్చును.

## కొన్ని సవరణలు :

'ప్రమాదో ధీమతా మపి' అను లోకోక్తి ననుసరించి యెట్టివారి కేని దొసఁగులు బొసఁగక మానవు. అట్టియెడ నల్పజ్ఞుఁడ నగు నావంటి వాని విషయమున నింకఁ జెప్పవలయునా?

(1) ప్రథమాధ్యాయమందలి యాఱవ పద్యమున కీ క్రింది పద్యమును జోడించు కొన వలయును.

మహిత విక్రముఁడౌ యుధామన్యు నాముఁ;
డసమ బలశాలి యుత్తమౌజసుఁడు; ద్రౌప
దేయు; లభిమన్యుఁ డిచట వర్తింతు రొకట
విధిగ వీరెల్లరును మహారథులు గారె!

(2) విశ్వరూప దర్శన యోగమున నిరువదినాల్గవ పద్య మందలి రెండవ పాదమునకు బదులుగ నీ క్రింది పాదమును జోడించు కొనవలయును. ''నిన్ను-వివృతాస్య-దీప్త- సందీప్త బహుళ''

(3) పురుషోత్తమ యోగమున మూఁడవ పద్యమునకు మారుగ నీ క్రింది పద్యమును జదువు కొనవలయును.

తత్వ విజ్ఞాన మొదవిన తఱి వచింపఁ
బడిన గతిఁ దుది మొద లగు పడని రీతిఁ
బరగు సువిరూఢ మూల మశ్వత్థ పాద
పమును వైరాగ్య రూపశస్త్రమునఁ దునిమి

ఇట్టి వింకేమేని గోచరించిన విజ్ఞులు సంకోచింపక నాకుఁ దెలిపినఁ గృతజ్ఞతతో రెండవ ముద్రణ యందు సవరించి కొందు నని మనవి చేయుచున్నాఁడను.

**ఉపసంహారము :**

ప్రూఫులు దిద్దుటలోఁ దోడుపడిన శ్రీయుతులు బులుసు వేంకట రమణయ్యగారికిని, రహస్యము తెలిసింగించిన శ్రీమాన్ వేదాల వరదాచార్యులవారికిని, సంసారాశ్వత్థ వృక్షమును రూపొందించుటలో దగు సహాయ మొసంగిన 'భగవద్గీతా గీతలు' రచించిన కవితల్లజు అగు శ్రీ కొంపెల్ల శ్రీపతి శాస్త్రుల వారికిని నా హృదయ పూర్వకాభి వందనము లర్పించుచున్నాను.

మంచి మెలకువతో సర్వాంగసుందరముగ సకాలమునకు ముద్రించి యిచ్చిన శ్రీ వెల్డన్ ముద్రణాలయమువారికి సర్వదా కృతజ్ఞుఁడను.

సంసారాశ్వత్థవృక్షమును జిత్రించి యిచ్చిన తిరువత్తియూరు ఉన్నతపాఠశాలయందలి చిత్రలేఖనాధ్యాపకు లగు చిరంజీవి యస్. షణ్ముఖముగారికి నా యాశీస్సులు.

ఎన్నో అనువాదము లుండఁగ నిప్పుడీ పద్యానువాద మేలయని శంకించు సంశయ గ్రస్తుల కీ క్రింది పద్యమూలమున సమాధాన మిడుచు నింతటితో నా తొలిపలుకును విరమించు చున్నాను.

ఆ॥ వె॥ గద్య రచన జ్ఞప్తికె చూడ ననువు గా
దని తలంచి పఠనమున కనువుగఁ
దెలుఁగు సేసినాఁడఁ దేట తెల్లమ్ముఁగా
గీత నెల్లఁ దేఁట గీత లందు.

రాధాంబానివాసము,
మదరాసు-21.

ఇట్లు,
బుధజన పాదరేణువు,
గ్రంథకర్త.

ఓమ్‌తత్సత్.

# ఆశీస్సు

శ్రీరాధా హృదయాంబుజాంతరచర
త్సోఽన్మత్త పుష్పంధయః
కారుణ్యామృత వీక్షణః ప్రవిమలః
కళ్యాణ సంధాయకః
కృష్ణః పంకజలోచన శ్చ మురళీ
గాన ప్రియంభావుకః
పాయా త్సోశెము శెట్టి వంశతిలకం
శ్రీరామ మూర్త్యాహ్వాయమ్.

గీతాసప్తశతీ సమాఖ్య భగవ
ద్గీతన్ దెలింగింప ము
న్నే తాఁబల్కి– ధనం బొసంగిన ఘనున్
శ్రీరామమూర్తిన్–మహా
దాతన్–బోశెము శెట్టి వంశజుని–గీ
తాశాస్త్ర నిర్మాత రా
ధాతన్వీవిభుఁ, డోము నాయువును–వి
ద్యన్–గీర్తియున్ గూర్చుచున్.

---

శ్రీమత్పరదేవతాయై నమః

# కవి సంక్షిప్త వంశావళి

---

సాలగ్రామము రీతిఁ జిన్నదయి-కృష్ణా మండలాంతర్గతం
బై-లక్ష్మీశ్వర నామధేయ శివదేవావాస విభ్రాజితం
బై-లక్ష్మీనిలయంబు నై-మహిత విద్యాలంకృతోత్తేజితం
బై-'లక్ష్మీపుర' మొప్పు గృధ్రనగర ప్రాంతంబునం-దచ్చటన్.

అన్యాదర్శ మ్మగు సౌ
జన్యము తో మనెడువారు 'చల్లా' వారం
చన్యులచే నుతిఁ గొను కౌం
డిన్యస గోత్రజులు గల రనేకులు విప్రుల్. 2

ఆపుంమున ముత్తాతలు
గాపుర ముందుదురు పాలికాపుల తోడన్
భూపాలు రిడిన మాన్య
ప్రాపకమునఁ దమదు శాస్త్ర పాండితి మెరయన్. 3

వ. ఏతద్వంశమునకు మూలపురుషుండు వేంకటేశాభిధానుండు. అతనికిఁ గలిగిన సంతతి వారిలోఁ జివరివాఁడు వేంకటనరసావధాని. అయ్యనఘుఁడు యోగలంపటుఁడై మిగుల ప్రసిద్ధినందెను. ఈ పూజ్యుని అగ్రతనూజుఁడే మత్పితామహుఁడు. ఇమ్మహా మహునకు మూర్తిత్రయమో యన మువ్వురు తనయు లుదయించిరి.

వారిలో ద్వితీయుండయ్యును గుణగణములచే నద్వితీయుండైన శీతయ్యాహ్వాయుఁడే నాకు పూజ్యపాదుఁడగు జనకుండయ్యెను. మంత్రోపదేష్ట యగుట విశేషించి గురుపుంగవుఁడు నయ్యెను. ఇంకఁ బ్రకృత మనుసరింతము.

తండ్రి సీతయ్య – నర్సాంబ తల్లి నాకు
ననుజులు గలారు ముప్వు–రే నగ్రజుండ
లక్ష్మీనారాయణుఁడ – గృహలక్ష్మి నాదు
సుదతి జెలువారుఁ – బేరు[1]యశోద గాఁగ. 5

నాగృహలక్ష్మి నన్విడిచి నాకముఁ జేరిన దాది నన్యకాంతా గృహిణీత్వ మొల్లక సదా బడిపంతుల నై స్వహస్త పాకాగమ వృత్తి సాపడుచు నార్యమతమ్ము శరణ్య మై సనంగా [2]గురులబ్ధ సత్కవితఁ [3]గావ్య వినోదుఁడ నై మెలంగితిన్.
సాకారంబుగ మత్తపః ఫల మిటుల్ జన్మించె నన్నట్లు నాకేకైకాత్మజుఁడొప్పె నిం పెసఁగ యమ్–యే–పట్ట భద్రుండు రాధాకృష్ణాఖ్యుఁడు–తత్సతీమణియు *రాధాదేవియున్ గాఁగ–రాధాకృష్ణుల్ బలెఁ బ్రేమవిహ్వలతఁ దద్దాంపత్య మేపారెడిన్.

---

1 యశోద = కీర్తినిచ్చు నిల్లాలు.

2 గురులబ్ధసత్కవిత = శ్రీమత్తిరుపతి వేంకటేశ్వర గురులబ్ధ మగు కవిత్వముచే.

3 కావ్యవినోదుఁడనై = మైథిల్యాది సత్కావ్యరచనా వినోదుఁడనై.

* పుట్టింటివారిడిన పేరు 'సుశీల' యనియు; నత్తింటివారిడిన పేరు 'రాధాంబ' యనియు గ్రహించి కొనవలయును.

శ్రీమత్పరదేవతాయైనమః

జయ శ్రీ

సర్వధారి వత్సరమునఁ; జైత్రమాస
మందుఁ; బున్నమనాటి సాయంతనమున;
మద్రపురి నుండి కదలు ధూమశకటమున
రామ మూర్తికి నాకు నేర్పడియె మైత్రి. 1

ధరఁజెలఁగెడి గోదావరి
వరకుల్యకు సరస "గణపవర మొప్పెడిఁ; ద
త్పురికిఁదరి "వడలికొల" నను
పుర మలరారు సిరికిఁ గాపుర మని పొగడన్ 2

పయన మొనరించు పట్టులఁ బలుకు కతలు
స్వప్నగతగాథ లంచని జనము లాడు
నుడుల కేతావు గల్పింప కడవికొలను
జేరి కనుఁ గొంటి సుకవి మందారుఁ గోరి. 3

కనుగొంటిన్ సుగుణైక సంపదల సత్కారుణ్యమూర్తిన్; మహా
జనసంభావిత మార్గవర్తిఁ; గవిరాజ శ్రావ్య సత్కావ్య సం
జనితామోద మనః ప్రవృత్తి; నిఖిలాశా పూరితాశేష కీ
ర్తిని శ్రీపోశెము శెట్టివంశ తిలకున్ శ్రీరామమూర్తిన్ బుధున్

ఇతఁడఁటే 'మహాలక్ష్మి' యెత్తి ముద్దాడిన
చిన్నారి పొన్నారి చిట్టిమనుమఁ;
డితఁడఁటే గుణగణోన్నతులైన 'నారయ'
'సూర'మాంబలకుఁ గుమార వర్యుఁ;

డితఁడఁటే శ్రీరమాసతికి సామ్యము వచ్చు
నరసమాంబా మనోనాయకుండు;
నితఁడఁటే దీనసంతతిఁ బ్రోచు గుణశాల
శ్రీరామమూర్తి విశేషఘనుఁడు;
ఇతఁడఁటే పండితాశీస్సు లింపు గూర్ప
సరసకవితా సుధారసా స్వాది యాచు
నవ్యజాతీయ పద్యరత్నాల మాల
నాదిగాఁగల కృతు లంది యలరు ఘనుఁడు.

శ్రమయంచున్ మదిలోఁ దలంపకయ-విశ్వజ్యోతినిన్-సుప్రభా
తమునున్-ముద్రణ కిచ్చి నాటి కపుడే ద్రవ్యంబు వెచ్చించి పో
శెముసెట్యన్వయ వంశరత్న మగు మాశ్రీరామచంద్రుండు మో
దముఁ గల్గించెఁ;దదీయమైత్రియు స్థిరత్వం బందె నీనాటికిన్.

పదియు రెండేడు లాయె నిప్పటికి-నాకు
గీతఁ దెలిఁగించు భాగ్యమీరీతిఁ గలిగె -
వరుస మత్కృతిఁ బ్రకటించు భాగ్య మిపుడు
రామమూర్తికి సైతమేర్పడియె మగిడి. 7

కప్పురఁపున్ విడెమ్ముఁ గుతుకమ్మున దోసిటఁ బెట్టి కావ్యమున్
దప్పక వ్రాయు మంచుఁ గవి తల్లజు వేడు నృపుండు గాన రా
డిప్పుడు-రామమూర్తియె తత్ క్షితీంద్రుఁడు నాకిటఁ దన్మృదూక్తియే
కప్పురఁపున్ విడెం; బటులగావున - నాకృతికన్య ధన్యయే. 8

ఎందఱు లేరు భూమిపతు లిమ్మహి; మత్కవితాల తాంగి, తా
నందఱి పొత్తుఁ గోరెనె మహాశయ! నీ రసికత్వ మెంచి వే

డ్కాందన యంతఁ దా నిటు హుటాహుటి నీదరిఁ జేర వచ్చెఁ గ
మ్మందన మిచ్చు పద్యకుసుమమ్ములఁ జిమ్ము పరీమళమ్ములన్.

ఓయి! రసికావతంస నీయునికిఁ జేరు
సరసకవితా సతీవిలాసముల కీవు
జాణవే యైతి – ముత్యాలసరము దరుణి
గుబ్బచన్నులఁ గాదె సుందరతఁ గాంచు. 10

ఆఁకటి చిచ్చు మంటలకు నాహుతి యై చను బీదవారి చీ
కా కడగించి తంట పయి కం బిడి – భీమవరాన నైదువేల్
ప్రాకట వైభవోద్ధతి వి రాళ మొసంగి కళాలయాని కౌ
రా! కడుకీర్తి గాంచితఁట; అన్నిట జాణవు రామమూర్తిరో!

కలమున్ బట్టి కవీశ్వరుండ నని వక్కాణించినన్ జాలుఁ; బు
వ్వల విత్తంబున–వానికైత కిడు సత్కారంబు లెన్నే నియున్
హలమున్ బట్టి కృషీవలుండ నని తా నర్థించినన్ జాలు–నా
హాలికున్ బ్రోచెడు_రామమూర్తితగుసాహాయమ్ముఁగావించుచున్

నీకుఁగల గొప్ప – మాకవితా కుమారి
తెలిసి కొననేర్చె – మాకేది తెలియ దయ్య
ధవుని సౌజన్య మెఱుఁగుఁగా తరుణి–దాని
యబ్బ కింతకుఁ దెలియ నౌనా జగాన! 13

కవిపుంగవులచేతఁ గావ్యముల్ వ్రాయించి
ప్రకటించె నెవఁడు ద్రవ్యం బొసంగి
ఘనుఁ డనన్ జెల్లి జీవన మీయ నెవ్వాఁడు
కావించె బహుతటాకప్రతిష్ఠ;

గ్రంథాలయ మొకండు గ్రామంబు నందుండ
కృషి సల్పి యెవఁడు నిర్మింపఁ జేసె
గ్రామాభివృద్ధి కార్యముల - గ్రామస్థుల
కగ్రగామిగ నిల్చి యలరె నెవఁడు;
కష్టజీవుల పాలిటి కల్పక మనఁ
బేదసాదల నెవఁ డేలు సాదరమున
నట్టి పోశెము శెట్టి వంశాబ్ధి చంద్రు
రామమూర్తి ని రాధికారమణుఁ డోము. 1

మానిత సత్కవిత్వ బహు
మానములన్ విలసిల్లి - యోగ్యసం
తానము తోడ నుల్లసిలి-
తామరతం పర గాఁగ సంపదల్
ధీనిధి రామమూర్తి నవ
లీల రమావరుఁ డేలు నిత్యక
ళ్యాణముఁ బచ్చతోరణము
నై గృహ మున్నతిఁ జెన్ను మీఱఁగన్. 1



శ్రీమత్పరదేవతాయై నమః

# గీతా సప్తశతి

---

ప్రధాన విషయానుక్రమణిక :—

## ౧ వ అధ్యా. అర్జునవిషాదయోగము.

(1 వ పేజీ మొదలు 19 వ పేజీ వఱకు)



## ౨ వ అధ్యా. సాంఖ్యయోగము.

(20 వ పేజీ మొ॥ 47 పేజీవఱకు)



---

## 3 వ అధ్యా. కర్మయోగము.

(48 వ పేజీ మొదలు 65 వఱకు)



---

శ్రీ మత్పరదేవతాయై నమః.

# శ్రీమద్గీతాసప్తశతి

## అథ కరన్యాసః

ఓమ్ అస్య శ్రీమద్భగవద్గీతామాలామన్త్రస్య భగవాన్వేద వ్యాసఋషిః. అనుష్టుప్ ఛన్దః. శ్రీకృష్ణః పరమాత్మా దేవతా. "అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ఇతి బీజం. సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ఇతి శక్తిః - అహంత్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకమ్. నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతింపావకః ఇత్యంగుష్టాభ్యాం నమః. నచైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః - ఇతి తర్జనీభ్యాం నమః - అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ- ఇతి మధ్యమాభ్యాం నమః. నిత్య స్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః - ఇత్యనామికాభ్యాం నమః - పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ఇతి కనిష్ఠికాభ్యాం నమః. నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ- ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః.

ఇతి కరన్యాసః.

## అథ హృదయాదిన్యాసః.

నైనంఛిన్దన్తి శస్త్రాణి నైనందహతి పావకః - ఇతి హృదయాయ నమః - నచైనంక్లేదయన్త్యాపో నశోషయతి మారుత - ఇతి శిరసేస్వాహా. అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయమక్లేద్యోఽశోష్యఏవ చ- ఇతి శిఖాయై వషట్ - నిత్యస్సర్వగత స్థాణు రచలోఽయమ్ సనాతన. ఇతి కవచాయ హుమ్. పశ్యమే పార్థరూపాణి శతశోఽథ సహస్రశః - ఇతి నేత్రత్రయాయ వౌషట్. నానావిధాని దివ్యాని నానావర్ణా కృతీని చ - ఇతి అస్త్రాయ ఫట్. శ్రీ కృష్ణప్రీత్యర్థే పాఠే వినియోగః.

# ఓమ్

గీతాస్తుతిః :

పార్థాయ ప్రతిబోధితాం భగవతా
నారాయణేన స్వయమ్.
వ్యాసేన గ్రథితాం పురాణమునినా
మధ్యేమహాభారతమ్.
అద్వైతామృత వర్షిణీం భగవతీ
మష్టాదశాధ్యాయినీ
మమ్బ త్వా మనుసందధామి భగవ
ద్గీతే భవద్వేషిణీ! 1

వ్యాసస్తుతిః :

నమోఽస్తుతే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిందాయత పత్రనేత్ర,
యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః. 2

మహాభారత ప్రశంసా :

భీష్మద్రోణతటా జయద్రథజలా
గాంధార నీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ
కర్ణేన వేలాకులా,
అశ్వత్థామవికర్ణ ఘోర మకరా
దుర్యోధనావర్తినీ

గీతాస్తుతి :

విమలాత్మన్ మఘవాత్మజుండు విన నిన్
వెన్నుండు బోధించె—స్వీ
య మహాభారతమందు వ్యాసుఁ డటుపై
నష్టాదశాధ్యాయిగాఁ
దమి తోడన్ గుది కూర్చెఁ జల్లితిల న
ద్వైతామృతం బమ్మ! నిన్
స్తిమితం బొప్ప హృదిన్ స్మరింతు భగవ
ద్గీతా! భవద్వేషిణీ! 1

వ్యాసస్తుతి :

భారతామ్నాయ తైల మింపారఁ బోసి
జ్ఞానమయదీప మెవఁడు ప్రజ్వలిత మగుచు
నలర వెల్గించె నట్టి ఫుల్లారవింద
నయనుఁడౌ వ్యాసమౌనికి నతి యొనర్తు. 2

మహాభారత ప్రశంస :

ద్రోణగాంగేయు లిర్వురుఁ దీరములు గాగ ;
సైంధవాభిఖ్యుండు జలము గాగ;
శకుని నీలోత్పలసరణి వర్తిల్లఁగా;
మొసలి యై శల్యుండుపస దలిర్ప;
నాకులితోద్వేలుఁడై కర్ణుఁ డొప్పారఁ;
కృపుఁడు ప్రవాహవిస్తృతి వహింప;

సోత్తీర్ణాఖలు పాణ్డవై రణనదీ
కైవర్తకే కేశవే. 3

పారాశర్యవచస్సరోజ మమలం
గీతార్థ గన్ధోత్కటమ్
నానాఖ్యానక కేసరం హరికథా
సద్భానునా బోధితమ్,
లోకే సజ్జనషట్పదై రహరహః
పేపీయమానం ముదా
భూయాద్భారత పంకజం
కలిమలప్రధ్వంసి నః శ్రేయసే. 4

అథ గీతామాహాత్మ్యమ్:

గీతాధ్యయన శీలస్య
ప్రాణాయామ పరస్య చ,
నైవసన్తి హి పాపాని
పూర్వజన్మ కృతాని చ. 5

మలనిర్మోచనం పుంసాం
జలస్నానం దినేదినే
సకృద్గీతామ్భసి స్నానం
సంసార మలమోచనమ్. 6

ద్రోణవికర్ణులు దారుణాకృతిఁ దాల్చి
పటుజలగ్రాహరూపములఁ జెలఁగఁ;
తే-గీ. చండ దుర్యోధనుఁడు సుడిగుండ మగుచు
దనరఁ బ్రవహించు రణనదిఁ దాటికొనిరి
తమకు యదునందనుఁడు కర్ణధారి యగుచు
నావ నడిపింపఁ బాండుభూనాథసుతులు. 3

వ్యాసవచనదళమ్ము గీతార్థపరిమ
ళమ్ము బహుకథా కేసరాలంకృతమ్ము
హరికథాదిత్య బోధిత మనఘుషట్ప
దమ్ము భారతపద్మమ్ము, దనుపు మమ్ము. 4

గీతామాహాత్మ్యము :

ప్రత్యహము ప్రాణాయామపరతనొప్పి
విమలగీతాధ్యయనముఁ గావించునరుని
బూర్వజన్మకృతంబులై పొదలునట్టి
దురితములు గూడ నంటంగ వెఱచుఁ గాదె. 5

అంబువులఁ బ్రత్యహమ్ము స్నానం బొనర్చి
మురికిఁ బోనాడికొనియెడి పురుషు నట్లు
నరులు సంసారమలమోచనమున కెపుడు
దాన మాడంగ వలయు గీతాస్రవంతి. 6

గీతాసుగీతా కర్తవ్యా
కిమన్యై శ్శాస్త్రవిస్తరైః,
యా స్వయం పద్మనాభస్య
ముఖపద్మా ద్వినిస్సృతా. 7

భారతామృత సర్వస్వం
విష్ణోర్వక్త్రా ద్వినిస్సృతమ్,
గీతాగంగోదకం పీత్వా
పునర్జన్మ న విద్యతే. 8

సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాలనన్దనః,
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్. 9

ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత
మేకోదేవో దేవకీపుత్ర ఏవ,
ఏకో మన్త్ర స్తస్య నామాని యాని
కర్మా ప్యేకం దేవకీపుత్రసేవా. 10

స్వయముగా విష్ణుదేవునివదనసరసి
జాతమున నుండి వెడలిన శాస్త్రవిహిత
గీతయే గాన మొనరింప రీతి యగును
గాని ఫల మున్నె యన్యశాస్త్రానుసరణి. 7

విష్ణుముఖమున మున్ముందు వెడలి యవల
భారతామృతసర్వస్వ మై రహించు
దివ్యగీతైకభాగీరథీజలమ్ము
ద్రావువారు పునర్జన్మఁ దవులుకొనరు. 8

గోగణం బెల్లనుపనిషత్కోటి గాఁగ;
వత్స పార్థుండు గా;దోగ్ధ వాసుదేవుఁ
డమర; గీతామృతమ్ము క్షీరముగ మారె
బుద్ధిమంతుఁడు దత్ క్షీరభోక్తయగును. 9

ఒకటే శాస్త్రము దేవకీవరసుత
ప్రోక్తమ్ముగీతాక్రమం ;
బొకఁడే దేవుఁడు దేవకీతనయుఁడై
యొప్పారు నారాయణుం ;
డొకటే మంత్రము దేవకీతనయుర
మ్యోంకార నామాక్షరం ;
బొకటే యొప్పగు కర్మ దేవకి కుమా
రోదారశుశ్రూషయే. 10

అథ విష్ణోర్ధ్యానమ్ :

శాన్తాకారం భుజగశయనం
పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం
మేఘవర్ణం శుభాంగమ్,
లక్ష్మీకాన్తం కమల నయనం
యోగిభిర్ధ్యానగమ్యం
వన్దే విష్ణుం భవభయహారం
సర్వలోకైకనాథమ్. 11

మూకం కరోతివాచాలం
పంగుం లంఘయతే గిరిమ్,
యత్కృపా త మహం వందే
పరమానన్ద మాధవమ్. 12

యం బ్రహ్మవరుణేన్ద్ర రుద్రమరుత
స్తున్వన్తి దివ్యై స్తవైః
వేదై స్సాంగపద క్రమోపనిషదై
ర్గాయన్తి యం సామగాః.
ధ్యానావస్థితతద్గతేన మనసా
పశ్యన్తి యం యోగినో
యస్యాన్తం న విదు స్సురాసురగణా
దేవాయ తస్మై నమః. 13

విష్ణుధ్యానము :

శ్రీకాంతుఁ గమలేక్షణుఁ శుభతను
శ్రీయుక్తునిన్ విష్ణు వి
శ్వాకారుఁ గగనోపముఁ ఘనవినీ
లాకారునిఁ సర్వలో
కైకస్వామిని బద్మనాభుని ముని
ధ్యానైకగమ్యుఁ బ్రశాం
తాకారుఁ ఫణిశాయినిఁ భవహరుఁ
ధ్యానింతు సర్వేశ్వరుఁ. 11

గిరుల నెవ్వానికృపను లంఘించుఁ గుంటి—
లీల నెవ్వానికరుణ, వాచాలుఁ జేయు
మూగవానిని—నట్టి సమ్మోదమయుని
మాధవున కేను భక్తి నమస్కరింతు. 12

బ్రహ్మరుద్రేంద్రవరుణు లెవ్వని నుతింత్రు
సామగాయకు లుపనిషత్సాంగవేద
విధి నెవని గొల్త్రు—ధ్యానైకవిధిని మదిని
మును లెవని గాంత్రు వానికే మ్రొక్కు లిడుదు. 13

సశంఖచక్రం సకిరీటకుణ్డలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్,
సహారవక్షస్థలకౌస్తుభశ్రియం
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్.

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బన్ధు శ్చ సఖా త్వమేవ,
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ.

అథ గీతాప్రశస్తిః :

సర్వశాస్త్రమయీ గీతా
సర్వవేదమయో హరిః,
సర్వతీర్థ మయీ గంగా
సర్వతేజోమయో హరిః.

అకృత్యమపి కుర్వాణో
భుంజానో వా యత స్తతః,
ఘోరం వైవస్వత స్థానం
గీతాధ్యాయీ న పశ్యతి.

శ్రీకృష్ణస్తుతిః :

ప్రపన్న పారిజాతాయ
తోత్రవేత్రైకపాణయే,
జ్ఞానముద్రాయ కృష్ణాయ
గీతామృతదుహే నమః.

శంఖచక్రసమంచితు సరసిజాక్షుఁ
బీతకౌశేయుఁ గౌస్తుభోపేతవక్షు
లలితమకుటైకకుండలాలంకరిష్ణు
విస్తృతచతుర్భుజవిశిష్టు విష్ణుఁ గొలుతు. 14

తల్లి నీ వాదు—మఱియును దండ్రి నీవ
బందుగుఁడ నీవ—సఖుఁడ వై పరగు దీవ
నీవె విద్యవు ద్రవిణమ్ము నీవ యగుదు
నీవ నాకింక సర్వమ్ము దేవదేవ. 15

గీతాప్రశస్తి :

అఖిలనిగమాది శాస్త్రమయమ్ము గీత
అఖిలవేదమయుండు నారాయణుండు
అఖిలతీర్థస్వరూప దివ్యస్రవంతి
అఖిలతేజోమయుండు ఛాయావిభుండు. 16

చెడుపనులు చేయుచున్నను ; జేసినట్టి
వాని ఫలమును బొందంగ వలసియున్న
దారుణం బైన జమునింటి దారిఁ జనఁడు
గీత నెవ్వేళ ధ్యానించు కీర్తిధనుఁడు. 17

శ్రీకృష్ణస్తుతి :

శ్రీరమేశ ! ప్రపన్న సత్పారిజాత !
ధరణి వెద చల్ల గీతామృతంబుఁ బిదికి
కేల ములుకోలఁదాల్చినకృష్ణ ! నీకు
జ్ఞానముద్ర ! యిదే నమస్కారశతము. 18

వసుదేవసుతం దేవం
కంసచాణూరమర్దనం,
దేవకీ పరమానన్దం
కృష్ణం వన్దే జగద్గురుమ్. 19

కృష్ణాయ యాదవేన్ద్రాయ
జ్ఞానముద్రాయ యోగినే,
నాథాయ రుక్మిణీశాయ
నమో వేదాన్తవేదినే. 20

యద్వాచః ప్రణవో యస్య
క్రీడావస్త్వఖిలం జగత్,
శ్రుతి రాజ్ఞా వపుర్ జ్ఞానం
తం వందే దేవకీసుతమ్. 21

సారథ్య మర్జున స్యాదౌ
కుర్వన్ గీతామృతం దదౌ,
లోకత్రయోపకారాయ
తస్మై కృష్ణాత్మనే నమః. 22

వంశీవిభూషితకరా న్నవనీరదాభా
త్పీతాంబరా దరుణబింబఫలాధరోష్ఠాత్,
పూర్ణేందు సుందరముఖా దరవిందనేత్రా
త్కృష్ణాత్పరం కిమపి తత్వ మహం న జానే. 23

కంసచాణూర సంహారకారకునకు
విశ్వగురునకు దేవకీవిమలమోద
సంప్రదాతకు వసుదేవజాతునకును
కృష్ణదేవున కే నమస్కృతి యొనర్తు. 19

జ్ఞానముద్ర ధరించిన జ్ఞానయోగి
వగుచు వేదాంతవేదివై యలరి తీవు
నాథ! యదునాథ! రుక్మిణీనాథ! కృష్ణ!
సరసమతిఁ గొమ్ము నానమస్కారశతము. 20

ఎవనివాక్యమ్ము ప్రణవమో యీసమస్త
భువన మెవ్వాని కాటవస్తువుగ నలరె
నెవని మెయి జ్ఞానమయ్యెనో యెవనియాజ్ఞ
శ్రుతి యగునో యట్టి దేవకీసుతు నుతింతు. 21

అలకిరీటికి సారథి నగుదు నగుచు
ముందుగాఁ బల్కి ముల్లోకముల కుపకృతి
సలుప గీతామృతము వెద చల్ల లేదె
కృష్ణ! కై కొమ్ము నానమస్కృతిశతమ్ము. 22

మురళిన్ గేల ధరించి; పీతవసనమ్మున్ దాల్చి నెమ్మేన; భా
సురమేఘచ్ఛవి నొప్పునాకృతిని సంశోభిల్లి; బింబాధర
స్ఫురణన్ రాజిలి;పూర్ణచంద్రముఖదీప్తుల్ బర్వఁ;గన్ దమ్ములన్
నిరతిన్ భాసిలు కృష్ణతత్త్వమునకంటెన్ మించి వేరున్నదే!

శ్రీమత్పరదేవతాయైనమః

# గీతా సప్త శతి

## ప్రథమోఽధ్యాయః - అర్జునవిషాదయోగః

---

ధృతరాష్ట్ర ఉవాచ :

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ
కిమకుర్వత సంజయ.

సంజయ ఉవాచ :

దృష్ట్వా తు పాండవానీకం
వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య
రాజా వచన మబ్రవీత్.

పశ్యైతాం పాండుపుత్రాణా
మాచార్య మహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ
తవశిష్యేణ ధీమతా॥

అత్ర శూరా మహేష్వాసా
భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ
ద్రుపదశ్చ మహారథః.

శ్రీమత్పరదేవతాయైనమః

# గీతాసప్తశతి

## మొదటియధ్యాయము - అర్జునవిషాదయోగము

---

తే—గీ॥ రణజిగీష ధర్మక్షేత్ర మనఁగఁ దగిన
యలకురుక్షేత్రమున మదీయాత్మజులును
బాండుసుతులును - జేరి యిర్వురుస నిల్చి;
రిప్పు డేమయ్యె సంజయా! చెప్పుమయ్య. 1

కురుపతి యొనర్చు నీ ప్రశ్నకుఁ సదుత్త
రముగ సంజయుఁ డిట్లనె-రణము సేయ
నిలిచియున్నట్టి పాండవానీక మరసి
ద్రోణునిఁ జేరి పలికె దుర్యోధనుండు. 2

నీకుఁబ్రియశిష్యుఁడయ్యు ధీనిధియనంగఁ
బరగు ద్రుపదాత్మజునిచేతఁ బన్నఁబడిన
పాండుసుత వాహినీ వ్యూహపరిథవమ్ము
జూడు, మాచార్య! అద్దెసఁజూడ్కి నిలిపి. 3

అనఘ! యిచ్చోట నాజి భీమార్జునులకు
దర్పమునఁ దుల్యులైనసాత్యకి విరాటు
లును; మహారథవిఖ్యాతిఁ దనరు ద్రుపద
విభుఁడుఁ గల; రెల్లరుఁ ధనుర్వేదవిదులు. 4

ధృష్టకేతుశ్చేకితానః
కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్కుంతిభోజశ్చ
శైబ్యశ్చ నరపుంగవః. 5

యుధామన్యుశ్చ విక్రాంత
ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ
సర్వ ఏవ మహారథాః. 6

అస్మాకం తు విశిష్టా యే
తా న్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య
సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ
కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ
సౌమదత్తి స్తథైవచ. 8

అన్యేచ బహవశ్శూరా
మదర్థేత్యక్త జీవితాః
నానాశస్త్ర ప్రహరణా
స్సర్వేయుద్ధ విశారదాః. 9

అపర్యాప్తం తదస్మాకం
బలం భీష్మాభిరక్షితమ్

వివర మది యేల–ధృష్టకేతువును; జేకి
తానుఁ; డతిబలశాలి కాశీనృపాల
కుండుఁ; బురుజిత్తు; గుంతిభోజుండు; మనుజ
వర్యుఁ డగుశైబ్యుఁడును గల – రార్య! కని తె. 5

మఱియు బలవంతుఁ డా యుధామన్యుఁ డమిత
దర్పితుం డుత్తమౌజుండు – ద్రౌపదేయు
లును, సుభద్రాత్మజుఁడు వ్యూహమునఁ గలారు
విధిగ వీరెల్లరును మహారథులు గారె! 6

అబ్బుర మదేల – మనసేనయందుఁ గూడఁ
దనరు మొనగాండ్ర వరుసఁ బేర్కొనెద వినుఁడు
దాన – మీమది కేర్పడుఁ దన్మహాభు
జైకబలవిక్రమములు ధరామరేంద్ర! 7

తాము సరిగద – భీష్మపితామహుండు;
సమరవిజయైకనిధి కృపాచార్యుఁ; డంగ
భూమిపతియును; భూరిశ్రవుండు; ద్రౌణి
యును; వికర్ణుండుఁ గలరు – నా కున్నె కొదువ. 8

తక్కుఁగల వీరు లంద ఱుదారమతిని
నాకుఁగా సంగరమునఁ బ్రాణంబు లేని
దొఱఁగు నానాస్త్రశస్త్రసంభరితు; లింత
కెల్లరును యుద్ధపండితులే కదయ్య. 9

రాత్రిఁబవలును భీష్మాభిరక్షిత మగు
మనబలము శత్రుదుర్భేద్య మని తలంతు

పర్యాప్తం త్విద మే తేషాం
బలం భీమాభిరక్షితమ్. 10

అయనేషు చ సర్వేషు
యథాభాగ మవస్థితాః,
భీష్మ మే వాభిరక్షంతు
భవంత స్సర్వ ఏవ హి. 11

తస్య సంజనయన్ హర్షం
కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః
శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

తతశ్శంఖాశ్చ భేర్యశ్చ
పణవానకగోముఖాః,
సహసై వాభ్యహన్యన్త
స శబ్దస్తుములోఽభవత్. 13

తతశ్శ్వేతై ర్హయై ర్యుక్తే
మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవ శ్చైవ
దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

అనిలనందనపాలితం బయ్యెఁ బాండు
తనయుల బలమ్ము సులభసాధ్యమ్ము మనకు. 10

* యొగ్గరమునకుఁ గల మార్గములకు నవల
నియమితములైన నెలవులన్ నిలిచి సమయ
మొదవినప్పుడు మీరంద ఱొకటిగాఁగఁ
జేరి మా తాత భీష్ము రక్షింత్రుగాత. 11

ద్రోణునిఁ జేరి నుడువు దుర్యోధనుఁ గని
వీర్యవంతుండుఁ గౌరవవృద్ధుఁ డైన
తాతభీష్ముండు, మనుమండుఁ దనియ శంఖ
మూఁదె గర్జించుచుఁ సింహనాద మనఁగ. 12

ఆపయిఁ శంఖభేరీమృదంగపణవ
గోముఖాదులనుండి యన్నోనఁగరాని
మ్రోఁత లెగఁబ్రాఁకి దిశల మార్మ్రోగినంతఁ
దనరె నద్దాన భయదశబ్దం బొకండు. 13

తెల్లగుఱ్ఱాలఁ జెలువారు తేరిమీఁదఁ
గూరుచున్నట్టి నందకిశోరవిజయు
లా మహాత్సంభవైకమహారవమ్ము
విని యొనర్చిరి శంఖనిస్వనము లొకట. 14

---

* అలశిఖండిని దఱుమ వ్యూహమున కవల
వలరు నిర్ణీతభాగంబు లందు మీరు,
నిలిచి, ప్రతిభంగ మాజిలోఁ గలుగ నీక
జేరి మా తాత భీష్ము రక్షింత్రుగాత.

పాంచజన్యం హృషీకేశో
దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం
భీమకర్మా వృకోదరః. 15

అనంతవిజయం రాజా
కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకుల స్సహదేవశ్చ
సుఘోషమణిపుష్పకౌ. 16

కాశ్యశ్చ పరమేష్వాసః
శిఖండీ చ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ
సాత్యకి శ్చాపరాజితః. 17

ద్రుపదో ద్రౌపదేయాశ్చ
సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహుః
శంఖాన్ దధ్ముః పృథక్పృథక్. 18

స ఘోషో ధార్తరాష్ట్రాణాం
హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీం చైవ
తుములో వ్యనునాదయన్. 19

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా
ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,

పాంచజన్యమ్ముఁ బూరించెఁ బంకజాక్షుఁ
డమ్మెయి నరుండు దేవదత్తమ్ము నూఁదె
పౌండ్రనామకశంఖమ్ముఁ బట్టి భీమ
కర్ముఁడు బకారి సేసె నుత్కటరవమ్ము. 15

కుంతిసుతుఁడు యుధిష్ఠిరకుంభినీశుఁ
డమ్మెయి ననంతవిజయ శంఖారవమ్ము
జెలఁగి కావింపఁ; గవలును జేసి రొకటి
గా ధ్వని సుఘోషమణిపుష్పకముల నెత్తి. 16

మేటివిలుకాఁడు కాశికామేదినీధ
వుండును, మహారథి యగు శిఖండియు ద్రుప
దాత్మజుఁ డజేయుఁడైన సాత్యకియు మత్స్య
పతియుఁ జేసిరి శంఖనిస్వనము లొకట. 17

ద్రౌపదేయులు ద్రుపదభూధవుఁడు మఱియు
బాహుబలవిక్రముండు సౌభద్రుఁ డాది
గాఁగల నృపాలు రెల్ల శంఖమ్ము లెత్తి
విధిగఁ బూరించి రపుడు వేర్వేరుగాఁగ. 18

అమ్మహానిస్వనము భూనభోఽంతరాళ
ముల ధ్వనించుచు ధార్తరాష్ట్రులహృదంత
రాళముల సైతముఁ జీల్చి రాణ మీఱి
దశదిశలఁ బర్వెఁ గడకు దిక్తటము లదర. 19

విను మహారాజ! పిదపఁ గపిధ్వజుండు
శస్త్రసంచాలనైక దీక్షాప్రసక్తి

ప్రవృత్తే శస్త్రసంపాతే
ధను రుద్యమ్య పాండవః. 20

హృషీకేశం తదా వాక్య
మిద మాహ మహీపతే,
సేనయో రుభయో ర్మధ్యే
రథం స్థాపయ మేఽచ్యుత. 21

యావదేతా న్నిరీక్షేఽహం
యోద్ధుకామా నవస్థితాన్,
కై ర్మయా సహ యోద్ధవ్య
మస్మిన్ రణసముద్యమే. 22

యోత్స్యమానా నవేక్షేఽహం
య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే
ర్యుద్ధే ప్రియచికీర్షవః. 23

సంజయ ఉవాచ :

ఏవముక్తో హృషీకేశో
గుడాకేశేన భారత!
సేనయో రుభయో ర్మధ్యే
స్థాపయిత్వా రథోత్తమం. 24

భీష్మద్రోణ ప్రముఖత
స్సర్వేషాం చ మహీక్షితాం,

యుద్ధసన్నద్ధులైన దుర్యోధనాది
ధార్తరాష్ట్రుల నరసి కోదండ మెత్తె. 20

ఎత్తి మధుసూదనుని గాంచి యిట్టు వలికె
నచ్యుతా! ఇంక జాగు సేయంగ నేల
ఉభయసైన్యంబులకు మధ్య నుండు నట్లు
రథముఁ దరలించి నిలుపు మెవ్విధిని నైన. 21

బవర మొనరింప నుత్సాహపడుచు నిచట
నిలువఁబడినట్టి శాత్రవానీకమందు
వరలు మొనగాండ్రలోన నెవ్వారితోడ
బోరుఁ సేయంగవలెనొ తెల్పుము మహాత్మ! 22

యుద్ధమున దుర్మతి యగు దుర్యోధనునకు
బ్రియముఁ గోరి సాయ మ్మొనరింప నిటకు
వచ్చి నిల్చిన శౌర్య సంపన్నమహితు
లైన రాజుల నొకపరి నరసి కొందు. 23

పార్థుచే నిట్లు నుడువంగఁబడిన పార్థ
సారథియు 'వల్లె' యని తేరు సాగఁదోలి
యుభయసైన్యంబులకు మధ్యనుంచె-నెల్ల
భూపతులు సూడ ద్రోణభీష్ములకు నెదుట. 24

ఉంచి గాండీవిఁ గాంచి విరించిజనకుఁ
డిట్లు వచియించెఁ బార్థ! నీయిచ్చ వచ్చి

ఉవాచ పార్థ పశ్యైతాన్
సమవేతాన్ కురూ నితి. 25

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః
పితౄ నథ పితామహాన్,
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్
పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా
శ్వశురాన్ సుహృద శ్చైవ
సేనయో రుభయో రపి. 26

తాన్ సమీక్ష్య స కౌంతేయః
సర్వాన్ బంధూ నవస్థితాన్.
కృపయా పరయావిష్టో
విషీద న్నిద మబ్రవీత్ 27

అర్జున ఉవాచ :

దృష్ట్వేమం స్వజనం కృష్ణ
యుయుత్సుం సముపస్థితమ్
సీదంతి మమగాత్రాణి
ముఖం చ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే
రోమహర్ష శ్చ జాయతే. 28–29

గాండీవం స్రంసతే హస్తా
త్త్వక్చైవ పరిదహ్యతే,

నటుల వీక్షించు మల్లదే - యని యొనర్చ
వచ్చి నిల్చిన కురుసైన్యవైభవమ్ము. 25

మేనమామలు, మామలు, మిత్రవరులు
దండ్రులుఁ, దాతలును, సహోదరులు, గురులు
బుత్రులుఁ బౌత్రు లాప్తులు మొదలగు తన
చుట్టముల, రెండు సేనలఁ జూచెఁ గ్రీడి. 26

కంటి కగపడు బాంధవోత్కరముఁ గాంచి
విజయుఁ డొక్కుమ్మడిఁ గృపావిష్టహృదయుఁ
డై మురారి విలోకించి యనియె జటిల
దుఃఖసంతప్తవచనైకధోరణి నిటు. 27

సమర మొనరింప నిలిచిన స్వజనముఁ గని
వణఁకుతోఁ బాటుమెయి, గగుర్పాటుఁ జెందె
నవయవంబుల జవ మెల్ల నడఁగుచుండెఁ
గృష్ణ ! యిదియేమి - కడకు నోరెండుచుండె. 28-29

చేతినుండి గాండీవముం జెమ్మగిల్లి
జారిపడె _ మండుచుండె శరీర మెల్ల

న చ శక్నోమ్యవస్థాతుం
భ్రమతీవ చ మే మనః. 30

నిమిత్తాని చ పశ్యామి
విపరీతాని కేశవ,
న చ శ్రేయోఽనుపశ్యామి
హత్వా స్వజన మాహవే. 31

న కాంక్షే విజయం కృష్ణ!
న చ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవింద
కిం భోగై ర్జీవితేన వా. 32

యేషా మర్థే కాంక్షితం నో
రాజ్యం భోగాః సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే
ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. 33

ఆచార్యాః పితరః పుత్రా
స్తథైవ చ పితామహాః,
మాతులాః శ్వసురాః పౌత్రాః
శ్యాలాః సంబధిన స్తథా. 34

ఏతాన్న హంతు మిచ్ఛామి
ఘ్నతోఽపి మధుసూదన,
అపి త్రైలోక్య రాజ్యస్య
హేతోః కిం ను మహీకృతే, 35

స్వాంత మేలొకో తిరుగుడుబాటుచేత
సడలువడుచుండె నిలువంగఁ జాల నింక. 30

మంచి శకునంబు లేవియు మదికిఁ దోఁప
కుండె నదికాక స్వజనమున్ భండనమున
మంటఁ గలిపినమాత్రాన మనకుఁ గలుగఁ
బోవు శుభ మెద్ది బావ! యిప్పోరు వలదు. 31

వలదు రాజ్యమ్ముఁ దత్సుఖ ప్రాప్తి వలదు
విజయకాంక్షను మొదటికే వీడుకొంటి
నవసరముఁ దీరె మాకు రాజ్యంబుతోడ
వితతభోగంబు లేల జీవిత మిఁకేల. 32

భూరిరాజ్యైక సుఖము లెవ్వారికొఱకు
నిర్ణయింపంగఁ బడినవో నియతి మీర
వారలే యిప్పు డిట ధనప్రాణములను
బణముగా నొడ్డి నిలుచున్నవారు కంటె! 33

వీర లింతకును బరాయివారు గారు
తాతలున్ దండ్రులును బుత్రతతియు గురులు
మామలును బౌత్రులును మేనమామ లింక
బావమఱఁదులు - వియ్యాలవారు సూవె. 34

మహితలోకత్రయైకసామ్రాజ్యసిద్ధి
వరలెడున్ గాక - వీరి జంపంగఁజాల
ననిన మాకిట్టి బడుగు రాజ్యంబి కేల
శాత్రవులచేతఁ జచ్చినన్ జత్తుఁగాని. 35

నిహత్య ధార్తరాష్ట్రాన్నః
కా ప్రీతిః స్యా జ్జనార్దన,
పాప మేవాశ్రయే దస్మాన్
హత్వైతా నాతతాయినః.* 36

తస్మా న్నార్హా వయం హంతుం
ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా
సుఖిన స్స్యామ మాధవ. 37

యద్యప్యేతే న పశ్యన్తి
లోభోపహతచేతసః,
కులక్షయ కృతం దోషం
మిత్రద్రోహే చ పాతకమ్. 38

కథం న జ్ఞేయ మస్మాభిః
పాపా దస్మా న్నివర్తితుం,
కులక్షయ కృతం దోషం
ప్రపశ్యద్భి ర్జనార్దన. 39

కులక్షయే ప్రణశ్యంతి
కులధర్మా స్సనాతనాః,

---

* శ్లో॥ అగ్నిదో గరద శ్చైవ
శస్త్రపాణి ర్ధనాపహః
క్షేత్రదారాపహారీ చ
షడేతే ఆతతాయినః.

ఓయదూత్తమ! యీయాతతాయిగాండ్ర
బూదిఁ గావించి పాపమ్ము మూటఁ గట్టి
కొంటయే తప్పు నిప్పు డిక్కురుకులమ్ము
వమ్ము గావింప వేఱు లాభమ్ముఁ గలదె. 36

చుట్టములు మాకు ధార్తరాష్ట్రులు గదయ్య
దాన–వీరిని బరిమార్చ నౌనె నాకు?
అన్నదమ్ముల వారిని హత మొనర్చి
వెనుక సుఖముగ మేము జీవింపఁగలమె! 37

అది యటుండఁగ లోభోపహతమనస్కు
లైన యిక్కౌరవులు వంశహానికరము
దోష మరయక మిత్రవిద్రోహ మనెడు
పాతకమునకుఁ గూడఁ బాల్పడిరి కనితె! 38

వారితో వంతు మన కేల? వనజనాభ!
కులవినాశనజనితైకఘోరపాప
ఫల మెఱింగిన మేము తత్పాపమునకు
దూరముగ నుందు – మది యొక దోస మగునె? 39

కులమునకు నాశన మ్మొనఁగూడి నపుడు
మాయవె సనాతనంపు ధర్మంబు లెల్ల

---

ఆలిఁగొంపోవువాఁడు; క్షేత్రాపహారి;
విత్తహరుఁ; డింటికిఁ జిచ్చుఁబెట్టు ఖలుఁడు;
విస మిడెడువాఁడు; హత్యగావించు నతఁడు
నాతతాయులు గారె వీ రాఱుగురును.

ధర్మే నష్టే కులం కృత్స్న
మధర్మోఽభిభవత్యుత. 40

అధర్మాభిభవా త్కృష్ణ
ప్రదుష్యన్తి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ
జాయతే వర్ణసంకరః. 41

సంకరో నరకాయైవ
కులఘ్నానాం – కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం
లుప్తపిండోదకక్రియాః. 42

దోషైరేతైః కులఘ్నానాం
వర్ణ సంకర కారకైః,
ఉత్సాద్యన్తే జాతి ధర్మాః
కులధర్మాశ్చ శాశ్వతాః. 43

ఉత్సన్నకుల ధర్మాణాం
మనుష్యాణాం జనార్దన,
నరకేఽనియమితం వాసః
భవతీ త్యనుశుశ్రుమ. 44

అహోబత మహత్పాపం
కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన
హంతుం స్వజన ముద్యతాః. 45

ధర్మ మడుగంటి నప్పు డధర్మరూప
పాపమున్ గూడఁ గులమునే మాపివైచు. 40

విను, మధర్మమ్మునకు వృద్ధి దనరినపుడు
పతితలై పోరె కులసతుల్ పద్మనాభ!
స్త్రీసతీత్వమ్మునకు హాని చెలఁగె నేని
గలిగెడుంగాదె వర్ణసాంకర్య మవని. 41

వర్ణసంకరమునఁ గులధ్వంసకులగు
చెనటులకె కాక - తద్వంశమునకుఁ గూడఁ
గలుగు నరకమ్ము - పిండోదకక్రియార
హితు లగుచు వారిపిత లధోగతిని బొంద. 42

వర్ణసంకరకారకప్రబలదోష
నికరమునఁ గాదె వంశనాశకులయొక్క
శాశ్వతములైన కులధర్మజాతి ధర్మ
సమితికిన్ జేటు మూడు నిస్సంశయముగ. 43

ధర సముత్సన్నకులధర్మ నిరతు లైన
మానవుల కెల్లరకు వేఱు మార్గ మింక
లేమిఁ బరిమితకాలమే లేని నరక
వాసమె శరణ్య మని వింటి వాసుదేవ! 44

భూరి సామ్రాజ్య సుఖలోభ బుద్ధి కిటులఁ
గట్టువడి బంధుజనులఁ జక్కాడ నెంచి
భండనంబున నిల్చు నావంటివాని
బాంధవద్రోహిఁగంటివే - బావ! చెపుమ. 45

యది మా మప్రతీకార
మశస్త్రం శస్త్రపాణయః.
ధార్తరాష్ట్రా రణే హన్యు
స్తన్మే క్షేమతరం భవేత్. 46

సంజయ ఉవాచ:

ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే
రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం
శోకసంవిగ్న మానసః. 47

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూ
పనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణా
ర్జున సంవాదే ఽర్జున
విషాదయోగో నామ
ప్రథమోఽధ్యాయః.

---

గుణము సారించి శరముఁ గైకొనక యెదిరి
కెదురుగా నిల్చిపోరాడ నిచ్చగింప
నట్టి నను ధార్తరాష్ట్రు, లస్త్రాళి నాజిఁ
జేరి చంపిన నాకదే క్షేమతరము. 46

సమరముఖమున శరశరాసనము లుడిగి
శోకసంవిగ్నమానసక్షోభఁ దవిలి
విజయుఁ డిటు లాడి తేరికి వెనుక ప్రక్క
కొరగెనని తేఁడు విన సంజయుండు నుడివె. 47

ఇది శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యా యనం
బడు యోగ శాస్త్రమందలి శ్రీమ
ద్భగవద్గీతయందు శ్రీ కృష్ణార్జున
సంవాదమున నర్జునవిషాద
యోగమను మొదటి
యధ్యాయము.



**ఓమ్ తత్సత్**

# గీతా సప్తశతి

## ద్వితీయోఽధ్యాయః - సాంఖ్యయోగః

సంజయ ఉవాచ :

తం తథా కృపయావిష్ట
మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య
మువాచ మధుసూదనః.

శ్రీభగవానువాచ :

కుత స్త్వా కశ్మల మిదం
విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య
మకీర్తికర మర్జున.

క్లైబ్యం మా స్మ గమః పార్థ
నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం
త్యక్త్వోత్తిష్ఠ పరంతప.

అర్జున ఉవాచ :

కథం భీష్మ మహం సంఖ్యే
ద్రోణం చ మధుసూదన,

ఓమ్ తత్సత్

# గీతా సప్తశతి

## రెండవ అధ్యాయము - సాంఖ్యయోగము

కనుకెలంకుల నీరు దొలఁకాడువాని
జాలిగలవాని శోకసంఛన్నముఖుని
నరదమునఁ గూలి చింతించు నర్జునుఁ గని
శౌరి, యిటు వల్కె నని తెల్పె సంజయుండు. 1

నరకమునకుఁ జుట్టటిక ; మనార్యజుష్ట
మును, నసత్కీర్తికరము నౌ మోహరూప
మైన మాలిన్య మంది తీ యసమయమున
నర్జునా! యేమి ప్రారబ్ధ మావహిల్లె ? 2
పూరుషుఁడ వయ్యు నీవు నపుంసకత్వ
మందఁబో; కిది నీకు యోగ్యంబు గాదు ;
పనికిమాలిన హృదయదౌర్బల్య మింక
వీడి యరిభీకరుండవై వేగ లెమ్ము. 3

తోడనే లేచి పార్థుఁ డతోయజాక్షు
తోడ నిటులాడె బావ! యీ ద్రోణ భీష్ము

ఇషుభిః ప్రతియోత్స్యామి
పూజార్హావరిసూదన. 4

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే,
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. 5

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 6

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్.

న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణ మింద్రియాణామ్,
అవాప్య భూమా వసపత్నమృద్ధ
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. 8

సంజయ ఉవాచ :

ఏవముక్త్వా హృషీకేశం
గుడాకేశః పరంతప,

లర్చనీయులు గాదె - యియ్యనఘవరుల
నెట్లు శరముల నొప్పింతు నీరణోర్వి? 4

గురువుల మహానుభావులఁ గూల్చు కొనుట
కంటె భైక్షుక వృత్తిఁ గైకొంట మేలు
చీల్చి గురువులఁ దద్రక్తసిక్తములగు
నర్థకామాదిభోగంబు లందలేము. 5

కలుగు మేలెద్దియో నాకుఁ దెలియ దయ్యె
నింతకే ధార్తరాష్ట్రుల నేచి మనము
మనఁగఁ జాలమొ - వారలే మనల యెదుట
వరుస నిల్చిరి - విజయ మెవ్వారి కగునొ! 6

పిరికితనమున నిజధర్మ మరయలేని
నాకు శ్రేయమ్ము గూర్చు నిర్ణయవిధాన
మున్న దేని వచించి శిష్యుని బ్రపన్ను
నన్నుఁ బనిగొమ్ము శాసించి నందతనయ! 7

మహి నకంటకమైన సంపత్సమృద్ధి
రాజ్యరమతోడ స్వర్గసామ్రాజ్యపదవిఁ
బొందియుఁ గూడ నింద్రియమ్ముల దహించు
శోక మెడలించికొను తెన్నుఁజూడనైతి. 8

కౌరవశ్రేష్ఠ! విను మింకఁ గంసవైరి
తోడ నిటు క్రీడి వలికి నీతోడు బావ!

నయోత్స్య ఇతి గోవింద
ముక్త్వా తూష్ణీం బభూవ హ. 9

త మువాచ హృషీకేశః
ప్రహసన్నివ భారత,
సేనయో రుభయో ర్మధ్యే
విషీదంత మిదం వచః. 10

శ్రీభగవా నువాచ :

అశోచ్యా నన్వశోచ స్త్వమ్
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ
నానుశోచంతి పండితాః. 11

న త్వే వాహం జాతు నాసం
నత్వం–నేమే జనాధిపాః,
న చైవ న భవిష్యామః
సర్వే వయ మతఃపరమ్. 12

దేహినోఽస్మిన్ యథా దేహే
కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతర ప్రాప్తి
ర్ధీర స్తత్ర న ముహ్యతి. 13

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ
శీతోష్ణసుఖదుఃఖదాః,

ఆజి యొనరింపఁజాల – నేనైనఁ గాని
యనుచుఁ దలవాల్చెఁ దాటస్థ్య మాశ్రయించి. 9

నెమ్మొగమ్మునఁ జిఱునవ్వు నివ్వటిల్ల
నందతనయుండు రెండు సేనలకు మధ్య
తేరి పై శోకవివశుఁడై కూరుచున్న
మఱఁదినిఁ గాంచి యిటు వల్కెఁ గురుకులేశ ! 10

మృతిని బొందిన వారిగుఱించి గాని ;
మృతిని బొందని వారి గుఱించి గాని ;
బుధులు వగవరు – నుడువుచు బుధునివోలె
వగచె దేటి – కేడ్వఁ దగని వారిఁగూర్చి. 11

దేహి నిత్యుఁ ; డనిత్యమ్ము దేహ మగుట
నేను లే నన్ననుడి సున్న – నీవు నటులె
ఈ నృపులు నట్లె మనమెల్ల నింక మీఁదఁ
బొదల మనుటయు నంతకు మున్నె సున్న. 12

విజయ ! కౌమారయౌవనవృద్ధదశలు
దేహి కీ దేహమున నెట్లు తేజరిలునో
అటులె దేహాంతరప్రాప్తి యగుఁ గదయ్య
దీని నెఱిఁగిన ధీరుఁ డజ్ఞాని గాడు. 13

ధాత్రి శీతోష్ణ సుఖదుఃఖదమ్ము లగుచు
నొప్పు విషయేంద్రియైకసంయోగవిధులు

ఆగమాపాయినోఽనిత్యా
స్తాన్ తితిక్షస్వ భారత. 14

యం హి న వ్యథయంత్యేతే
పురుషం పురుషర్షభ,
సమదుఃఖ సుఖం ధీరం
సోఽమృతత్వాయ కల్పతే. 15

నాసతో విద్యతే భావో
నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽన్త
స్త్వనయో స్తత్వదర్శిభిః. 16

అవినాశి తు తద్విద్ధి
యేన సర్వ మిదం తతమ్,
వినాశ మవ్యయస్యాస్య
న కశ్చిత్కర్తు మర్హతి. 17

అంతవంత ఇమే దేహా
నిత్యస్యోక్తా శ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య
తస్మా ద్యుధ్యస్వ భారత. 18

య ఏనం వేత్తి హంతారం
యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో
నాయం హంతి న హన్యతే. 19

క్షణికములు నస్థిరము లౌట క్షమ వహించి
యోర్చికొను మోయి కౌంతేయ! యుచితరీతి. 14

దుఃఖసుఖముల రెంటి యందున సమాన
బుద్ధి నిడు ధీరపురుషు నెప్పుడును గాని
వెతలు గల్పింప - వింద్రియవిషయసమితి
యింత కాతండు మోక్షార్హుఁ డిద్ధచరిత! 15

సత్తునకు లేదు మృత్యు వే సరణిఁ గాని
తనర దస్తిత్వ మెపు డసత్తునకు జగతిఁ
బార్థ! యీ రెంటిలోని తత్త్వమ్ముఁ దత్త్వ
విదులచేఁ జూడఁబడి ధాత్రి వెలసెఁ గాదె! 16

ఈ సమస్తంబు దేనియం దిమిడి యుండె
దాని-నవినాశిగా నీవు తలఁపుమయ్య
వ్యయ మెఱుంగని 'స' త్పదవాచ్యమైన
బ్రహ్మమును నాశన మొనర్చువాఁడుఁ గలఁడె! 17

అచ్చెరు వదేల నిత్యమై యప్రమేయ
మై వినాశమ్ము లేని జీవాత్మతోడ
నలరు తనువులు దహనయోగ్యంబు లౌట
భరతకులవీర! రణ మొనర్పంగదోయి. 18

ఎవ్వఁ డాత్మను హంతగా నెంచుచుండు
మఱియు నెవఁ డాత్మ హతముగా మతిఁ దలంచు
వీర లుభయులుఁ దెలియనివార, లాత్మఁ
జంప దెవనిఁ - దా నొరులచేఁ జంపఁబడదు. 19

న జాయతే మ్రియతేవా కదాచి
న్నాయం భూత్వా భవితా వా నభూయః,
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే. 20

వేదా వినాశినం నిత్యం
య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ
కం ఘాతయతి హంతి కమ్. 21

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

నైనం ఛిందంతి శస్త్రాణి
నైనం దహతి పావకః,
న చైనం క్లేదయంత్యాపో
న శోషయతి మారుతః. 23

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ
మక్లేద్యోఽశోష్య ఏవ చ,
నిత్య స్సర్వగత స్థాణు
రచలోఽయం సనాతనః. 24

అవ్యక్తోఽయ మచింత్యోఽయ
మవికార్యోఽయ ముచ్యతే,

పుట్టుటయు గిట్టుటయు లేక పొదలు దేహి
పూర్వమం దుండి యిపుడు రాబోఁడు తిరిగి
నిత్యుఁ డజుఁడు, పురాణుండు, నిశ్చలుండు
నైన యితనికిఁ దనుహాని - హాని లేదు. 20

చావుపుటుకలు లేక _ నాశనము లేని
నిత్యుఁడైనట్టి జీవాత్మ నిర్విశేష
తత్త్వ మెఱిఁగిన పండితోత్తముఁడు, వాని
నెట్లు చంపించు – స్వయముగా నెట్లు చంపు? 21

ప్రాఁత వైనట్టి జీర్ణ వస్త్రంబు లూడ్చి
వేఱుగా క్రొత్తపుట్టముల్ వేడ్కఁ దాల్చు
నరునివలె పీడి దేహముల్ నవ్యము లగు
వేఱు తనువుల జీవాత్మ విశ్రమించు. 22

ఆత్మ నింతకు వధియింప దస్త్రసమితి
పావకుఁడుఁ గూడ దహియింపఁ జాలు పడఁడు
నీర మేవిధిఁ దడుపఁగా నేర దనిన
వాయు వేరీతి శోషింపఁ జేయు నయ్యా? 23

ఇల వధింపంగఁబడదు – దహింపఁబడదు
తడుపఁబడ దింక నెండింపఁ బడదు సూవె
నిత్యమై సర్వగత మహాచు నెగడి స్థిరత
నచలమై శాశ్వంత బయి యలరు నాత్మ. 24

జీవుఁడు వికారశూన్యుఁ డచింత్యుఁ డింద్రి
యముల కందంగ రాని యవ్యక్తుఁ డనుచుఁ

తస్మాదేవం విదిత్వైనం
నానుశోచితు మర్హసి. 25

అథ చైనం నిత్యజాతం
నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో
నైవం శోచితు మర్హసి. 26

జాతస్య హి ధ్రువో మృత్యు
ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యార్థే
న త్వం శోచితు మర్హసి. 27

అవ్యక్తాదీని భూతాని
వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్త నిధనాన్యేవ
తత్ర కా పరిదేవనా. 28

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. 29

దేహీ నిత్య మవధ్యోఽయం
దేహే సర్వస్య భారత,
తస్మాత్సర్వాణి భూతాని
న త్వం శోచితు మర్హసి. 30

బండితులు వల్కు రతని తత్త్వం బెఱింగి
యున్న నీ కింక వగపేటి కొదవు నయ్యా! 25

ఎల్లపుడు బుట్టి చచ్చువాఁ డీత డంచు
నెంచి జీవాత్మఁ గూర్చి శంకించె దేమొ
అట్లు లైనప్పటికి దుఃఖ మందఁ దగివ
కారణం బింత కిసుమంత గానరాదు. 26

పుట్టి యున్నట్టి వానికిఁ గిట్టుటయును
గిట్టి యున్నట్టి వానికిఁ బుట్టుటయును,
నవని నీ రెంటికి స్థిరత్వ మమరి యుంట
నపరిహార్యార్థమునఁ జింత నందె దేల. 27

పుట్టుకకుఁ బూర్వమున దేహములు ధరింప;
కవలఁ జచ్చిన పిదప దేహములు లేక;
మధ్య కాలంబునఁ దేహమాత్రధారు
లైన యీ ప్రాణులకు దుఃఖ మంద నగునె? 28

చోద్య మందుచు జీవాత్మఁ జూచు నొకఁడు
మఱియొకం డచ్చెరువునఁ దన్మహిమఁ బాడు
వేఱొకఁడు దాని వినుచుండు వేడుకపడి
వినియు నెవఁడేని నింత కయ్యనఘుఁ గనెనె! 29

ఎల్ల జీవుల తనువుల నెల్ల వేళ
లందుఁ దిరుగాడు నట్టి జీవాత్మ యెపుడు
గాడు వధ్యుండు మాత్ర; మిక్కారణమునఁ
ప్రాణికోటికి నీ వేడ్వఁ బనియిఁ కేల? 30

స్వధర్మమపి చావేక్ష్య
న వికంపితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్
క్షత్రియస్య న విద్యతే. 31

యదృచ్ఛయా చోపపన్నం
స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ
లభన్తే యుద్ధ మీదృశమ్. 32

అథ చేత్త్వ మిమం ధర్మ్యం
సంగ్రామం న కరిష్యసి,
తత స్స్వధర్మం కీర్తిం చ
హిత్వా పాప మవాప్స్యసి. 33

అకీర్తిం చాపి భూతాని
కథయిష్యంతి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి
ర్మరణాదతిరిచ్యతే. 34

భయా ద్రణా దుపరతం
మంస్యంతే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో
భూత్వా యాస్యతి లాఘవమ్. 35

అవాచ్యవాదాం శ్చ బహూన్
వదిష్యంతి తవాహితాః,

సీదగు స్వధర్మ మేదియో నీక తెలియుఁ
దెలిసియుఁ జలింతు వేల నధీరు భంగి
ధరణిధవునకు ధర్మ యుద్ధంబుకంటె
శ్రేయమే లే దొకండు కౌంతేయ! వింటె. 31

పార్థ! తెరచిన స్వర్గకవాట మనఁగఁ
దగి స్వయమ్ముగ మన కిట దారసిలిన
యిమ్మహాయుద్ధవైభన మెవని కొదవు
ధర నదృష్టమ్ము గల భూపతతికిఁ దక్క. 32

ధర్మయుతమైన యిట్టి యుద్ధంబునుండి
తప్పు కొనె దేని – నీవు నీధర్మమునకుఁ
దొలఁగి - పై పెచ్చుఁగీర్తి నవ్వలకు నెట్టి
కట్టకడకుఁ బాపము మూటఁగట్టికొనెదె! 33

అవ్యయంబైన దుష్కీర్తి నంది కొన్న
నిన్నుఁ బరుషోక్తులాడి నిందింత్రు జనులు
మానవంతున కపకీర్తి - మరణబాధ
కంటె నెక్కుడు బాధగాఁ గానిపించు. 34

విజయుఁ డొకపూజ్యుఁ డంచు భావించుకొన్న
యిమ్మహారథు లొకటిగా నీసడించి
లాఘువంబందు నిగ్గని లావు దొఱఁగి
రణము సేయని పిరికివాఁడని తలంత్రు. 35

నీ విరోధులు పార్థ! నీచేవ నెఱఁగి
నోరి కసి దీర ననరాని కారుకూఁత

నిందంత స్తవ సామర్థ్యం
తతో దుఃఖతరం ను కిం. 36

హతో వా ప్రాప్యసి స్వర్గం
జిత్వా వా భోక్ష్యసే మహీం,
తస్మా దు త్తిష్ఠ కౌంతేయ
యుద్ధాయ కృతనిశ్చయః. 37

సుఖదుఃఖే సమే కృత్వా
లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ
నైవం పాప మవాప్స్యసి. 38

ఏషా తేఽభిహితా సాంఖ్యే
బుద్ధి ర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ
కర్మబంధం ప్రహాస్యసి. 39

నే హాభిక్రమనాశోఽ స్తి
ప్రత్యవాయో న విద్యతే,
స్వల్ప మప్యస్య ధర్మస్య
త్రాయతే మహతో భయాత్. 40

వ్యవసాయాత్మికా బుద్ధి
రేకేహ కురునన్దన,
బహుశాఖాహ్యనంతాశ్చ
బుద్ధయోఽవ్యవసాయినామ్. 41

లెన్నియో వల్కి నొప్పింతు రింతకంటె
దుఃఖతర మైన విషయ మెందుఁ గల దయ్య? 36

శత్రువులచేత నొకవేళఁ జంపఁబడెద
వేని స్వర్గంబుఁ గైకొందు వింతె కాదె?
రాజ్య మీ వందె దేమొ శాత్రవులఁ దునిమి
యెవఁ డెఱుఁగు? - లెమ్ము స్థిరమతి నిప్పు డనికి. 37

కలఁత వడక లాభాలాభముల-జయాజ
యముల - సుఖదుఃఖముల సమత్వము గ్రహించి
యవల యుద్ధంబు సేయంగ నరిగె దేని
నంట దే పాప మింత క్రో యనఘచరిత! 38

ఇందనుక సాంఖ్యబుద్ధి బోధించినాఁడ
నమలనిష్కామ కర్మయోగమునుగూర్చి
యిపుడు నేఁ జెప్పుదాని నీ వింక వినుము
నీకుఁ గల కర్మబంధముల్ నిన్ను వీడు. 39

విమలనిష్కామకర్మయోగమున బీజ
హానియును ; బ్రత్యవాయమ్ముఁ గానరావు
దానఁ దత్కర్మయోగైకధర్మలవము
జననమృత్యుభయమ్ము నాశన మొనర్చు. 40

తలఁపు లుడిగిన నిశ్చయాత్మకులబుద్ధి
మాత్రమే యిట్టి కళ్యాణ మార్గమందు
దనరెడిని - గోర్కులను జంపికొననివారి
బుద్ధు లెగఁబ్రాకి తుది లేక పొదలుచుండు. 41

యా మిమాం పుష్పితాం వాచం
ప్రవదం త్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ
నాన్యద స్తీతి వాదినః. 42

కామాత్మాన స్స్వర్గ పరా
జన్మకర్మఫలప్రదాం,
క్రియావి శేషబహుళాం
భోగైశ్వర్యగతిం ప్రతి. 43

భోగైశ్వర్యప్రసక్తానాం
తయాపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధిః
సమాధౌ న విధీయతే. 44

త్రైగుణ్యవిషయా వేదా
నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో
నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

యావానర్థ ఉదపానే
సర్వత స్సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు
బ్రాహ్మణస్య విజానతః. 46

వేదవాదైకరతు లవివేకు లౌచు
కృత్రిమములైన పలుకుల - నింత కంటె
వేఱొకం డింక భువిని గన్పింప దనుచు
నుబుసుపోకకు దిరుగాడుచుంద్రు గాదె. 42

వాంఛ లుడుగనివారలు స్వర్గపరులు
జన్మకర్మ ఫలంబులసమితిఁ గూర్చి
భోగములఁ గూర్చి - యైశ్వర్యములను గూర్చి
ఆడుచుంద్రు క్రియావిశేషాంచితోక్తి. 43

ఉబుసుపోకకు జ్ఞానశూన్యులు వచించు
నుడుల కపహృత హృదయులై బడుగుభోగ
తతికిఁ దలయొగ్గు జనుల చిత్తమ్ములందు
నిశ్చయాత్మకబుద్ధి గన్పింప దెందు, 44

వేదములు నొప్పెఁ ద్రైగుణ్య విషయములయి
దాన [1] యోగమ్ము, [2] క్షేమమ్ముఁ దలఁపనట్టి
ద్వంద్వరహితుండవై యాత్మవంతుఁడవయి
సతతసత్వస్థుఁడవయి నిష్కామి వగుము. 45

సలిలపూరమ్ము భూరికాసార మున్నఁ
జెలమజలమున కక్కఱ సెల్లినటుల
బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడౌ బ్రాహ్మణునకు
వేదముల నెల్ల నిఁక వల్లె వేయ నేల. 46

---

1. ప్రాప్తవస్తు ప్రాప్తికి 'యోగ' మనియుఁ
2. దద్వస్తు సంరక్షణమునకు క్షేమమనియుఁ బ్రాజ్ఞులు వ్యవహరింతురు.

కర్మణ్యే వాధికార స్తే
మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూ
ర్మా తే సంగోఽ స్త్వకర్మణి. 47

యోగస్థః కురు కర్మాణి
సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా
సమత్వం యోగ ఉచ్యతే. 48

దూరేణ హ్యవరం కర్మ
బుద్ధియోగా ద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ
కృపణాః ఫలహేతవః. 49

బుద్ధియుక్తో జహాతీహ
ఉభే సుకృత దుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ
యోగః కర్మసు కౌశలమ్. 50

కర్మజం బుద్ధియుక్తా హి
ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధ వినిర్ముక్తాః
పదం గచ్ఛ న్త్యనామయమ్. 51

యదా తే మోహకలిలం
బుద్ధి ర్వ్యతితరిష్యతి,

కర్మ యొనరింప నీకధికార ముండుఁ
గాని తత్ఫలమున కధికార మున్నె ?
కర్మఫలవాసనలకు లోఁగక - యకర్మ
నిరతిపైఁ బ్రీతి నెపుడుఁ బోనీయకయ్య. 47

కర్మ యొనరింపకుంటలోఁ గలుగు శ్రద్ధ
దొఱఁగి; సమతను సిద్ధ్యసిద్ధులఁ దగిల్చి
కర్మ లొనరింపు మయ్య యోగస్థుఁడవయి
యోగులింతకు సమతనే 'యోగ' మనిరి. 48

హీనము సకామకర్మ యం చెద నెఱింగి
యర్జున! సమత్వబుద్ధియోగాశ్రయమ్ము
నాశ్రయింపుము కారణ మరసెదేని
నైచ్యములు గావె ఫలకారణమ్ము లవని. 49

అనుపమసమత్వబుద్ధిఁ బొల్పారు నరుఁడు
పాయు నిహమునఁ బుణ్యపాపములు రెండు
గావున సమత్వబుద్ధియోగమున నుండు;
మద్దియే కర్మబంధమ్ము లంటఁ ద్రుంచు. 50

బుద్ధియోగసమంచితుల్ బుద్ధివంతు,
లుడిగి కర్మ లొనర్పఁగాఁ దొడరు ఫలము
నమృతమయమైన పరమపదము గ్రహింత్రు
పూర్తిగా జన్మబంధనిర్ముక్తు లగుచు. 51

అర్జునా! నీదుబుద్ధి మోహమ్ము నుండి
విడివడినయప్పుడే నీవు వినినయట్టి

తదా గంతాసి నిర్వేదం
శ్రోతవ్యస్య-శ్రుతస్య చ. 52
శ్రుతి విప్రతిపన్నా తే
యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి
స్తదా యోగ మవాప్స్యసి. 53

అర్జున ఉవాచ :—

స్థితప్రజ్ఞస్య కా భాషా
సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత
కి మాసీత వ్రజేత కిమ్. 54

శ్రీ భగవానువాచ :—

ప్రజహాతి యదా కామా
న్సర్వాన్పార్థ మనోగతాన్,
ఆత్మన్యేవాత్మనా తుష్టః
స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55
దుఃఖేష్వనుద్విగ్నమనాః
సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః
స్థితధీ ర్ముని రుచ్యతే. 56
య స్సర్వత్రానభిస్నేహ
స్తత్త త్ప్రాప్య శుభాశుభమ్,

దియును, వినుటకుఁ దగినట్టిదియును నైన
విమలవైరాగ్య మంది దీపింపఁగలవు. 52

వివిధసిద్ధాంతవిషయముల్ వినుటకతన
సంచలితమైన నీబుద్ధి సత్సమాధి
యందు స్థిరపడి నిశ్చల మైన యపుడె
గ్రాలెడు సమత్వరూప యోగంబు నీకు. 53

విని విని వచించె నిటు-క్రీడి-వనజనాభ!
రహి సమాధిస్థుఁడౌ స్థితప్రజ్ఞుఁ డెట్టి
వాఁ; డతం డెట్లు మాటాడు-వాఁడు గూరు
చుండు విధ మెద్ది? నడయాడుచుండు నెట్లు. 54

పలికె నాపై నిటు మురారి-పార్థ! వినుము
హృదయ మందలి నెల్లకోరికలఁ దొలఁగి
యలరి నప్పుడె-ఆత్మచే నాత్మయందె
తృప్తిఁగనువాఁడు స్థిరబుద్ధియే కదయ్య. 55

వెతలుపడు వేళ – మానసోద్వేగ ముడిగి
సుకములొదవిన వేళఁ గోరికలఁ దొలఁగి
వీతరాగభయక్రోధుఁడై తనర్చు
ముని-స్థితప్రజ్ఞుఁ డని మాను లనిరి కాదె! 56

పడసియు శుభాశుభాస్పద వస్తునిచయ
మింతకుఁ - స్నేహరహితుఁడై యెల్ల యెడల

నాభినన్దతి న ద్వేష్టి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57

యదా సంహరతే చాయం
కూర్మోఽఙ్గానీవ సర్వశః,
ఇంద్రియాణీన్ద్రియార్థేభ్య
స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58

విషయా వినివర్తన్తే
నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య
పరం దృష్ట్వా నివర్తతే. 59

యతతో హ్యపి కౌన్తేయ
పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని
హరన్తి ప్రసభం మనః. 60

తాని సర్వాణి సంయమ్య
యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేన్ద్రియాణి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61

ధ్యాయతో విషయాన్ పుంసః
సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః
కామాత్క్రోధోఽభిజాయతే. 62

వానిఁబొగడక–దూరక–వరలు నెవఁడు
వానిప్రజ్ఞయె స్థిరమౌచు వసుధ నెగడు. 57

కాలుసేతులు మెయిఁజొన్పు కమఠమట్టు
లీ స్థితప్రజ్ఞుఁడును స్వకీయేంద్రియముల
నింద్రియ విషయములనుండి యివల కీడ్చి
వరలుచుంట స్థితప్రజ్ఞవలనఁ గాదె! 58

విషయవాసన లందని విమలపురుషు
విషయసంచయ మెల్ల నివృత్త మగును
రాగమునకు నివృత్త మార్గంబు లేదు
కాని యదియును బరమాత్ముఁ గాంచి తరలు. 59

యోగసిద్ధికి యత్నించు రాగరహితుఁ
డైన విబుధుని మనమును, హానిచేయఁ
దలఁచు నింద్రియములు బలాత్కారముగను
బట్టి లాగెడుఁ దమదారి కెట్టులేని. 60

శ్రమ యనక యింద్రియముల వశం బొనర్చి
కొని సమాహిత చిత్తుఁడై తనరు నెవఁడు
వాఁడు నావాఁ; డదేమన - వాని బుద్ధి
స్థిరతవహియించుఁ గద జితేంద్రియత నలరి. 61

విషయరతుఁడైన నరునకు విషయవాస
నలను భావించు కొలఁది మనంబు నందు
గలుగు నాసక్తి - దానిచేఁ గామ మొందు
దనరుఁ దత్కామవశతఁ గ్రోధము జనించు. 62

క్రోధా ద్భవతి సంమోహః
సమ్మోహా త్స్మృతి విభ్రమః,
స్మృతిభ్రంశా ద్బుద్ధి నాశో
బుద్ధినాశా త్ప్రణస్యతి. 63

రాగద్వేష వియుక్తైస్తు
విషయా నిన్ద్రియై శ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా
ప్రసాద మధిగచ్ఛతి. 64

ప్రసాదే సర్వదుఃఖానాం
హాని రస్యోపజాయతే,
ప్రసన్న చేతసో హ్యాశు
బుద్ధిః పర్యవతిష్ఠతే. 65

నాస్తి బుద్ధి రయుక్తస్య
న చాయుక్తస్య భావనా,
న చాభావయత శ్శాంతి
రశాంతస్య కుత స్సుఖమ్. 66

ఇంద్రియాణాం హి చరతాం
యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం
వాయు ర్నావమి వామ్భసి. 67

తస్మాద్యస్య మహాబాహో
నిగృహీతాని సర్వశః,

క్రోధమున మోహ ముదయించి రాఢి మెరయు;
మోహమునను స్మృతిభ్రంశమును జనించు
స్మృతిపరిభ్రంశమున బుద్ధి చెడును బుద్ధి
నాశనము గూర్చు నరుని యున్నతికిఁ జేటు. 63

ఆత్మవశ్యంబు లగు నింద్రియముల చేత
మదిని జిక్కఁబట్టు కొనిన మానవుండు
ద్వేషరాగవిదూరుఁడై, విషయనిరతిఁ
దేలియు మనఃప్రసన్నత నోలలాడు. 64

అమరిన మనఃప్రసన్నత కప్పు డపుడె
మనుజునకు గల్గు దుఃఖముల్ మాయుఁగాదె
తర్క మేల ప్రసన్నచేతస్కుఁడైన
యన్నరుని బుద్ధి స్థిరతమై నలరు వేగ. 65

సాధనవిహీనుబుద్ధి శ్రేష్ఠత్వ మంద;
దదియునర్ గాక-ఆస్తిక్యమందఁ బోదు;
నాస్తికుం డెందు శాంతిఁబొందంగ లేదు;
శాంతిలేనియతం డెట్లు సౌఖ్య మందు? 66

ఇంద్రియముల నంతఃకరణేంద్రియమ్ము
దిరుగుచున్నట్టు లుండి నాస్తికుఁ డనఁబడు
సాధనవిహీను బుద్ధి నాశన మొనర్చుఁ
బుట్టి నష్టేటఁ బవనుండు ముంచి నటుల. 67

అర్జునా! విను సర్వేంద్రియైకవిషయ
లంపటమునుండి యింద్రియలాలసత్వ,

ఇంద్రియా ణీంద్రియార్థే భ్య
స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 68

యా నిశా సర్వ భూతానాం
తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని
సా నిశా పశ్యతో మునేః. 69

ఆ పూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,
తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ. 70

విహాయ కామాన్ యస్సర్వాన్
పుమాంశ్చరతి నిస్పృహః,
నిర్మమో నిరహంకారః
స శాన్తి మధిగచ్ఛతి. 71

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ
నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి
బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72

ఓమ్ తత్సదితి శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణా
ర్జున సంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః.

---

మెవఁడు మఱలించి కొని తరియింపఁ గలఁడొ
యతని బుద్ధియె స్థిరమైనదని వచింతు. 68

ప్రాణికోటికి రాత్రిగా పరిణమించు
సమయమున జాగృతిఁ గాంచు సంయమీంద్రుఁ,
డటులె భూతాళి, క్షణిక సౌఖ్యముల కొఱకు
మేలుకొనువేళ రాత్రియై క్రాలు మునికి. 69

కదలి నదులెల్లఁదనసీటఁ గలియుచున్నఁ;
జలనమెఱుఁగని సంద్రమ్మువలె-స్థిరమతి,
అమిలకొను కోర్కులకు లొంగ కమల శాంతి
నెగడుఁగాదె - సకామి గానేరడట్లు. 70

కోరికల నెల్లఁ దుదముట్టఁ బారఁదోలి
యొదవు మమకారమునకు వశ్యుండు గాక,
నెగడి నిరహంకృతి స్ఫూర్తి నిస్పృహుఁ డయి
వరలు మహనీయుఁడు ప్రశాంతిఁ బడయు నెపుడు. 71

బ్రహ్మనిర్వాణ సంస్థితిఁ బడయువాని
మార్గ మిది - దీనిఁ గైకొన్న మానవుండు
దొడరి తన్నిష్ఠ వ్యామోహ ముడిగి మరణ
మొందినపు డైన బ్రహ్మసాయుజ్య మందు. 72

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషద్బ్రహ్మవిద్య యనంబడు
యోగశాస్త్రమందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీ కృష్ణా
ర్జునసంవాదమున సాంఖ్యయోగం బను
రెండవ అధ్యాయము.

---

శ్రీమత్పరదేవతాయై నమః.

# గీతా సప్తశతి

## అథ తృతీయోఽధ్యాయః – కర్మయోగః

---

అర్జున ఉవాచ:

జ్యాయసీచే త్కర్మణ స్తే
మతా బుద్ధి ర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరే మాం
నియోజయసి కేశవ. 1

వ్యామిశ్రేణేవ వాక్యేన
బుద్ధిం మోహయసీవ మే,
త దేకం వద నిశ్చిత్య
యేన శ్రేయోఽహ మాప్నుయామ్. 2

శ్రీభగవా నువాచ :

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా
పురా ప్రోక్తా మయానఘ,

శ్రీ మత్పరదేవతా యై నమః

# గీతా స ప్త శ తి

## మూఁడవ అధ్యాయము - కర్మయోగము

---

కవ్వాడి వచించె సంశయగ్రస్తుఁ డగుచుఁ
గడకు నివ్విధి, జ్ఞానమే కర్మ కంటె
మిన్న యని నీకుఁ దోఁచుచో నన్ను మఱల
ఘోరకర్మ నియోగింపఁ గోరె దేల ? 1

జ్ఞానకర్మైకపరము భాషణ మొనర్చి
వికలమతిఁ జేసి నన్నేడిపింతు వేల ?
కడకు నిద మిద్ధమని తేల్చి నుడువు మయ్య
యేకవాక్యంబుగా శుభం బేను బడయ. 2

పార్థు నుడు లెల్ల విని యిటు పల్కె-శౌరి
† జ్ఞానయోగమ్ము-నెకతమున జ్ఞానితతికి

---

† మాయా జకనములగు సంపూర్ణ గుణములే గుణము లందు ప్రవర్తిల్లు చున్న వని తెలిసికొని మానసిక, శారీ రక క్రియలయందు కర్తృత్వాభి మానమును జంపుకొని పరమాత్మునియందేకీభావము వహించి యుండుటయే జ్ఞానయోగ మనియు, సాంఖ్య యోగమనియు నందురు.

జ్ఞానయోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినామ్. 3

న కర్మణా మనారంభా
నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
నచ సన్న్యసనాదేవ
సిద్ధిం సమధిగచ్ఛతి. 4

న హి కశ్చిత్ క్షణ మపి
జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజై ర్గుణైః. 5

కర్మేంద్రియాణి సంయమ్య
య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా
మిథ్యాచార స్స ఉచ్యతే. 6

యస్త్వింద్రియాణి మనసా
నియమ్యారభతేఽర్జున,

* విమలనిష్కామకర్మయోగమున యోగి
వరుల కగు†నిష్ఠ లెన్నఁడో. పలుకఁ బడియె. 3

అనఘ! కర్మలారంభింప నంతమాత్రఁ
బడయఁడు నరుండు నైష్కర్మ్య ఫలముసుంతఁ
బ్రత్యహ మొనర్చు కర్మలన్ వదలికొన్న
నెట్లొదవు దైవసందర్శ నైకసిద్ధి? 4

తనకుఁ దగురీతి క్షణకాలమునకు నేని
బని యొనర్పక యుండ డెవ్వాఁడుఁ గాని
నైజగుణముల నలరు జనంబులెల్ల
రును, స్వకర్మాభినిరతి నిరూఢిఁ గాంత్రు. 5

ఇంద్రియార్థమ్ములైన భోగైకవాంఛ
లాత్మఁ దలఁచుచుఁ గర్మేంద్రియములఁ బైకి
నిగ్రహించిన వానిగా నెగడు నట్టి
హీనునిన్ దాంభికునిగ నూహించి కొనుము. 6

మనసుచే నింద్రియ బలమ్ము నణచి వైచి;
కర్మఫలభోగనిరతుండుగాక సలుపు

---

* ఫలాపేక్ష వదలికొని భగవదర్థముగా సమత్వబుద్ధిచే చేయఁబడు కర్మకే నిష్కామకర్మయోగ మని పేరు. దీనికే సమత్వయోగమనియు-బుద్ధియోగమనియుఁ గర్మయోగమనియుఁ దదర్థకర్మయనియు - మదర్థకర్మయనియు, మత్కర్మయనియును మున్నగు నామములు గలవు.

† సాధకుని సాధనయొక్క పరిపక్వావస్థ - అనగా - పరాకాష్ఠకు, 'నిష్ఠ' అని పేరు.

కర్మేంద్రియైః కర్మయోగ
మసక్తస్స విశిష్యతే. 7

నియతం కురు కర్మ త్వం
కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే
న ప్రసిద్ధ్యే దకర్మణః. 8

యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర
లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ
ముక్తసంగ స్సమాచర. 9

సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా
పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ
మేష వోఽస్త్విష్టకామధుక్. 10

దేవాన్ భావయతానేన
తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయన్తః
శ్రేయః పర మవాప్స్యథ. 11

ఇష్టాన్ భోగాన్హి వో దేవా
దాస్యన్తే యజ్ఞభావితాః,
తైర్దత్తానప్రదాయైభ్యో
యో భుంక్తే స్తేన ఏవ సః. 12

నెవఁడు గర్మయోగమ్ముఁ గర్మేంద్రియముల
వలన నాతండు శ్రేష్ఠుఁడై వరలుచుండు. 7

కర్మ యొనరింప కుండుట కంటెఁ గర్మ
చేయుటయె లెస్స – శాస్త్రైకసిద్ధ మైన
నీస్వధర్మమ్ము నెరవేర్పు - నీవొనర్ప
కున్నచో దేహయాత్రకే యొదవు ముప్పు. 8

యజ్ఞములు గాక యేకర్మ లైన సలుపు
మానవుఁడు గర్మబంధనాధీనుఁ డగును
గాన, గౌంతేయ! ముక్తసంగత్వవశత
మెలఁగి కావింపు భగవన్నిమిత్త కర్మ. 9

“ఇమ్మహాయజ్ఞమే వృద్ధి నిచ్చి మీకు
వాంఛ లొనఁ గూర్చు” నని ప్రజాపతి స్వయముగ
యజ్ఞములతోడఁ బ్రజలఁ గల్పాది యందు
సృష్టిఁ గావించి, వారి, శాసించెఁ గాదె! 10

వేల్పు లౌన్నత్య మంద భావింతు వేని –
వారు నీ కున్నతి ఘటించి వరలు చుందు;
రిటు పరస్పరభావనాపటిమ నెఱపు
కొనుచు శ్రేయస్సు నీ వంది కొనుము పార్థ! 11

యజ్ఞభావితు లగు వేల్పు లపుడె మీకు
వాంఛి తార్థంబు లిడుదురు – వారివలనఁ
బ్రాప్తధనుఁ డయ్యు జనుఁడు దేవతలఁ దృప్తి
బరపక సుఖించువాఁడు తస్కరుఁడు గాడె. 12

యజ్ఞ శిష్టాశిన స్సంతో
ముచ్యంతే సర్వకిల్బిషైః,
భుంజంతే త్వఘం పాపా
యే పచంత్యాత్మకారణాత్. 13

అన్నా ద్భవతి భూతాని
పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞా ద్భవతి పర్జన్యో
యజ్ఞః కర్మసముద్భవః. 14

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి
బ్రహ్మాక్షరసముద్భవం,
తస్మాత్సర్వగతం బ్రహ్మ
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం. 15

ఏవం ప్రవర్తితం చక్రం
నానువర్తయతీహ యః,
అఘాయు రింద్రియారామో
మోఘం పార్థ స జీవతి. 16

యస్త్వాత్మ రతిరేవస్యా
దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్ట
స్తస్య కార్యం న విద్యతే. 17

నైవ తస్య కృతేనార్థో
నాకృతేనేహ కశ్చన,

యజ్ఞశిష్టాన్న భోక్తలౌ యనఘచరితు
లఘువినిర్ముక్తులై పొల్తు - రదియటుండఁ ;
బొట్టకూటికి నై పలుపోక లంది
మనెడు పాపులు దురితమ్ము లనుభవింత్రు 13

పుట్టు నన్నంబుచే సర్వభూతకోటి;
కలుగు నన్నంబు మేఘోదకముల చేత ;
జనన మందు మేఘుండు యజ్ఞమ్మువలన
మహిత యజ్ఞమ్ము కర్మసంభవము సుమ్ము. 14

కర్మ వేదోద్భవం బౌచుఁ గ్రాలెఁ గాదె ;
వేద - మవినాశి విధిచేత వెలసెఁ ; దాన
సర్వగతుఁడైన బ్రహ్మ యజ్ఞమ్ము నందుఁ
బరగెడుఁ బ్రతిష్ఠతుం డయి ప్రత్యహమ్ము. 15

ఇవ్విధిఁ బ్రవర్తమానమై యిహము నందు
దనరు నీసృష్టి చక్రంబు ననుసరించి
మెలఁగని యత డింద్రియసుఖంబులను దవిలి
చెలఁగుఁ బాపాయువై వ్యర్థ జీవితమున. 16

ఆత్మరతియై చెలంగుచు ; నాత్మతృప్తుఁ
డగుచు ; నెవఁ డాత్మసంతుష్టుఁడై మెలంగు ;
నట్టి జ్ఞానైకవేత్త కేయవసర మగు
కార్య మొక్కటియుఁ గూడఁ గానఁ బడదు. 17

చేసినను గర్మఁ బ్రాల్మాలి చేయ కున్న
జ్ఞాని కెవ్విధి లాభమ్ముఁ గానరాదు,

న చాస్య సర్వభూతేషు
కశ్చిదర్థవ్యపాశ్రయః. 18

తస్మా దసక్త స్సతతం
కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ
పర మాప్నోతి పూరుషః. 19

కర్మణ్యైవ హి సంసిద్ధి
మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహ మేవాపి
సంపశ్యన్ కర్తు మర్హసి. 20

యద్యదాచరతి శ్రేష్ఠ
స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే
లోక స్తదనువర్తతే. 21

న మేపార్థాస్తి కర్తవ్యం
త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం
వర్త ఏవ చ కర్మణి. 22

యది హ్యాహం న వర్తేయం
జాతు కర్మణ్య తన్ద్రితః,
మమ వర్త్మాను వర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః. 23

తనర దతనికి సర్వభూతముల తోడ
స్వార్థ పర మగు నెట్టి సంబంధ మెపుడు. 18

దాన మోహాదు లందున దవులు కొనక
నిత్య మొనరింపఁదగు కర్మ నీ వొనర్పు;
మనఘ! కర్మసలిపి పరమాత్మదివ్య
గతి, ననాసక్తుఁ డై పొందుఁ గాదె నరుఁడు. 19

జనకుఁ డాదిగ నృపతు లాసక్తి లేని
వార లే యయ్యుఁ గర్మైకవశత సిద్ధి
నంది; రద్దాన లోకకళ్యాణమునకు
నైనఁ గర్మ మొనర్చి పే రందికొనుము. 20

పూనికఁ గొన్న ధీరుఁడౌ పూరుషుండు
జగతి శ్రేష్ఠుండు వోయిన సరణి నరిగి
తత్ప్రమాణైకసంసిద్ధిఁ దాను గొనుచు
ననుసరించెడుఁ గాదె ప్రత్యహము పార్థ! 21

చేయఁ దగు కార్య మెదియుఁ గౌంతేయ! నాకు
మూఁడు లోకమ్ము లందున మొదలె లేదు
పొందఁ దగు దాని బొందక పోవుటయును
గలుగ; దటు లయ్యు నొనరింతుఁ గర్మ లెపుడు. 22

కొసకు నొకవేళ జాగరూకుండ నౌచు
నెల్ల కర్మల నేఁ బ్రవర్తిల్లకున్న
నన్ని విధముల నామార్గ మనుసరించు
ప్రజలకే నెట్లు మార్గదర్శకుఁడ నౌదు? 23

ఉత్సీదేయు రిమే లోకా
న కుర్యాం కర్మ చే దహమ్,
సంకరస్య చ కర్తా స్యా
ముపహన్యామిమాః ప్రజాః. 24

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో
యథా కుర్వన్తి భారత,
కుర్యా ద్విద్వాన్ స్తథా సక్త
శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్. 25

న బుద్ధిభేదం జనయే
దజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయే త్సర్వకర్మాణి
విద్వా న్యుక్త స్సమాచరన్. 26

ప్రకృతేః క్రియ మాణాని
గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా
కర్తాహ మితి మన్యతే. 27

తత్వవిత్తు మహాబాహో
గుణకర్మ విభాగయోః,
గుణాగుణేషు వర్తన్త
ఇతి మత్వా న సజ్జతే, 28

కర్మ లొనరింప నేని లోకమ్ము లెల్ల
భ్రష్ట మగు సంకరమునఁ; దద్భ్రష్టలోక
ములకు నేఁగర్తనై లోకముల వసించు
ప్రజలకే మారకుఁడ నౌచు వరలుదుఁగద! 24

కర్మపరులౌ నపండితుల్ గర్మలయెడ
సక్తు లగు చందమున ననాసక్తుఁ డగుచుఁ
గాలు బుధుఁడును లోకసంగ్రహముఁ గోరి
మార్గదర్శకుఁ డౌచుఁ గర్మల నొనర్చు. 25

తెలివిమాలిన కర్మకాంక్షులమతమ్ము
గోవిదుఁడు మార్చి యశ్రద్ధఁ గూర్ప రాదు
నిఖిలకర్మ లొనర్చుచు నిష్ఠఁ దవిలి
వారిచేఁ దాను జేయింప వలెను గాదె! 26

ప్రకృతి గుణములఁ గొనసాగఁ బడెడు కర్మ
వితతికర్తృత్వముఁ దనపైన వైచు
కొని యహంకృతి నేఁ జేసితి నని మూర్ఖ
జనుఁడు వదరెడు మిథ్యాప్రచారబుద్ధి. 27

జ్ఞాన కర్మేంద్రియాది గుణప్రకార
విభజనము నుండి – ఆత్మను వేరు జేయు
* ముని, గుణమ్ములతో గుణము లొనరించు
వర్తనం బని యెఱిఁగి తద్వశుఁడు గాడు. 28

* త్రిగుణాత్మక మగు మాయ యొక్క కార్యరూపములగు పంచ
మహాభూతములు – పంచజ్ఞానేంద్రియములు – పంచకర్మేంద్రియములు

ప్రకృతే ర్గుణసంమూఢా
స్సజ్జంతే గుణకర్మసు,
తానకృత్స్నవిదోమందాన్
కృత్స్నవిన్న విచాలయేత్. 29

మయి సర్వాణి కర్మాణి
సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా
యుధ్యస్వ విగతజ్వరః. 30

యే మే మత మిదం నిత్య
మనుతిష్ఠన్తి మానవాః,
శ్రద్ధావంతోఽను సూయన్తో
ముచ్యన్తే తేఽపి కర్మభిః. 31

యే త్వేతదభ్యసూయన్తో
నానుతిష్ఠంతి మే మతమ్,
సర్వజ్ఞాన విమూఢాన్ స్తాన్
విద్ధి నష్టానచేతసః. 32

సదృశం చేష్టతే స్వస్యాః
ప్రకృతేర్ జ్ఞానవానపి,

ప్రకృతిగుణముల చే మోహపరవశు లగు
జనులు గుణకర్మ లందు సంసక్తు లౌదు;
రట్టి యవివేకు లైన మూఢాత్ములపయి
జ్ఞాని యెవ్విధి నధికార మూనరాదు. 29

నిఖిల కర్మలు నాయందు నిల్పి వైచి
ఆశ లన్నింటి ద్రుంచి యధ్యాత్మబుద్ధి
వీడి మమకారమును — దాపవిరహితుండ
వగుచు నీ విఁక దురము సేయం గదయ్య. 30

ఈసు విడనాడి శ్రద్ధకు దోసిలొగ్గి;
పార్థ! నాయీమతమ్ముఁ జేపట్టి నట్టి
మానవులు పూర్ణకర్మైకమార్గ ముడిగి
ముక్తిఁ బడయుదు రింతక మోఘయుక్తి. 31

ఈర్ష్య వహించు జనులు నా యీమతమ్ము
ననుసరింపక చరియింతు రను దినమ్ము
నఖిల విజ్ఞాన విరహితు లైనవారి—
నిరయ మందిన వారిగా నెఱుఁగు మయ్య. 32

తమకుఁ దగుకర్మ నెల్లరుఁ దా మొనర్ప;
జ్ఞానియు, నొనర్చుఁ బ్రకృతికిఁ దాను లొంగి

---

ఇత్యాది పంచ విషయముల సముదాయమునకు గుణవిభాగమని పేరు.. వీని పరస్పర చేష్టలకుఁ గర్మవిభాగమని పేరు.

ఈ గుణకర్మవిభాగములనుండి ఆత్మను వేరుచేయుటకే తత్వ మందురు.

ప్రకృతిం యాన్తి భూతాని
నిగ్రహః కిం కరిష్యతి. 33

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే
రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయోర్న వశమాగచ్ఛే
త్తౌ హ్యస్యపరిపన్థినౌ. 34

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః. 35

అర్జున ఉవాచ :—

అథ కేన ప్రయుక్తోఽయం
పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ
బలాదివ నియోజితః. 36

శ్రీ భగవానువాచ :—

కామ ఏష క్రోధ ఏష
రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేనమిహ వైరిణమ్. 37

ధూమేనావ్రియతే వహ్ని
ర్యథాదర్శో మలేన చ,
యథోల్బేనావృతో గర్భ
స్తథా తేనేదమావృతమ్. 38

అఖిల భూతాళి ప్రకృతినే యనుసరింప
నింత కద్దాని నిఁక నిగ్రహించు నెవఁడు? 33
అనఘ! విను మింద్రియైక భోగాదు లందు
రాగవిద్వేషములు రెండు రవులు చుండు
వానికిఁ జ్ఞాని లోఁగ డెప్పగిది నేని
గత మదే మన - నవి - వైరు లతని కెపుడు. 34
ఆచరణశుద్ధి నుత్తమ మైన యన్య
ధర్మమున కంటె మేలు స్వధర్మ, మగుణ
మయ్యు - నొకవేళ మృతి దీన నలరు నేని
హితము గాదె భయావహం బితర మాట. 35

వెంటనే పార్థుఁ డిట్లాడె వెన్నుని గని
వినుము నీవింత దనుక చెప్పిన నరుండు
తలంపు లేకుంట నొకని ప్రోద్బలముచే ని
యోజితుం డయ్యుఁ బాపసంయుతుఁడు గాడె! 36

ఆవెనుక శౌరి యిటుల గాండీవి కనియె
క్రోధరూప కామము, రజోగుణజ మాట
వహ్నిగతి భోగసంతృప్తిఁ బడయ కున్కి-
నమ్మహాపాపి వైరిగా నరసి కొనుము. 37
అగ్ని ధూమ సమన్విత మైన యట్లు;
దర్పణము ధూళిచేఁ గాంతి తఱిగి నట్లు;
మావిచేగర్భపిండమ్ము మాటువడిన
యటులఁ గామమ్ముచే జ్ఞాన: మడఁగి యుండు. 38

ఆవృతం జ్ఞాన మేతేన
జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌన్తేయ
దుష్పూరేణానలేన చ. 39

ఇంద్రియాణి మనోబుద్ధి
రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష
జ్ఞానమావృత్య దేహినమ్. 40

తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ
నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహిహ్యేనం,
జ్ఞాన విజ్ఞాన నాశనమ్. 41

ఇంద్రియాణి పరాణ్యాహు
రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి
ర్యోబుద్ధేః పరతస్తు సః. 42

ఏవంబుద్ధేః పరం బుద్ధ్వా
సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో
కామరూపం దురాసదమ్. 43

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణా
ర్జున సంవాదే కర్మయోగో నామ
తృతీయోఽధ్యాయః.

తృప్తినొందని యనలునా కృతి వహించి
జ్ఞానులకు నిత్యవైరియై సంచరించు
కామమునఁ గాదె జ్ఞానసంఘాత మెల్ల
మఱుగు పడుచుండు క్షణములో మాయ మగుచు. 39

బుద్ధియు; మనమ్ము నింద్రియమ్ములును గామ
మునకుఁ బెద్దల ధిష్ఠానము లనియండ్రు
కనుక నే స్థానబలిమిచేఁ గామ, మెఱుక
నడఁచి దేహధారులను మోహమున డించు. 40

అట్టులై యుంట విను మింద్రియములఁ గెల్చి
జ్ఞానవిజ్ఞాననాశనోత్సాహి యైన
యుద్ధురిత చిత్తుఁ గాము నీ విపుడు దోలుత
రోషమున ద్రుంచి కర్మవీరుండ వగుము. 41

అనఘ! బలవత్తరం బింద్రియైకబలము ;
దానికంటె మనం బతీ తమ్ముగాదె!
బుద్ధి మది కంటె గొప్పది– బుద్ధికంటె
నెక్కుడగు దాని నాత్మగా నెఱిగి కొనుము. 42

మహితబుద్ధి కతీత మాత్మ యని యెఱిఁగి
యాత్మచే నాత్మ స్వాధీన మగు విధాన
నిగ్రహించి యజేయుఁడై నెగడు కామ
రూపపరిపంథి దున్మి వీరుండ వగుము. 43

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషద్బ్రహ్మవిద్యయనంబడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీతయందు శ్రీ కృష్ణార్జున
సంవాదమునఁ గర్మయోగం బను మూఁడవ
అధ్యాయము.

ఓమ్ శ్రీ పరమాత్మనే నమః.

# గీతా సప్తశతి

## అథ చతుర్థోఽధ్యాయః - జ్ఞానయోగః

అర్జున ఉవాచ:

ఇమం వివస్వతే యోగం
ప్రోక్తవాన హ మవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ
మను రిక్ష్వాకవేఽబ్రవీత్ 1

ఏవం పరమ్పరా ప్రాప్త
మిమం రాజర్షయోవిదుః,
సకాలేనేహ మహతా
యోగోనష్టః పరంతప. 2

స ఏవాయం మయాతేఽద్య
యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసిమే సఖాచేతి
రహస్యం హ్యేతదుత్తమమ్. 3

అపరం భవతో జన్మ
పరం జన్మవివస్వతః,
కథమేతద్విజానీయామ్
త్వమాదౌ ప్రోక్తవానితి. 4

శ్రీమత్పరదేవతాయైనమః

# గీతాసప్తశతి

## నాల్గవ అధ్యాయము - జ్ఞానకర్మసన్న్యాసయోగము

---

అవ్యయం బైన యీ యోగ మంశుమాలి
కేను గల్పాది నుడువ-నయ్యినుఁడు, దనయుఁ
డైన మనువునకుఁ జెప్పె-నతఁడుఁ గూడ
సుతున కిక్ష్వాకునకుఁ దెల్పె హితమితోక్తి. 1

ఇవ్విధిఁ బరంపరాగత మీ యమూల్య
విమలయోగమ్ము రాజర్షి వితతి చేతఁ
బొందఁ గాఁబడి చిరకాలమునకు నిప్పు
డద్ది కనుపట్ట దీ లోక మందు నెచట. 2

అప్పురాతనయోగమే యిప్పు డిచట
పార్థ! నాచేత నీకుఁ దెల్పంగఁ బడియె
నీవు భక్తుఁడ-వదికాక స్నేహితుండ
వైతి - విదియు నుత్తమము-రహస్యయుతము 3

నవ్వి యిటు వల్కెఁ గవ్వడి - నందతనయ!
పుట్టితివి నీవు మొనమొన్న, ముందు పుట్టి
నట్టి రవికి గురుండవై యెట్లు బోధఁ
జేసితివి - దీని నే విశ్వసించు టెట్లు? 4

శ్రీ భగవానువాచ :

బహూని మే వ్యతీతాని
జన్మాని తవ చార్జున,
తా న్యహం వేద సర్వాణి
నత్వం వేద్థ పరంతప. 5

అజోఽపి సన్నవ్యయాత్మా
భూతానా మీశ్వరోఽపిసన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ
సంభవా మ్యాత్మమాయయా. 6

యదాయదా హి ధర్మస్య
గ్లాని ర్భవతి భారత,
అభ్యుద్ధాన మధర్మస్య
త దాత్మానం సృజామ్యహమ్. 7

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం,
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే. 8

జన్మకర్మ చ మే దివ్య
మేవం యో వేత్తి తత్వతః,

తోడనే నవ్వి యిటు వల్కెఁ దోయజాక్షుఁ
డో పరంతప! నాకు నీ కీపగిదిని
నెన్నియో జన్మ లిప్పటికే గతించె
నీ వెఱుంగవు; కాని నా కెఱుక లేదె! 5

అజుఁడనై నాశనము లేక యలరు చున్న
యేను ప్రాణుల కెల్ల నధీశ్వరుండ
నయ్యు - నాత్మ ప్రకృతివశ మందు నిలిపి
కొనుచు నిజమాయఁ బుట్టు చుందును గదయ్య. 6

క్షితి నధర్మమ్మునకు మహోన్నతి ఘటిల్లి;
ధర్మమున కెప్పు డెప్పుడు దనరు ముప్పు;
నన్ను నేనుగ సృష్టించి కొన్న మేన
నవతరించెదఁ దగురీతి నప్పు డపుడె. 7

శిష్టజనముల రక్షించి; దుష్టజనులఁ
దవిలి చెండాడి; ధర్మసంస్థాపనమ్ముఁ
జేయ మది నెంచి యుంటఁ గౌంతేయ! నేను
జనన మందెదఁ బ్రతియుగంబున నిజేచ్ఛ. 8

తివిరి మజ్జన్మకర్మలు దివ్యము లని
* తత్త్వఫణితి నెఱింగెడు తత్త్వవేత్త

* కేవలము ధర్మ సంస్థాపనము కొఱకై తనయోగమాయచే సగుణ రూపుఁడై భగవానుఁడు వెలయుచున్నాఁడని తెలిసికొనిన వాఁడే తత్త్వవేత్త యని భావము.

త్యక్త్వా దేహం పునర్జన్మ
నైతి–మా మేతి సోఽర్జున. 9

వీతరాగభయక్రోధా
మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా,
పూతా మద్భావ మాగతాః. 10

యే యథా మాం ప్రపద్యన్తే
తాన్ స్తథైవ భజా మ్యహమ్,
మమ వర్త్మాను వర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః. 11

కాంక్షంతః కర్మణాం సిద్ధిమ్
యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే
సిద్ధి ర్భవతి కర్మజా. 12

చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణకర్మవిభాగశః,
తస్య కర్తా ర మపి మామ్
వి ద్ధ్యకర్తా ర మవ్యయమ్. 13

న మాం కర్మాణి లింపంతి
నమే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి
కర్మభి ర్న స బధ్యతే. 14

దేహముఁ ద్యజించినన్ జన్మఁ దిరిగి పొందఁ
డంతియే కాక నన్ జేరు నతఁడు పార్థ! 9

విజయ! రాగభయక్రోధవిరహితు లయి
నన్ను నన్యభావమున నాపన్ను లగుచు
శరణు సొచ్చిన యెందఱో జ్ఞానతపము
చేఁ బునీతు లై మద్భావసిద్ధిఁ గనరె! 10

ఎవ్వ రేవిధి నన్ భజియింత్రు భక్తి
నేను – వారి నవ్విధి భజియింతుఁ బ్రేమ
యీ రహస్య మెఱింగిన సారమతులు
జనులు నామార్గ మన్నింట ననుసరింత్రు. 11

కర్మజం బైన సంసిద్ధి గడురయమునఁ
గలుగు చుంట మనుష్యలోకమ్ము నందు
మనుజు లాత్మీయ కర్మల కనువు పడెడు
ఫలము లెద నెంచి వేల్పులన్ గొలుచు చుంద్రు. 12

వర్ణములు, గుణకర్మవిభాగరీతి
వరుసగా నాచె సృష్టింపఁ బడియెఁ బుడమి
నసఘ! వానికి నేఁ గర్త నయ్యు – మఱియుఁ
గాకయుందు – నవ్యయుఁడ నై క్రాలుచుంట. 13

కర్మఫలనిస్పృహుఁడ నైన కారణమున
నన్ను జేనవేసి కర్మ లెన్నడును గాని
బాధ గావింప వని తత్త్వఫణితి నెఱుఁగు
వాఁడు కర్మవిముక్తుఁ డై వసుధ నెగడు. 14

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ
పూర్వై రపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం
పూర్వైః పూర్వతరం కృతమ్. 15

కిం కర్మ కి మకర్మేతి
కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి
యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 16

కర్మ ణోహ్య పి బోద్ధవ్యమ్
బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణ శ్చ బోద్ధవ్యమ్
గహనా కర్మణో గతిః. 17

కర్మ ణ్య కర్మ యః పశ్యే
దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమాన్ మనుష్యేషు
స యుక్తః కృత్స్నకర్మకృత్. 18

యస్య సర్వే సమారంభాః
కామసంకల్ప-వర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం
త మాహు ర్పండితం బుధాః. 19

త్యక్త్వా కర్మఫలాసంగం
నిత్యతృప్తో నిరాశ్రయః,

ము న్నిది యెఱింగి మోక్షమ్ముఁ బొందినట్టి
వారు నిష్కామ కర్మచే వరల లేదె!
తమకు ముందున్న వానిని దా మొనర్చు
పూర్వు లటు — నీవుఁ గర్మలఁ బొదలు మయ్య. 15

కర్మ యనఁగ నెయ్యదియొ — అకర్మ యనఁగ
నెద్దియో — రెంటి భేదంబు తెలియఁగ కిందు
బుధులు వెత లందెదరు — దాని బోధ నీకు
మమతఁ గావింతు భవబంధనములు దొలఁగ. 16

కర్మగతియును, మఱియు నకర్మగతియు
స్థిరముగ నెఱింగి; పిదప నిషిద్ధకర్మ
గతి నెఱుంగుటఁ బాడియౌఁ ; గాని కర్మ
గతిని మాత్ర మెఱుంగ శక్యంబు గాదు; 17

అనఘ! కర్మలఁ దదభావ మరసి—యెవఁడు
పూర్ణ కర్మ పరిత్యాగమునను గూడఁ
ద్యాగరూపక్రియన్ గాంచు—నతఁడు — నరుల
యోగిగా — కర్మపరుఁడుగా నొప్పు చుండు. 18

కామసంకల్పరహితముల్ గార్యము లని
తెలిసి కొనువాని నరసిన ధీవిశాలు,—
రతని జ్ఞానాగ్నిదగ్ధకార్యైకశాలి
యై తనర్చెడు పండితుం డని వచింత్రు. 19

పరమసంతోషియై యహంభావ మడఁచి
మాపి సాంసారికములఁ ; గర్మఫల ముడిగి

కర్మ ణ్యభి ప్రవృత్తోఽపి
నైవ కించిత్కరోతి సః. 20

నిరాశీ ర్యతచిత్తాత్మా
త్య క్తసర్వపరిగ్రహః,
శరీరం కేవలం కర్మ
కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 21

యదృచ్ఛా లాభసంతుష్టో
ద్వంద్వాతీతో విమత్సరః,
సమ స్సిద్ధా వసిద్ధౌ చ
కృత్వాపి న నిబధ్యతే. 22

గతసంగస్య ము క్తస్య
జ్ఞానావస్థిత చేతసః,
యజ్ఞాయాచరతః కర్మ
సమగ్రం ప్రవిలీయ తే. 23

బ్రహ్మార్పణం బ్రహ్మహవి
ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యమ్
బ్రహ్మ కర్మసమాధినా. 24

దైవ మేవా పరే యజ్ఞమ్
యోగినః పర్యుపాస తే,

కర్మపరుఁ డయ్యుఁ దనకుఁ దత్కర్మగతికి
జోక్యమే లేక చరియించు చుండు బుధుఁడు. 20

అలరి సంతృప్తి – నియతచిత్తాత్ముఁ డగుచుఁ
బూర్ణభోగైక విషయముల్ బోవిడల్చి–
ఆశను ద్యజించి – దైహికమైన కర్మ
మాత్ర మొనరించు యతికిఁ గల్మషము లేదు. 21

సిద్ధ్యసిద్ధుల సమబుద్ధిఁ జేసి–మత్స
రమునకున్ స్వస్తి చెప్పి ద్వంద్వమ్ము లుడిగి–
ప్రాప్తలాభైక సంతృప్తిఁ బరగు నరుడు
కర్మపరుఁ డయ్యుఁ దద్రతిన్ గ్రాల డెపుడు. 22

జ్ఞాన విన్యస్తచిత్తుఁడై – సర్వసంగ
ముక్తుఁడై యుండి, యజ్ఞార్థమునకు మాత్ర
మాచరించెడు మోక్షార్థి యఖిల కర్మ
లంతరించెడు – జ్ఞానికియాగ మేల? 23

విను – సృగాదులు బ్రహ్మ – హవిస్సు బ్రహ్మ –
బ్రహ్మరూపాగ్ని హుత మగు బ్రహ్మచేతి
ద్రవ్యమున్ గూడ బ్రహ్మయా; బ్రహ్మకర్మ
పరునిచే నందఁ బడుసిద్ధి బ్రహ్మ చూవె! 24

దేవయజ్ఞప్రవర్తకుల్ దేవతార్చ
నాదికం బగు యజ్ఞమే యాచరింత్రు

బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం
యజ్ఞే నైవోప జుహ్నతి. 25

శ్రోత్రా దీనీన్ద్రియా ణ్యన్యే
సంయమాగ్నిషు జుహ్నతి,
శబ్దాదీన్ విషయా నన్య
ఇంద్రియాగ్నిషు జుహ్వతి. 26

సర్వా ణీన్ద్రియ కర్మాణి
ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మ సంయమయోగాగ్నౌ
జుహ్వతి జ్ఞాన దీపితే. 27

ద్రవ్యయజ్ఞా స్తపో యజ్ఞా
యోగయజ్ఞా స్తథా పరే,
స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాశ్చ
యతయః సంశితవ్రతాః. 28

అపానే జుహ్వతి ప్రాణమ్
ప్రాణోఽపానం తథా పరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా
ప్రాణాయామపరాయణాః. 29

అపరే నియతాహారాః
ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి,

జ్ఞాననిష్ఠాగరిష్ఠులు, జ్ఞానమార్గ
మునఁ బరబ్రహ్మ యం దైక్యమును వహింత్రు. *25

అనఘ! శ్రోత్రాదిసకలేంద్రియముల సంయ
మాగ్ని హవనమ్ము మఱికొంద ఱాచరింతు;
రప్పగిది నింకొకరును శబ్దాది విషయ
నికరముఁ వేల్తు రింద్రియాగ్నిని ముదమున. 26

మహితసకలేంద్రియైక కర్మలకుఁ దోడు
ప్రాణకర్మలు నైతమ్ముఁ బరఁగఁ జేర్చి
జ్ఞాన సందీప్త మా నాత్మసంయమ మను
యోగవహ్నిని వేల్తు రింకొకరు ప్రజ్ఞ 27

ద్రవ్యయజ్ఞుం డొకండు – స్వాధ్యాయి యొకఁడు–
స్వమతమునకుఁ బాటువడు తపస్వియొకఁడు–
యోగియొక్కఁడు – విజ్ఞాని యొక్కఁ డిటులె
సంశితవ్రతు లగు యతీశ్వరులఁ గలరు. 28

ప్రాణమును వేల్చు నొక్కఁడపాన మందు–
హవన మొనరించుఁ బ్రాణమ్ము నందపాన
మొకఁడు – బైరెంటి గతిని వేఱొకఁడు నిలుపు–
వరలెద రిటు ప్రాణాయామపరులు విధుల. 29

అనఘ! కొందఱు నియమితాహారు లగుచు
బ్రాణములఁ బ్రాణముల యందుఁ బరగఁ జేర్చి

---

* పరబ్రహ్మయం దైక్య మందుట యన బ్రహ్మాగ్ని యందు యజ్ఞములన యజ్ఞముల నర్పించుటయే యని పర్యవసానము.

సర్వేఽప్యేతే యజ్ఞ విదో
యజ్ఞక్షపిత కల్మషాః. 30

యజ్ఞశిష్టామృతభుజో
యాన్తి బ్రహ్మ సనాతనం,
నాయం లోకోఽ స్త్య యజ్ఞస్య
కుతోఽన్యః కురుసత్తమ. 31

ఏవం బహువిధా యజ్ఞా
వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా
నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

శ్రేయాన్ ద్రవ్య మయా ద్యజ్ఞాత్
జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పార్థ
జ్ఞానే పరిసమాప్యతే. 33

తద్విద్ధి ప్రణిపాతేన
పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం
జ్ఞానిన స్తత్వదర్శినః. 34

యత్ జ్ఞాత్వా న పున ర్మోహ
మేవం యాస్యసి పాణ్డవ,
యేన భూతా న్యశేషేణ
ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి. 35

యజ్ఞదూరితకల్మషులై చరింత్రు-
వీరలెల్లరు యజ్ఞసంవిదులుగారె! 30

సవనపరిణామసురూప విజ్ఞాన సుధను
గ్రోలు మునులు పరబ్రహ్మ లీల లంది
కొందు - రిఁకఁ దద్విరోధి కీగోడు లేమి
నిహమున నసౌఖ్య మనఁ - బరం బెట్టు లుండు? 31

వేద ముఖమున నివ్విధి వెడలినట్టి
క్రతువిషయికంబు లైన యీక్రమము లెల్ల
గర్మజము లంచు నెఱిఁగి నిష్కామకర్మ
యోగ గతి నున్న - భవబంధ ముడుగు నీకు. 32

ద్రవ్యరూపాది సవనతంత్రముల కంటె
జ్ఞాన యజ్ఞంబు శ్రేష్ఠ మో సవ్యసాచి!
కతమ దేమన నుడివిన కర్మ లెల్ల
జ్ఞానమయ మైన నిష్ఠకు లోను గావె. 33

పార్థ! కడుభక్తిమై దండవత్ప్రణామ
పూర్వకంబుగఁ గొల్చి యపూర్వవినయ
విధిని బ్రశ్నింప; జ్ఞాన సంవిదులు మాని
జనులు, నీకు జ్ఞానోప దేశం బొనర్తు, 34

అప్పు డివ్విధి మోహ మీ వంద కున్కఁ
బుడమిఁ గనుపట్టు సంపూర్ణ భూతకోటి,
నరయఁ జాలెద వీవు నీయాత్మ లోన
నవల నీ యాత్మనే మదీయాత్మఁ గనెదు. 35

అపిచే దసి పాపేభ్య
స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవే నైవ
వృజినం సంతరిష్యసి. 36

యథైథాంసి సమిద్ధోఽగ్ని
ర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి
భస్మసాత్కురుతే తథా. 37

నహి జ్ఞానేన సదృశం
పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః
కాలే నాత్మని విందతి. 38

శ్రద్ధవాన్ లభతే జ్ఞానం
తత్పర స్సంయతేన్ద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి
మచిరే ణాధిగచ్ఛతి. 39

అజ్ఞశ్చా శ్రద్ధ ధా నశ్చ
సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో
న సుఖం సంశయాత్మనః. 40

అన్ని పాపంబులకు మించునధిక మైన
యఘ మొనర్చెడి వాఁడ వీ వగుదు గాక
జ్ఞాన రూపమ్ముఁ దాల్చిన యానపాత్ర
మెక్కి దురిత మెడలఁ దరియింతు వనఘ! 36

తవిలి ప్రజ్వలితాగ్ని, యింధనము లెల్ల
భస్మ మొనరించి నట్టులఁ బాండుతనయ!
జ్ఞాన రూపానలుండు, భస్మంబు సేయు
సకల కర్మేంధనములు నిస్సంశయముగ. 37

అనఘ! జ్ఞానమ్మునకు సమ మగు పవిత్ర
వస్తు వీలోకమునఁ గానఁబడదు సూవె
యోగసంసిద్ధుఁ డా జ్ఞానయోగ మంది
యవలఁ దానుగ నాత్మానుభవము వడయు. 38

తత్పరుం డయి శ్రద్ధ చేఁ దనరు జనుఁడు
జ్ఞానము జితేంద్రియుం డయి సంగ్రహించి
స్వల్పకాలమ్మున భగవత్ప్రాప్తిరూప
శాంతి సైతమ్ముఁ బొంది ప్రశాంతి నలరు. 39

శ్రద్ధ బోనాడి మిగుల యజ్ఞాని యైన
సంశయాత్మకుఁ గల్గునాశనము సతము
వాని కేనాఁడు సౌఖ్య మెప్పగిది వరలఁ
బోదు - పై పెచ్చు నిహపరంబులును సున్న. 40

యోగ సన్న్యస్త కర్మాణం
జ్ఞాన సంఛిన్న సంశయం,
ఆత్మవంతం న కర్మాణి
నిబధ్నన్తి ధనంజయ. 41

తస్మా దజ్ఞానసంభూతం
హృత్ స్థం జ్ఞానాసి నాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ
మా తిష్ఠోత్తిష్ఠ భారత. 42

ఓమ్ తత్స దితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున
సంవాదే జ్ఞానకర్మసన్న్యాసయోగో
నామ చతుర్థోధ్యాయః.



అమలయోగాప్తి బ్రహ్మార్పణైకబుద్ధి
సర్వసంపూర్ణ కర్మలు సన్న్యసించి
జ్ఞానసంఛిన్నసంశయుం డైన నియత
చిత్తుఁ డగు వానిఁ గర్మలు సేర వెఱచు. 41

కనుక నజ్ఞానజనితమై మనము నందుఁ
గ్రాలు నీ సందియము జ్ఞానఖడ్గధార
మాంపి - యోగమ్ముఁ దాల్చి - సమత్వబుద్ధి
బవరమున కింక లే వోయి భరత వీర! 42

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యాయనం బను
యోగశాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీతయందు
శ్రీ కృష్ణార్జునసంవాదమున జ్ఞానకర్మ
సన్న్యాసయోగ మను
నాల్గవ యధ్యాయము.



ఓమ్ తత్సత్

# గీతా సప్తశతి

## అథ పంచమోఽధ్యాయః - కర్మసన్న్యాసయోగము

— :o: —

అర్జునఉవాచ :—

సన్న్యాసం కర్మణాం కృష్ణ
పున ర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయో రేకం
త న్మే బ్రూహి సునిశ్చితం. 1

శ్రీభగవానువాచ :—

సన్న్యాసః కర్మయోగ శ్చ
నిఃశ్శ్రేయసకరా వుభౌ,
తయో స్తు కర్మసన్న్యాసా
త్కర్మయోగో విశిష్యతే. 2

జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ
యో న ద్వేష్టి న కాంక్షతి,

శ్రీ మత్పరదేవతాయై నమః

# గీతా సప్తశతి

## ఐదవ అధ్యాయము - కర్మసన్న్యాసయోగము

—:o:—

అంత హరితోడ నిట్లాడె నర్జునుండు
కర్మసన్న్యాసముఁ దెల్పి - కర్మయోగ
యుక్తిఁ గర్మమ్ము సలుప నీ కుచిత మనుచుఁ
బలికె - దీ రెంట - నెది లెస్స - దెలుపు మయ్య. 1

తోడనే పల్కె హరి యిటు క్రీడి నరసి
* కర్మసన్న్యాస నిష్కామ కర్మయోగ
ములును శుభదమ్ములౌఁ; గాని ముఖ్య మగుచుఁ
గ్రాలె† నిష్కామ కర్మయోగమ్ము రెంట. 2

రెంట సమబుద్ధిఁ బగయుఁ గోరికయు లేక
యలరు నాతఁడు నిత్యసన్న్యాసి గాడె

---

* ఇంద్రియ వ్యాపార మూలమున మానసికముగను, దైహికము
ము జరుగు సంపూర్ణ కర్మల యందు కర్తృత్వమును వదలుకొంటకే కర్మ
న్న్యాసయోగ మని పేరు.

† సమత్వబుద్ధిచే పరమేశ్వర ప్రీత్యర్థముగఁ గర్మ లొనరించుటకు
ష్కామకర్మయోగ మని పేరు.

నిర్ద్వంద్వో హి మహాబాహో
సుఖం బంధా త్ప్రముచ్యతే. 3

సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః
ప్రవద న్తి న పండితాః,
ఏక మప్యాస్థితః సమ్య
గుభయో ర్విన్ద తే ఫలమ్. 4

య త్సాంఖ్యైః ప్రాప్యతే స్థానమ్
త ద్యోగై రపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగంచ
యః పశ్యతి స పశ్యతి. 5

సన్న్యాస స్తు మహాబాహో
దుఃఖ మాప్తు మయోగతః,
యోగయుక్తో ముని ర్బ్రహ్మ
నాచిరేణాధిగచ్ఛతి. 6

యోగయుక్తో విశుద్ధాత్మా
విజితాత్మా జితేన్ద్రియః,
సర్వభూతాత్మ భూతాత్మా
కుర్వ న్నపి న లిప్యతే. 7

నైవ కించిత్కరో మీతి
యుక్తో మన్యేత తత్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర
న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్.

రాగవిద్వేషముల కందరాని యతఁడు
వీత సంసారలంపటుఁ డై తరించు. 3

విడిగ నీరెండు యోగమ్ము లిడు ఫలమ్ము
లని వచింతురు మూర్ఖు ;ల ట్లనరు బుధులు
రెంట నొకదాని మాత్ర మర్థించు జనుఁడు
బడసెడుఁ గాదె రెండింటి ఫలము లొకట. 4

జ్ఞాన యోగమ్ము కతన మోక్షమ్ము వడయు
ఘనుఁడు. నిష్కామ కర్మయోగమున సిద్ధిఁ
గాంచుఁ ; గావున సాంఖ్య నిష్కామ కర్మ
ఫలము లొకటిగ నెంచెడు వాఁడె బుధుడు. 5

అమలనిష్కామ కర్మయోగమున కంటె
సాంఖ్య యోగంబు వలని కష్టంబు హెచ్చు
గనుక నిష్కామ కర్మయోగమున యోగి
బడయు వేగంబ బ్రహ్మ నిర్వాణపదవి. 6

అరసి తనయాత్మగాఁగ భూతాత్మతతి-జి
తాత్మయై-జితేంద్రియత శుద్ధాత్మ యగుచుఁ
గ్రాలి-నిష్కామకర్మయోగమున యోగి
బంధితుఁడు గాడు కర్మనిబద్ధుఁ డయ్యు. 7

చూచుచున్ వాసనల్ జూచుచున్ గుడుచుచు
వినుచు స్పృశించుచు గొణఁగి కొనుచుఁ
బోవుచున్ నిద్దుర వోవుచు నూర్చుచు
నూగుచు విడుచుచు నొదిగి కొనుచు

ప్రలపన్ విసృజన్ గృహ్ణా
న్నున్మిష న్నిమిష న్నపి,
ఇంద్రియా ణీన్ద్రియార్థేషు
వర్తన్త యితి ధారయన్. 8–9

బ్రహ్మణ్యాధాయ కర్మాణి
సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్తతే న స పాపేన
పద్మపత్ర మివా మ్భసా. 10

కాయేన మనసా బుధ్యా
కేవలై రింద్రియై రపి,
యోగినః కర్మ కుర్వన్తి
సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే. 11

యుక్తః కర్మఫలం త్యక్త్వా
శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ
ఫలే సక్తో నిబధ్యతే. 12

సర్వకర్మాణి మనసా
సన్న్యస్యాస్తే సుఖం వశీ,

గనుతెప్ప లింతకుఁ గప్పుచు విప్పుచు
భాషించు చేమేమొ పట్టుకొనును
నరచుచు సోలుచు నావలించుచు మెల్లఁ
గూరుచుండుచు దూలి కూలఁ బడుచు –

నెలమిఁ దమ విధు లొనరించు నింద్రియముల
జాడ లెల్ల నెఱింగిన సాంఖ్యయోగి,
యించుకేనియు నీపను లింత కేను
జేయ లేదని మదిఁ దలపోయుఁగాదె. 8–9

జనుఁడు "బ్రహ్మార్ప" ణం బని సంగరహితుఁ
డగుచుఁ బరమాత్మ కర్పించి యఖిలకర్మ–
లంబువుల స్పృశింపని తామరాకువోలెఁ
గర్మఁ బరుఁడయ్యు దురితసంగతుఁడు గాడు. 10

మమత లేని నిష్కామ కర్మవిదులు, దని
యక మనోబుద్ధిదేహేంద్రియముల చేత
నిస్పృహత మించి స్వీయాత్మనిర్మలత్వ
మునకుఁ గా గర్మ లొనరించి మురియుచుంద్రు. 11

కర్మఫలమును నిష్కామ కర్మయోగి
యర్పణమొనర్చి బ్రహ్మార్పణైకబుద్ధి
నలరు నైష్ఠికశాంతి – ఫలాభిలాషఁ
దవులు గోర్కులఁ–గోర్కులఁ దనరు జనుఁడు. 12

సన్న్యసించి మవస్సుచే సర్వకర్మ
లను ; నవద్వారపుర దేహమున – సుఖముగఁ

నవద్వారే పురే దేహీ
నైవ కుర్వ న్నకారయన్. 13

న కర్తృత్వం న కర్మాణి
లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం
స్వభావ స్తు ప్రవర్తతే. 14

నాదత్తే కస్య చిత్పాపమ్
నచైవ సుకృతం విభుః,
అజ్ఞానే నావృతం జ్ఞానం
తేన ముహ్యన్తి జన్తవః. 15

జ్ఞానేన తు తదజ్ఞానం
యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవత్ జ్ఞానం
ప్రకాశయతి తత్పరం. 16

తద్బుద్ధయ స్తదాత్మాన
స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛన్త్యపునరావృత్తిమ్
జ్ఞాననిర్ధూతకల్మషాః. 17

విద్యావినయ సంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ
పణ్డితా స్సమదర్శినః. 18

కర్తయు - నకర్తయుఁ దాను గాక - యోగి,
నిలుచుఁ బరమాత్మగతి జితేంద్రియత నలరి.　　13

లోకకర్తృత్వమునకుఁ దా లోను గాక
కర్మఫల యోగములకును - గర్మలకును
ప్రభువు దూరస్థుఁ డైయుండఁ ; బ్రకృతి, తత్ప
కాశసంస్థిత మై పనుల్ గడపుఁ గాదె.　　14

ఎవని పాపపుణ్యంబుల కీశ్వరుండు
కర్తగా నుండి వానిని గైకొనండు
జ్ఞాన మజ్ఞాన సంఛన్న మైన కతన
నఖిలజీవులు భ్రమకు లో నగుదు రిచట.　　15

మానసిక మైన యజ్ఞానమార్గ ముడుగ
శ్రమయొనర్చిన వారి విజాన దీప్తి,
భాను సంకాశమై - పరబ్రహ్మరూప
సచ్చిదానంద దర్శన సౌఖ్య మిడదె!　　16

మునివరేణ్యులు తత్పరాయణతఁ జెలఁగి
తనరి తద్బుద్ధు లౌచుఁ దాదాత్మ్య మంది
వరలి తన్నిష్ఠ విదళితపాపు లగుచు
బిదపఁ గైకొందు రపునరావృత్తి ఫలము.　　17

వినయవిద్యాధికుఁడగు బ్రాహ్మణుని యందు
నరుల నస్పృశ్యుఁ డైన చండాలు పట్ల
గుక్కయెడ నేన్గు పట్టున గోవు నెడలఁ
దనరుదురు పండితులు సమదర్శు లగుచు.　　18

ఇహైవ తైర్జిత స్సర్గో
యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ
తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః. 19

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య
నోద్విజేత్ప్రాప్య చా ప్రియమ్,
స్థిరబుద్ధి రసంమూఢో
బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః. 20

బాహ్య స్పర్శేష్వ సక్తాత్మా
విన్ద త్యాత్మ ని యత్సుఖమ్,
స బ్రహ్మయోగ యుక్తాత్మా
సుఖ మక్షయ మశ్నుతే. 21

యే హి సంస్పర్శజా భోగా
దుఃఖయోనయ ఏవ తే,
ఆద్య న్త వ న్తః కౌ న్తేయ
న తేషు రమతే బుధః. 22

శక్నోతీ హైవ య స్సోఢుం
ప్రాక్శరీరవిమోక్షణాత్

సకలభూతసమత్వ ప్రశాంతమతులు
బ్రదికియును మోక్షయోగ్యతఁ బడసిరి గద
సమత మను బ్రహ్మ మఘవిదూర మయి యుంట
వరలరే వారు బ్రహ్మనిర్వాణపదవి. 19

ప్రియముఁ బొందియు మురియ ; కప్రియముఁబొంది
వగవ కుండెడు స్థిరబుద్ధి వరలు నట్టి
రహిత సంశయచిత్తులు బ్రహ్మవిదులు
పడయుదురు గాదె బ్రహ్మైక్యపదవిఁ బార్థ! 20

జనుఁడు సాంసారికము లైన సకలవిషులఁ
దవులు కొన ; కాత్మ దైవచింతన సుఖాప్తి
నలరఁ ; దా బ్రహ్మయోగాంచితాత్ముఁ డగుచుఁ
గట్టకడ కక్షయ మగు సుఖమ్ము వడయు. 21

విషయ భోగైకపరము లీ విభవము లిలఁ
గష్టభరితమ్ము లగుట యేకాక పార్థ!
విను—మనిత్యమ్ము లై యుంట విబుధు లెపుడు
వీనియందుఁ దవులొ్కాన వెఱచు చుంద్రు. 22

జనుఁడు మరణించుటకు మున్నె జ్ఞాని యగుచుఁ
గామమునఁ గ్రోధవశమునఁ గలుగు వేగ

కామక్రోధోద్భవం వేగమ్
స యుక్త స్స సుఖీ నరః. 23

యోఽన్త స్సుఖోఽన్తరా రామ
స్తథా న్తర్జ్యోతి రేవ యః,
స యోగీ బ్రహ్మ నిర్వాణం
బ్రహ్మభూతోఽధి గచ్ఛతి. 24

లభన్తే బ్రహ్మనిర్వాణమ్
ఋషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మానః
సర్వభూతహితే రతాః. 25

కామక్రోధవియుక్తానామ్
యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణమ్
వర్తతే విదితాత్మనామ్. 26

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్
చక్షుశ్చైవాన్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా
నాసాభ్యన్తరచారిణౌ. 27

మడఁచు కొను శక్తి సంపన్నుఁ డయ్యె నేని
వాఁడె సుఖవంతుఁ డిహమున వాఁడె యోగి. 23

ఎవఁడు సుఖియించు నాత్మ యందే సతమ్ము ;
నెవఁడు క్రీడించునాత్మయం ; దెవనియాత్మ
నలరు జ్ఞానమ్ము జ్యోతియై యట్టి బ్రహ్మ
భావగతుఁ డగు ముని, బొందు బ్రహ్మ పదవి. 24

పాపదూరులు ; సంశయభావరహితు ;
లఖిలభూతైకహితరతుల్ ; ధ్యానచిత్తు
లై తనర్చెడు బ్రహ్మర్షు లంచిత మగు
బ్రహ్మనిర్వాణపదవినే వడయు చుంద్రు. 25

కామము జయించి క్రోధమ్ముఁ గాలఁ దన్ని
చిత్త మటు నిటు పోనీక జిక్కఁబట్టి
సచ్చిదానందు నెదఁ గాంచు సంయములకు
బ్రహ్మనిర్వాణపదము సర్వత్రఁ దనరు. 26

బాహ్య విషయైకసుఖములఁ బారఁ దోలి
సమతఁ గూర్పంగఁ దగును కన్బొమలఁ జూపు
నిలిపి నాసికాంతరముల నెగడు నట్టి
ప్రాణమునకు మఱియు నపానమునకు. 27

యతేన్ద్రియ మనోబుద్ధి
ర్మునిర్మోక్షపరాయణః,
విగతేచ్ఛా భయక్రోధో
యస్సదా ముక్త ఏవ సః. 28

భోక్తారమ్ యజ్ఞ తపసామ్
సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానామ్
జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి. 29

ఓమ్ తత్సదితి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణా
ర్జున సంవాదే కర్మసన్న్యాసయోగో
నామ పంచమోఽధ్యాయః.

* * *

సమతఁ గావించి పిదప మోక్షప్రసక్తిఁ
దవిలి విజితేంద్రియుం డౌచుఁ దనరి తుదకు
విగతవాంఛాభయక్రోధుఁ డగుచుఁ జెలఁగు
వాఁడె పో ముక్తుఁ డనఁ బడి వసుధ నెగడు. 28

నను ; దపోయజ్ఞ ఫల భోక్తగను ; సమస్త
లోకవిభునిగ ; నిఖిలలోకైకసఖుని
గా ; నెఱింగిన భక్తాగ్రగణ్యుఁ డమిత
శాంతి నలరారి మోక్షప్రసక్తి మనడె! 29

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషద్బ్రహ్మవిద్యయనంబడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీతయందు శ్రీ కృష్ణార్జున
సంవాదమునఁ గర్మసన్న్యాసయోగ మను
యైదవ అధ్యాయము.

* * *

ఓమ్ శ్రీ పరమాత్మనే నమః.

# గీతా సప్తశతి

## అథ షష్ఠోఽధ్యాయః – ఆత్మసంయమయోగః

---

శ్రీభగవానువాచ:

అనాశ్రితః కర్మఫలమ్
కార్యం కర్మ కరోతి యః,
స సన్న్యాసీ చ యోగీ చ
న నిరగ్ని ర్న చాక్రియః.

యం సన్న్యాస మితి ప్రాహుః
యోగం తం విద్ధి పాండవ.
నహ్యా సన్న్యస్తసంకల్పో
యోగీ భవతి కశ్చన.

ఆరురుక్షో ర్మునే ర్యోగం
కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ
శమః కారణ ముచ్యతే.

యదా హి నేన్ద్రియార్థేషు
న కర్మస్వను షజ్జతే,
సర్వ సంకల్ప సన్న్యాసీ
యోగారూఢ స్తదోచ్యతే.

శ్రీమత్పరదేవతాయైనమః

# గీతా సప్తశతి

## ఆఱవయధ్యాయము - ఆత్మసంయమయోగము

---

అగ్నికార్యచ్యుతుండు సన్న్యాసి గాఁడు
క్రియలు దొఱఁగిన మాత్ర యోగియును గాఁడు
కర్మఫల మెల్లఁ ద్యజియించి కర్మ సలుపు
వాఁడె నిజ మైన సన్న్యాసి–వాఁడె యోగి. 1

దేని సన్న్యాస మనుచు వాదింత్రు బుధులు
దానినే యోగ మను చీవు దలఁపు మయ్య
తలఁపు లుడుగని యెట్టి సాధకుఁడు గాని
లీలగా నైన యోగి గా లేడు గాదె! 2

యోగ మొనరింప సంకల్ప మున్న మునికి
గారణము గాదె నిష్కామ కర్మయోగ ;
మాతఁ డొకవేళ యోగియై యలరి నప్పు
డయ్యె హేతువు నిస్పృహా నలరు శమము. 3

ఇంద్రియాత్మకసుఖము లం దిచ్చ గొనక
కర్మపాశనిబద్ధుండు గాని మనుజుఁ
డలరి సర్వసంకల్ప సన్న్యాసి గాఁగ
నవల యోగసమారూఢుఁ డగుచు నెగడు. 4

ఉద్ధరే దాత్మ నాత్మానం
నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు
రాత్మైవ రిపు రాత్మనః. 5

బంధు రాత్మా త్మన స్తస్య
యే నాత్మై వాత్మనా జితః,
అనాత్మన స్తు శత్రుత్వే
వర్తే తాత్మైవ శత్రువత్. 6

జితాత్మనః ప్రశాన్తస్య
పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు
యదా మానావమానయోః. 7

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా
కూటస్థో విజితేన్ద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ
సమలోష్టాశ్మకాంచనః. 8

సుహృన్మిత్రా ర్యుదాసీన
మధ్యస్థద్వేష్యబన్ధుషు,
సాధుష్వపి చ పాపేషు
సమబుద్ధి ర్విశిష్యతే. 9

యోగీ యుంజీత సతత
మాత్మానం రహసి స్థితః,

తనను తా నుద్ధరించుకోఁ దగును గాని
తన కధోగతి నిర్మించుకొనఁగ రాదు
కత మదే మన జీవాత్మ హితుఁడు గాఁగఁ
దనకు గనుపట్టి శత్రువై తనరుఁగడకు. 5

ఎవఁడు, దన మానసము నిగ్రహింపఁ గలఁడో
వాని యాత్మకు మిత్రమై వరలు మనము
మానస మెవండు నిగ్రహింపంగ లేడో
అతని యాత్మకు మానసం బగు విరోధి. 6

విజయ! శీతోష్ణసుఖదుఃఖవేళ లందు
మఱియు మానావమానసమయము లందు
ఆత్మను జయించి మనుజుఁ డత్యంతశాంత
మతిని బరమాత్ముఁ జిత్తసంస్థితు నొనర్చు. 7

జ్ఞానవిజ్ఞానతృప్తుండు – సమ సువర్ణ
మృత్తికాశ్ముండు – నిర్జితేంద్రియుఁడు – నిర్వి
కారుఁడై మించు యోగి పుంగవుఁడు ధాత్రి
నొప్పెడున్ భగవత్ప్రాప్తి యుక్తుఁ డగుచు. 8

మిత్రు లందు; సుహృత్తుల శత్రు లందు
బందుగుల యందు; ద్వేషులన్ బాపు లందు
శిష్టులఁ దటస్థు లం దుదాసీను లందుఁ
దనరు సమబుద్ధి నెవ్వఁ డజ్జనుఁడు ఘనుఁడు. 9

మనసు బిగఁ బట్టి విషయవాసనలు గొనక
ధనముఁ గూర్పక, చొరరాని వనము లందు

ఏకాకీ యతచిత్తాత్మా
నిరాశీ రపరిగ్రహః. 10

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య
స్థిరమాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం
చైలాజినకుశోత్తరం. 11

తత్రైకాగ్రం మనః కృత్వా
యతచిత్తేన్ద్రియః క్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యా
ద్యోగ మాత్మ విశుద్ధయే. 12

సమం కాయశిరోగ్రీవమ్
ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం
దిశ శ్చానవలోకయన్. 13

ప్రశాన్తాత్మా విగతభీ
ర్బ్రహ్మచారి వ్రతే స్థితః,
మన స్సంయమ్య మచ్చిత్తో
యుక్త ఆశీత మత్పరః. 14

యుంజన్నేవం సదాత్మానం
యోగీ నియతమానసః,
శాన్తిం నిర్వాణ పరమామ్
మత్సంస్థా మధిగచ్ఛతి. 15

వాస మొనరించు నేకాంతవాసి యగుచు
బ్రహ్మమునఁ జిత్తము లగించు వాఁడె యోగి. 10

హరిణచర్మంబుఁ బరిశుద్ధ మైన చోటఁ
బఱచి దర్భాసనము దాన వైచి – వస్త్ర
ముంచి యద్దాన – నాతినిమ్నోన్నత మగు
నాసనముఁ గూర్చి కొనవలె నచలఫణితి. 11

దాన నేకాగ్రబుద్ధి నాసీనుఁ డగుచు
యోగి, విజితేంద్రియుం డయి యోగవిధుల
శ్రద్ధ నలరారి చిత్త సంశుద్ధికొఱకుఁ
బూనవలె యోగసాధనమును గిరీటి! 12

కాయమునకును, దలకును, గంఠమునకు
సమత ఘటియించి యచలత్వసరణిఁ బరగి
దృష్టి నిజనాసికాగ్ర మందే లగించి
ప్రతిమవలె నుండి దిక్కులవంకఁ గనక. 13

బ్రహ్మచర్యవ్రతస్థితిత్వమునఁ బరగి
సంయమి, భయమ్ము వీడి ప్రశాంతమతిని
జిక్కబట్టి మనమ్ము – మచ్చిత్తుఁ డగుచు
మత్పరుం డయి యుక్తుఁ డై మసల వలయు. 14

ఇటులఁ దనయాత్మఁ బరమాత్మ నెడలఁ జొనిపి
నియత మానసుఁ డౌచు ధ్యానించె నేని
ధ్యానయోగి, సతమ్ము మత్స్థానరూప
పరమనిర్వాణపదమునఁ బడయు శాంతి. 15

నాత్యశ్నతస్తు యోగోఽస్తి
న చైకాన్త మనశ్నతః,
న చాతి స్వప్నశీలస్య
జాగ్రతో నైవ చార్జున. 16

యుక్తాహారవిహారస్య
యుక్త చేష్టస్య కర్మసు,
యుక్త స్వప్నావబోధస్య
యోగో భవతి దుఃఖహా. 17

యదా విని యతం చిత్త
మాత్మన్యే వావతిష్ఠతే,
నిస్పృహః సర్వ కామేభ్యో
యుక్త ఇత్యుచ్యతే సదా. 18

యథా దీపో నివాతస్థో
నేంగతే సోపమా స్మృతా,
యోగినో యత చిత్తస్య
యుంజతో యోగ మాత్మనః. 19

యత్రోపరమతే చిత్తం
నిరుద్ధం యోగ సేవయా,
యత్ర చైవాత్మ నాత్మానం
పశ్యన్నాత్మని తుష్యతి. 20

సుఖ మత్యన్తికం యత్త
ద బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియం,

తిండి తిన నట్టివానికిఁ దిండిపోతు
నకును సిద్ధింప దీయోగ – మిఁక సతమ్ము
నిదుర వోయెడు వానికి మొదలె లేదు
విధిగ మేల్కొన్న వాని కెవ్విధిని లేదు. 16

మితముగాఁ దిని విహరించు నతఁడు యోగ
సిద్ధి వడసెడుఁ ; గర్మలఁ జెలఁగు నతఁడుఁ
గూడ ఫలమందు ; బరిమితి తోడ నిదుర
వోయి మేల్కాంచు నాతఁడుఁ బొందు ఫలము. 17

నియమితమనమ్ము పరమాత్మ నిష్ఠమైన
యపుడు కోరిక లన్నింటి నడఁగఁ ద్రొక్కి
అమలయోగసమారూఢుఁ డగుచు జనుఁడు
నిస్పృహత మించి కౌంతేయ! నెగడుఁ గాదె. 18

ధ్యానగతుఁ డైనయోగిచిత్తమ్ము నియత
మగుచు నెలకొంటఁ బరమాత్మునందుఁ దనరి
గాలి చొరరానిచోటునఁ గ్రాలు దీప
కళికతో సామ్యముఁ బొంది ఘనతఁ గాంచు. 19

యోగసాధనవిధి సంప్రయోగకలన
నియమిత మనం బెచట సౌఖ్యనియతిఁ గనునొ
సూక్ష్మబుద్ధిని బరమాత్ముఁ జూచుచుండి
యాత్మ యందే ముదం బందు నచట యోగి. 20

ఇంద్రియాతీతమై బుద్ధి నెఱుఁగఁ దగిన
విషయ మెచట గ్రహింపంగ వీలు పడునొ

వేత్తి యత్ర న చైవాయం
స్థిత శ్చలతి తత్త్వతః. 21

యం లబ్ధ్వా చా పరం లాభమ్
మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన
గురుణాపి విచాల్యతే. 22

తం విద్యా దుఃఖ సంయోగ
వియోగం యోగ సంజ్ఞితం,
స నిశ్చయేన యోక్తవ్యో
యోగో ఽనిర్వణ్ణచేతసా. 23

సంకల్ప ప్రభవాన్ కామాన్
త్యక్త్వా సర్వా న శేషతః,
మనసై వేన్ద్రియ గ్రామం
వినియమ్య సమంతతః. 24

శనై శ్శనై రుప రమే ద్బుద్ధ్యా
ధృతి గృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా
న కించి దపి చిన్తయేత్. 25

యతో యతో నిశ్చరతి
మన శ్చంచల మస్థిరం,
తత స్తతో నియమ్యై త
దాత్మన్యేవ వశం నయేత్. 26

దాని భగవత్స్వరూప తత్వమున యోగి
యెఱిఁగి తల్లీనుఁ డై చలియింపకుండు. 21

తృప్తిమై పరమేశ్వరప్రాప్తిరూప
లాభమున్ బొంది యెక్కుడు లాభ మొకటి
దేన లేదని తలఁచునో దాన యోగి
స్థిరమతిన్ నిల్చు దుఃఖ సంస్థితిని గూడ. 22

కష్టభూయిష్ట మైనలోకమ్ముతోడి
బంధనముఁ ద్రెంచికొన్న "యిప్పరమయోగ"
సంజ్ఞ విలసిల్లు నీయోగ సంప్రదాయ
మెఱిఁగి కావింపవలయుఁ దత్పరత దీని. 23

పార్థ! విను మింక సంకల్పభవము లైన
కోరికల నెల్లఁ దుదముట్టఁ బారఁదోలి
యెల్లకడలకుఁ బోనీక యింద్రియముల
పోకడ బిగింపఁ దగు మనఃపూర్వకముగ. 24

పిదప మెలమెల్ల నభ్యాసవిధముఁ బెంచి
తద్రతిఁ జెలంగి ధృతిగృహీతమగు బుద్ధి-
మదిని బరమాత్మయెడ నిల్పి మౌన మూని
ధ్యానమొనరించు చు పరామ మందవలయు. 25

అస్థిరం బౌటఁ జంచల మైన మనము
నియమిత మొనర్చి వెలికిఁబోనీక విషయ
వాసనల నుండి మరలించి బ్రహ్మ మందు
మాత్రమే నిల్పఁ దగు ధ్యానమార్గవిధిని. 26

ప్రశా న్త మనసం హ్యేనం
యోగినం సుఖ ము త్తమమ్,
ఉపైతి శా న్తరజసం
బ్రహ్మ భూత మకల్మషం. 27

యుంజ న్నేవం సదాత్మానం
యోగీ విగత కల్మషః,
సుఖేన బ్రహ్మ సంస్పర్శ
మత్య న్తం సుఖ మశ్ను తే. 28

సర్వభూతస్థ మాత్మానమ్
సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః. 29

యో మాం పశ్యతి సర్వత్ర
సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణస్యామి
స చమే న ప్రణశ్యతి. 30

సర్వభూతస్థితం యో మాం
భజత్యే కత్వ మాస్థితః,
సర్వథా వ ర్త మా నోఽపి
స యోగీ మయి వ ర్త తే. 31

ఆత్మౌపమ్యేన సర్వత్ర
సమం పశ్యతి యోఽర్జున,

గురుతరధ్యానరతు; రజోగుణ విరహితు;
శమిత కల్మషచిత్తుఁ; బ్రశాంతహృదయు;
ననఘు విజ్ఞాన దీప్తు; బ్రహ్మైక్యమతిని
ధ్యానయోగిని బొందు; నుత్తమ సుఖమ్ము. 27

కల్మషము లేని యోగి యిక్కరణి నియతి
నాత్మఁ బరమాత్మయందు బ్రత్యహము నిల్పి
బ్రహ్మ నిర్వాణ పదవి సంప్రాప్తిరూప
మై తనర్చు మహాత్సౌఖ్య మనుభవించు. 28

అఖిలభూతాళి సమబుద్ధి నరయు యోగి
తనను జీవుల నొకనిగా దా నెఱింగి
మంచుగడ్డ జలమ్ముల మలయు మాడ్కి
నఖిల జీవాళి నాత్మనే యరయు చుండు. 29

నన్ను సంపూర్ణ భూతసంపన్నుఁగాఁగ
నెఱిఁగి నాయందు సర్వభూతాళి నరయు
నతఁ డదృశ్యుండుగాడు నా; కతని కేను
గా నదృశ్యుండ; మత్పరుం డైనకతన. 30

పార్థ! నాతోడ నేకభావస్థితిత్వ
మంది కొని యున్న యోగి, భూతాళియాత్మ
రూపమున నున్న నన్ను నేర్పున భజించు
చెట వసించిన నాలోనె యిమిడి యుండు. 31

ఎవఁడు తనతోడి సాదృశ్యమీ సమస్త
భూతముల యందు దగిలించి పోల్చి చూచి

సుఖం వా యది దుఃఖం స
యోగీ పరమో మతః. 32

అర్జున ఉవాచ:

యోఽయమ్ యోగ స్త్వ యా ప్రోక్త
స్సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం న పశ్యామి
చంచలత్వాత్ స్థితిం స్థిరాం. 33

చం చలం హి మనః కృష్ణ
ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహమ్ నిగ్రహమ్ మన్యే
వాయో రివ సు దుష్కరమ్. 34

శ్రీభగవా నువాచ:

అసంశయం మహా బాహో
మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌ న్తేయ
వై రాగ్యేణ చ గృహ్యతే. 35

అసంయతాత్మనా యోగో
దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా
శక్యోఽవాప్తు ముపాయతః. 36

అర్జున ఉవాచ:

అయతిః శ్రద్ధ యో పేతో
యోగచ్చలితమానసః,

కష్టసుఖములు రెండు నొక్కటిగఁ దలఁచి
సమతఁ బాటించునో వాఁడు విమలయోగి. 32

అనవు డిట్లనె హరితోడ నర్జునుండు
బావ! నీచేత నిపుడు చెప్పంగఁ బడిన
సమత నొప్పెడి యీయోగ సరణి నాకు
దరమె మది చంచలమున నస్థిరతఁ గనుట. 33
మథన మొనరింపఁ గలశక్తి మదికిఁ దనరు
కతన నయ్యది దృఢమౌచుఁ గాలి చేవఁ
దనరి చాంచల్యమున నొప్పు - దాని నెటుల
నడఁతు నింతకు - వాయువు నడఁపఁ గలమె? 34

పలికె హరి నవ్వి యిటుల విన్వాచ్చు తోడ
సందియము లేదు మనము చంచలమె - కాని
దాని నభ్యాసవిధిని స్వాధీన మీవు
జేసి కొనవచ్చు వైరాగ్యసిద్ధి వడసి. 35
మానసముఁ జిక్కఁబట్టని మానవునకు
యోగ మింతకు దుష్ప్రాప - ముచితరీతి
మనము స్వాధీన మొనరించి కొనెడువాని
కమరుటయు నిర్వివాద మభ్యాసకలన. 36

తోడనే క్రీడి యిటు హరితోడఁ బలికె
శ్రద్ధగలిగిన వాఁడయ్యు జనుఁడు, మనము

అవాప్య యోగసంసిద్ధిమ్
కాం గతిం కృష్ణ గచ్ఛతి. 37

కచ్చి న్నోభయ విభ్రష్ట
శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో
విమూఢో బ్రహ్మణః పథి. 38

ఏత న్మే సంశయం కృష్ణ
ఛేత్తు మర్హ స్యశేషతః,
త్వ దన్య స్సంశయ స్యాస్య
చ్ఛేత్తా న హ్యుపపద్యతే. 39

శ్రీ భగవానువాచ :

పార్థ నైవేహ నాముత్ర
వినాశ స్తస్య విద్యతే,
నహి కళ్యాణ కృత్కశ్చి
ద్దుర్గతిం తాత గచ్ఛతి. 40

ప్రాప్య పుణ్య కృతాన్ లోకా
నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే
యోగభ్రష్టోఽభిజాయతే. 41

అథవా యోగినా మేవ
కులే భవతి ధీమతామ్,
ఏత ద్ధి దుర్లభతరమ్
లోకే జన్మ యదీ దృశమ్. 42

నడచుకొన లేక శిథిలప్రయత్నుఁ డైన
యపుడు సిద్ధిఁ దొఱంగి తా నందు నెద్ది? 37

బ్రహ్మపదవికిఁ దా నటు స్వస్తి చెప్పి;
యిటుల నైహికసుఖముల కెల్ల రోసి;
చదలఁ జెదరిన మేఘమ్ము చాడ్పున నతఁ
డుభయభ్రష్టత్వమున నాశ మొందఁడు గద! 38

బావ! కలగుండు వడిన నాభావవీథిఁ
బరగు నీసంశయాత్మకభావ ముడుపఁ
జాలుదువు నీవ – నీకంటె జాణ యైన
వేఱొకం డింక దొఱక డెవ్విధిని నాకు. 39

పలికె నీగతి మురవైరి, పార్థ నరసి
భద్ర మొనఁ గూర్చు నేదైన పని యొనర్చు
మానవుఁడు జేటు నొందకే మాత్ర మేని
బొందఁ గాదొకో యిహపరంబులును రెండు. 40

యోగవిధి నుండి భ్రష్టత్వ మొంది నట్టి
పురుషుఁడు శుభప్రదము లైన పుణ్యలోక
ములను బెక్కేండ్లు నివసించిఁ పుట్టు నవనిఁ
దిరిగి గుణశాలురౌ ధనాధికుల యింట. 41

అటులఁ గాదేని ధీమంతు లైన యోగి
జనుల గృహముల యందైన జనన మందు
నేది యెటు లైన నిట్టియుత్కృష్టజన్మ
మాత్ర మీలోక మందు సంప్రాప్త మౌనె! 42

తత్ర తం బుద్ధిసంయోగం
లభతే పూర్వదైహికం,
యతతే చ తతో భూయః
సంసిద్ధౌ కురునందన. 43
పూర్వాభ్యాసేన తేనైవ
హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య
శబ్దబ్రహ్మాతి వర్తతే. 44
ప్రయత్నాద్యతమానస్తు
యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ
స్తతో యాతి పరాం గతిమ్. 45
తపస్విభ్యోఽధికో యోగీ
జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ
తస్మా ద్యోగీ భవార్జున. 46
యోగినామపి సర్వేషామ్
మద్గతేనాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మామ్
స మే యుక్తతమో మతః. 47

ఓమ్ తత్స దితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే ఆత్మసంయమయోగో
నామ షష్ఠోఽధ్యాయః.

పుట్టి యున్నట్టి చోటునఁ బూర్వజన్మ
మున గడించికొన్న సమత్వబుద్ధి యోగ
మహితసంస్కార మందితన్మార్గవశతఁ
దిరిగి బ్రహ్మైక్యగతికి యత్నించు నతఁడు. 43
భాగ్యవంతుని సుతుఁడైన భ్రష్టయోగి
విషయలోలుఁ డయ్యును బూర్వ విషయములకు
నలరుచు సమత్వబుద్ధియోగాశ్రయుఁ డయి
తొలఁగఁ ద్రోచు సకామ కర్మల ఫలమ్ము. 44
కోరి యభ్యాస మొనరించి కొన్న యోగి,
చెలఁగి జన్మలఁ; జిత్తసంసిద్ధి వడసి
పాపనిర్ముక్తుఁడై తదభ్యాసవశతఁ
బరమగతిఁ గాంచు బ్రహ్మైక్యభావయుక్తి. 45
ఘనుఁడు యోగి తపస్విలకంటె - యోగి
ఘనుఁడు శాస్త్రిక విజ్ఞానధనులకంటె-
ఘనుఁ డగు సకామకర్మ సంగతుల కంటె
యోగి - కౌంతేయ! నీవును యోగి వగుము. 46
యోగు లందఱిలో శ్రద్ధ నొప్పు యోగి
మద్గతిని బొంది యంతరాత్మను సతమ్ము
నన్ను భజియించుశక్తి సంపన్నుఁ డగుట-
వాని యుక్తతమునిగ భావన మొనర్తు. 47

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యాయనం బడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీ కృష్ణార్జున
సంవాదమున నాత్మసంయమయోగ మను
ఆఱవ యధ్యాయము.

---

శ్రీమత్పరమాత్మనే నమః

# గీతా సప్తశతి

## అథసప్తమోఽధ్యాయః - జ్ఞానవిజ్ఞాన యోగః

శ్రీ భగవానువాచ:

మయ్యాసక్త మనాః పార్థ
యోగం యుంజన్ మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం
యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన
మిదం వక్ష్యా మ్యశేషతః,
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్
జ్ఞాతవ్య మవశిష్యతే. 2

మనుష్యాణాం సహస్రేషు
కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం
కశ్చి న్మాం వేత్తి తత్వతః. 3

భూమి రాపోఽనలో వాయుః
ఖం మనోబుద్ధి రేవ చ,
అహంకార ఇతీ యం మే
భిన్నా ప్రకృతి రష్టధా. 4

అపరే యమితస్త్వన్యామ్
ప్రకృతిం విద్ధి మే పరామ్,

శ్రీమత్పరదేవతాయైనమః.

# గీతా సప్తతి

## ఏడవ అధ్యాయము - జ్ఞానవిజ్ఞానయోగము

నా యెడఁ నిల్పి హృదయ మనన్యభక్తి
మత్పరాయణతఁ యోగమహితుఁడ వయి
నన్నుఁ బరిపూర్ణ సుగుణ సంపన్ను నీవు
గనుఁగొను విధమ్ము నిశ్శంక వినుము పార్థ! 1

అనఘ! విను మింక విను తు రహస్యయుక్త
మైన యీ తత్వ మిపుడు సమగ్రముగను
దీని నెఱిఁగిన పిదప నేదియును నీకు
వినెడు విషయమ్ము లే దనిపించుఁగాదె! 2

మామక ప్రాప్తిఁగన వేయి మంది లోన
నొకఁడు యత్నించు నేమొ పర్యుత్సుకతను
వరుస నవ్విధి యత్నించు వారి లోన
నెవ్వఁడో యుండు నొకఁడు నన్నెఱుఁగు నతఁడు 3

నిప్పు- నీరును- గాలియు - నింగి - మనము -
బుద్ధియును - నహంకారమ్ము - భూతధాత్రి
యనెడు నీయష్టభేదమ్ములై తనర్చు
ప్రకృతి నాయది; జడ సంజ్ఞఁబరగు నిద్ది. 4

పార్థ! వింటివిగా జడప్రకృతిఁ గూర్చి -
చేతనాత్మక మై జీవభూత మైన

జీవభూతాం మహాబాహో
యయేదం ధార్యతే జగత్. 5

ఏతద్యోనీని భూతాని
సర్వాణీత్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః
ప్రభవః ప్రలయస్తథా. 6

మత్తః పరతరం నాన్య
త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతమ్
సూత్రే మణిగణా ఇవ. 7

రసోఽహ మప్సు కౌంతేయ
ప్రభాస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వవేదేషు
శబ్దః ఖే పౌరుషం నృషు. 8

పుణ్యో గన్ధః పృథివ్యాం చ
తేజ శ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు
తప శ్చాస్మి తపస్విషు. 9

ప్రకృతి మఱియొండు గల దంచు నిఁకను దీనిఁ
దెలిసి కొను; మిద్దియే జగంబుల భరించు. 5

చేతనాచేతనాత్మకరీతిఁ దనరు
ప్రకృతి యుగ్మంబె భూత ప్రపంచయుక్త
జగతికిఁ గారణమ్ము – తజ్జగతి కేను
కర్త నై యుందు–మృతికిని కర్త నగుదు. 6

కడకు విను మింక నాకంటె ఘను డొకండు
కనఁ బడడు నీకు మూఁడు లోకమ్ము లందు
దారము ధరించియున్న రత్నముల మాడ్కి–
సృష్టి సర్వమ్ము నేన ధరింతుఁ గాదె! 7

సూర్యచంద్రులఁ దనరారు జ్యోతి నేను–
వేదముల నొప్పు నోంకారనాద మేను–
నీట – రసమేను – పురుషుల నెగడునట్టి
పౌరుషము నేను – మింటి శబ్దమ్ము నేను. 8

ధాత్రిఁదనరారు * పుణ్యంపుఁ దావి నేను
ప్రాణి కోటికి నొదవు జీవనము నేను
వహ్నిఁ దనరారు తేజః ప్రభావ మేను
తాపసశ్రేష్ఠు లొనరించు తపము నేను. 9

---

* శబ్దస్పర్శరూపరసగంధము లీప్రసంగమునఁ గారణరూపములగుచున్నవి. ఈ విషయమును స్పష్టము జేయుటకై 'తావి' శబ్దమునకుఁ బుణ్యత్వమాపాదింపఁబడినది.

"పుణ్యోగంధః పృథివ్యామ్" అని మూలమున వ్యాసప్రోక్తము.

బీజం మాం సర్వ భూతానామ్
విద్ధి పార్థ సనాతనమ్,
బుద్ధి ర్బుద్ధి మతా మస్మి
తేజ స్తేజస్వినా మహమ్. 10

బలం బలవతాం చాహమ్
కామరాగవివర్జితమ్,
ధర్మావిరుద్ధో భూతేషు
కామోఽస్మి భరతర్షభ. 11

యేచైవ సాత్వికా భావా
రాజసా స్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తాన్ విద్ధి
నత్వహం తేషు తే మయి. 12

త్రిభి ర్గుణ మయై ర్భావై
రేభి స్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి
మామేభ్యః పర మవ్యయమ్. 13

దైవీ హ్యేషా గుణ మయీ
మమమాయా దురత్యయా,
మా మేవ యే ప్రపద్య న్తే
మాయా మేతాం తర న్తి తే. 14

న మాం దుష్కృతినో మూఢాః
ప్రపద్య న్తే నరాధమాః,

నన్నఖిల భూతకోటిసనాతనైక
కారణుని గాఁగఁ దెలిసికోఁ గడఁగు మింక
బుద్ధిమంతులఁ దనరారు బుద్ధి నగుదు
ననఘ! తేజోఽధికులఁ దేజమై తనర్తు. 10

నిఖిల బలశాలు రందు గన్పించు కామ
రాగవిరహితబలముగా రాణఁ గాంతు
నఖిల భూతప్రపంచ ధర్మానుకూల
కామమున నొప్పి వర్తింతుఁ గా సతమ్ము. 11

అనఘ! సత్వరజస్తమోగుణ జనితము
లైన భావమ్ము లంబుధి కలల రీతి
నావి యనుకొమ్ము కాని – తద్భావగతులఁ
జెలఁగ నింతకు – నవియు నన్నలమి కొనవు. 12

ఆర్య! గుణమయ భావత్రయమ్ము చేత
నావరింపంగఁ బడిన యియ్యఖిల జగము–
తద్గుణాతిరిక్తుండ నై తనరి యుంట
నవ్యయుఁడ నైన నాదు మహత్తుఁ గనదు 13

పరిథవిల్లు చలాకికప్రతిభ నొరుల
కేగతిని జూడరాని నాయోగమాయ
త్రిగుణమయి యాట నన్ను నుతించు వారు
మాత్రము తరింత్రు తన్మాయ మరులు గొనక. 14

మాయకుఁ జిక్కి–జ్ఞానమ్ము మంటఁ గలిపి
యసుర వృత్తికిఁ జొచ్చి హేయమ్ము లైన

మాయయా పహృతజ్ఞానా
ఆసురం భావ మాశ్రితాః. 15

చతుర్విధా భజన్తే మామ్
జనా స్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ. 16

తేషాం జ్ఞానీ నిత్యయుక్త
ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ
మహం స చ మమ ప్రియః. 17

ఉదారా స్సర్వ ఏవైతే
జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థిత స్స హి యుక్తాత్మా
మా మేవా నుత్తమాం గతిమ్. 18

బహూనాం జన్మనా మన్తే
జ్ఞానవా న్మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వ మితి
స మహాత్మా సుదుర్లభః. 19

కామై స్తై స్తై హృతజ్ఞానాః
ప్రపద్యన్తేఽన్యదేవతాః,
తం తం నియమ మాస్థాయ
ప్రకృత్యా నియతా స్స్వయా. 20

కృత్యములు సల్పు మానవకీటకమ్ము
లనఁ బరగు మూర్ఖులే కొల్వ రనఘ! నన్ను. 15

ధన మపేక్షించు వాఁడు; బాధానిమగ్న
మతియు; జిజ్ఞాసువును; జ్ఞానమార్గనిరతుఁ;
డవని నీనాల్గు తెగల పుణ్యాత్ము లైన
మానవులు గాదె నన్ను నేమరక గొల్తు. 16

నిరతి నేకాగ్రభావ సన్నిహితుఁడైన
జ్ఞాని శ్రేష్ఠుఁడు వారిలో- సత మనన్య
భక్తి నన్ గొల్చుచుంటఁ; దద్భక్తవరుఁడు;
ప్రియుఁడు నాకగు - వానికిన్ బ్రియుఁడ నేను. 17

కడమ మువ్వురుఁ గూడ నెక్కుడు నుదార
హృదయు లయ్యును; జ్ఞాని, నా యీ స్వరూప
మంది కొని యుంట స్థిరబుద్ధి నలరి మోక్ష
రూపమున నొప్పు నన్ జేరి ప్రాపుఁ గాంచు. 18

'వాసుదేవుండు నాకు సర్వస్వ' మనుచు
జ్ఞానవంతుండు పెక్కు జన్మలకు నవల
నన్నుఁ జేరి భజించు నాపన్నమతిని
నవని దుర్లభుఁ డట్టి మహాత్ముఁ డనఘ! 19

తమస్వభావాను గుణముగఁ దాము కోరు
కోరికల చేత జ్ఞానమ్ముఁ గోలు పోయి
విషయలోలురు, సతము సేవింతు రన్య
దేవతలను దన్నియమవిధిప్రసక్తి. 20

యో యో యాం యాం తనుం భక్తః
శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్యతస్యా చలాం శ్రద్ధామ్
తా మేవ విదధా మ్యహమ్. 21

స తయా శ్రద్ధయా యుక్త
స్తస్యారాధన మీహతే,
లభతేచ తతః కామా
న్మయైవ విహితాన్ హితాన్. 22

అన్తవన్తు ఫలం తేషామ్
తద్భవ త్యల్పమేధసామ్,
దేవాన్ దేవయజో యాన్తి
మద్భక్తా యాన్తి మా మపి. 23

అవ్యక్తం వ్యక్తి మాపన్నం
మన్యన్తే మా మబుద్ధయః,
పరం భావ మజానన్తో
మమావ్యయ మనుత్తమమ్. 24

నాహం ప్రకాశ స్సర్వస్య
యోగమాయా సమావృతః,
మూఢోఽయం నాభిజానాతి
లోకో మా మజ మవ్యయమ్. 25

వేదాహం సమతీతాని
వర్తమానాని చార్జున,

కోరికలు జిత్తమునఁ గూర్చుకొన్న భక్తు
డెవ్వఁ డేయే విధమ్ముల నెట్టి దేవ
తలను శ్రద్ధఁ బూజింపంగఁ దలఁచు కొనునొ
వాని కవ్విధులన్ శ్రద్ధ నేన కూర్తు. 21

అట్టి శ్రద్ధ వహించిన యాతఁ డిష్ట
దేవతలఁ గొల్చు వాఁడయ్యు – నే విధించు
వాంఛితార్థ మారాధ్య దేవతల వలనఁ
గొనెడుగా – సర్వ దేవాత్మకుండ నగుట. 22

తెలివి లేనట్టి నరులు సాధించి కొనిన
ఫలము లింతకుఁ దనరు నిష్ఫలము లగుచు
దేవయజు లైన మనుజులు దేవతాళిఁ
జేర – మద్భక్తులును నన్నుఁ జేరు కొంద్రు. 23

చావుపుటుకలు లేక నిచ్చలుఁ జరించు
నన్నుఁ బరమాత్మరూపుఁగా నెన్నుకొనని
యజ్ఞులు, స్వమాయచే రూప మంది కొన్న
యప్పు డవ్యక్తు నన్నెంత్రు వ్యక్తిగాఁగ. 24

యోగమాయావృతుండ నై యొప్పి నప్పు
డెల్లరకు నేను గన్పింపకే చరింతు–
నందుచే మూఢమతి, తత్వ మరయ లేక
నన్ను నవ్యయు నజునిగా నెన్ను కొనఁడు. 25

భూతసముదాయమునఁ బుట్టఁబోవు వాని ;
బుట్టి బ్రదికెడు వానిన్; గిట్టియున్న

భవిష్యాణి చ భూతాని
మాం తు వేద న కశ్చన. 26

ఇచ్ఛా ద్వేష సముత్థేన
ద్వంద్వ మోహేన భారత,
సర్వభూతాని సమ్మోహం
సర్గే యాన్తి పరంతప. 27

యేషాం త్వంతగతం పాపమ్
జనానాం పుణ్యకర్మణామ్,
తే ద్వంద్వ మోహనిర్ముక్తా
భజన్తే మాం దృఢవ్రతాః. 28

జరామరణ మోక్షాయ
మా మాశ్రిత్య యతంతి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న
మధ్యాత్మం కర్మ చాఖిలమ్. 29

సాధిభూతాధి దైవం మామ్
సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణకాలేఽపి చ మామ్
తే విదు ర్యుక్త చేతసః. 30

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయామ్ యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే జ్ఞానవిజ్ఞానయోగోనామ
సప్తమోఽధ్యాయః.

వాని నన్నింటి నెఱిఁగిన వాఁడ నేను
గాని యొకఁడేని గలఁడె నన్ గనెడు వాఁడు! 26

ద్వేషవాంఛల చే సముద్గతము లౌచుఁ
బరగు సుఖదుఃఖరూపద్వంద్వములఁ కతనఁ
బొదలి మోహింపఁ బడు సర్వభూతవితతి,
పుట్టి నప్పుడె మోహావిస్ఫూర్తిఁ దనరు. 27

పుణ్యకార్యైక నిరతులై పొదలు జనులు,
పాపనిర్ముక్తులై ద్వంద్వరూపమోహ
పాశ మెడలించి కొని దృఢవ్రతపరాయ
ణత్వమునఁగాదె సర్వథా నన్నుఁ గొల్తు(రు). 28

ముసలితనమును బంచత్వమును నశింప
నన్నుఁ దా మాశ్రయించి యత్నం బొనర్చు
వార. లధ్యాత్మ మన నేమొ – బ్రహ్మ మనఁగ
నెద్ది యో – కర్మ యన నేమొ యెఱిగి కొంద్రు. 29

మబ్బు, ఆవిరి, నీరు, హిమమ్ము, పొగయు
జలమయము లంచుఁ దలపోయుసరణి నన్ను
సాధిభూతాధి దైవాధియజ్ఞమయుని
గా నెఱుఁగువారు తెలివితోఁగాంత్రు మృతిని. 30

ఇది శ్రీమదుపనిషద్బ్రహ్మవిద్యయనంబడు యోగశాస్త్ర
మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీ కృష్ణార్జున
సంవాదమున జ్ఞానవిజ్ఞాన యోగ మను
నేడవ యధ్యాయము.

---

శ్రీమత్పరమాత్మనే నమః

# గీతా సప్తశతి

## అథాష్టమోఽధ్యాయః - అక్షరబ్రహ్మయోగః

—:o:—

అర్జున ఉవాచ :

కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం
కిం కర్మపురుషోత్తమ,
అధిభూతం చ కింప్రోక్త
మధిదైవం కి ముచ్యతే. 1

అధియజ్ఞః కథం కోఽత్ర
దేహేఽస్మి న్మధుసూదన,
ప్రయాణకాలే చ కథమ్
జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

అక్షరం బ్రహ్మ పరమం
స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,
భూతభావోద్భవ కరో
విసర్గః కర్మసంజ్ఞితః. 3

అధిభూతం క్షరో భావః
పురుష శ్చాధి దైవతమ్,

శ్రీమత్పరదేవతాయై నమః

# గీతా సప్తశతి

## ఎనిమిదవ అధ్యాయము - అక్షర బ్రహ్మయోగము

---

అవలఁ గౌంతేయుఁ డిట్లాడె హరిని గాంచి
దేవ! అధ్యాత్మ మెది? బ్రహ్మ దేని నండ్రు?
కర్మ మెయ్యది? అధిభూతమర్మ మెద్ది?
యింత * కధిదైవ మని దేని నెఱుఁగ వలయు? 1

బావ! అధియజ్ఞ మగు చెద్ది పఱఁగు నయ్యె
యిద్ది యిటు లుండ మృతివేళ కీ శరీర
మందుఁ గల బుద్ధిచే నియతాత్ము లైన
వారిచే నెట్లు తెలిసికోఁ బడెద వీవు? 2

క్రీడి కి ట్లనె మధువైరి – కీడు లేక
యలరు నది బ్రహ్మ; మధ్యాత్మ మయ్యె దేహి;
భూతభావోద్భవకరమ్ము బుణ్యకార్య
విధి కొనర్చు ద్రవ్యత్యాగవిధము కర్మ. 3

ధర జనించి లయించు పదార్థవితతి
కెల్ల "అధిభూత" మను పేరు సెల్లెఁ గాదె

---

* అధిదైవతమ్మునకు సూత్రాత్మయనియు హిరణ్య గర్భుఁడనియుఁ ప్రజాపతియనియు బ్రహ్మయనియుఁ దత్వశాస్త్రమున నామములు గలవు

అధియజ్ఞోఽహ మే వాత్ర
దేహే దేహభృతాం వర. 4

అన్తకాలే చ మా మేవ
స్మరన్ ముక్త్వా కలేవరమ్,
యః పశ్యతి స మద్భావమ్
యాతి నా స్త్యత్ర సంశయః. 5

యం యం వాపి స్మరన్ భావమ్
త్యజ త్యన్తే కళేవరమ్,
తం త మే వైతి కౌన్తేయ
సదా తద్భావభావితః. 6

తస్మా త్సర్వేషు కాలేషు
మా మనుస్మర యుధ్య చ,
మయ్యర్పిత మనోబుద్ధి
ర్మా మే వైష్య స్యసంశయమ్. 7

అభ్యాసయోగ యుక్తేన
చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం
యాతి పార్థానుచింతయన్. 8

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరే ద్యః,
సర్వస్య ధాతార మచింత్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. 9

తనరు సూత్రాత్మ యధిదైవతమ్ము గాఁగ
నేన దేహాళి నధియజ్ఞ గా నటింతు. 4

అనఘ! నన్ను స్మరించుచు నంత్యకాల
మందు దేహమ్ముఁ జాలించు నట్టి జనుఁడు
సందియము లేక మద్భావ మందుఁ గాదె
భావనామాత్రపటిమ నిర్బాధకముగ. 5

అర్జునా! విను దేహాంత మందు మనుజుఁ
డింత కే యే తలంపుల నెదఁ దలంచు
చుండు; నా యా తలంపుల కొదవు ఫలము
మాత్రమే పొందు భావనామాత్రపటిమ. 6

కనుక సర్వకాలమ్ముల నను దలంచు
చీవు సమరమ్ముఁ గావింపు మిద్ధచరిత!
పొదవి నాయందు నీమనోబుద్ధు లెప్పు
డనుసరించిన నన్ను నీ వంది కొనెదు. 7

పార్థ! పరమేశ్వరధ్యానపటిమచేత
నితర మెల్లని మదితోడ సతము ధ్యాన
యుక్తి ధ్యానించు జనుఁ, డుత్తమోత్తముఁ డగు
దివ్యపురుషుని జేరు సందియము లేదు. 8

సర్వభూత విధాతృ – శాసకు–నచింత్య
రూపు – సూక్ష్మాతిసూక్ష్మస్వరూపు – భాను
తులితవర్ణు – నవిద్యావిదూరు – సకల
నిగమవేది – ననాది – ధ్యానించు చెవఁడు. 9

ప్రయాణకాలే మనసాచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్. 10

య దక్షరం వేదవిదో వదన్తి
విశన్తి య ద్యతయో వీతరాగాః,
య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

సర్వద్వారాణి సంయమ్య
మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ
మాస్థితో యోగధారణామ్. 12

ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్ మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్ దేహం
స యాతి పరమాం గతిమ్. 13

అనన్యచేతా స్సతతం యో
మాం స్మరతి నిత్యశః,
త స్యాహం సులభః పార్థ
నిత్యయుక్తస్య యోగినః. 14

మా ముపేత్య పునర్జన్మ
దుఃఖాలయ మశాశ్వతమ్,

అంత్యకాలమ్మునన్ యోగ మాశ్రయించి
కనుబొమలమధ్యఁ బ్రాణంబుఁ గదియఁ జేర్చి
స్థిరమతిన్ మించి భక్తి వర్తిల్లఁ గలఁడో
దివ్యపురుషుని - బరము - సంధించు - నతఁడు, 10

వైదికులు దేని నోంకారనాద మనిరో ;
వీతరాగులు దేనఁ బ్రవేశవిధిని
బడసిరో; బ్రహ్మపద మంద బ్రహ్మచర్య
శీలు రెది గైకొని; రది వచింతు వినుము. 11

ఇంద్రియద్వారముల నెల్ల నిట్టె మూసి
మదిని మది యందె చక్కగాఁ బొదివి పట్టి
తనదుప్రాణమ్ము నిలిపి మూర్ధమ్ము నందు
యోగధారణవిధి నుండి యోగివరుఁడు. 12

వడిగ నేకాక్షరస్వరూపుఁ డగుబ్రహ్మ
గుఱిఁచి 'ఓ'మ్మనిప్రణవసంభరితనాద
రూఢిఁ దవిలి తదర్థస్వరూపుఁడ నగు
నన్నుఁ దలఁచుచు మృతిఁబొంది నన్నుఁ జేరు. 13

పార్థ! నిత్య మనన్యభావమ్ము తోడ
నన్నుఁ గొల్చెడుభక్తిసంపన్నుఁ డైన
యోగి కింతకు సులభసాధ్యుండ నగుదు
జీవునకు బ్రహ్మకున్ గల చెలిమిఁ దెలుప. 14

పరమసంసిద్ధి వడసిన భక్తవరులు,
నన్నుఁ జేరినపిదప నెన్నటికిఁ గాని

నాప్నువన్తి మహాత్మానః
సంసిద్ధిం పరమాం గతాః. 15

ఆబ్రహ్మ భువనాల్లోకాః
పునరావర్తినోఽర్జున,
మా ముపేత్య తు కౌన్తేయ
పునర్జన్మ న విద్యతే. 16

సహస్రయుగ పర్యన్త
మహర్యద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాన్తామ్
తేఽహోరాత్రవిదో జనాః. 17

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః
ప్రభవ న్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయన్తే
తత్రైవావ్యక్త సంజ్ఞకే. 18

భూతగ్రామ స్స ఏ వాయం
భూత్వాభూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ
ప్రభవన్త్య హ రాగమే. 19

పర స్తస్మాత్తు భావోఽన్యోఽ
వ్యక్తోఽవ్యక్తా త్సనాతనః,
య స్స సర్వేషు భూతేషు
నశ్యత్సు న వినశ్యతి. 20

బరమదుఃఖదమై క్షణభంగురమ్ము
నగు పునర్జన్మ మను రొంపిఁ దగులు కొనరు. 15

బ్రహ్మభువనమ్ము మొదలుగా బరమవివిధ
లోకములు బునర్జన్మకు లోఁగి యుంట
నవి యనిత్యము లయ్యె – మద్భువనగతుని
కగుపడదు పునర్జన్మ – నిత్యత్వసిద్ధి. 16

యుగసహస్రమ్ము విధి కొక పగలు గాఁగ
నలరి నటు ; లింకొక యుగసహస్ర మతని
రాత్రి కాఁగాదె! దీని నిర్ణయ మొనర్చు
జను, లహోరాత్ర విదులుగా వినుతిఁ గాంత్రు 17

పుడమిఁ గనుపట్టుచున్న యీ భూతకోటి,
బ్రహ్మసూక్ష్మాకృతిన్ దినారంభవేళ
నుదయమున్ జెంది తిరిగి నిశోదయమున
నడఁగెడున్ ధాతృసూక్ష్మదేహమ్ము సొచ్చి. 18

భూతసంతతి యివ్విధిఁ బుట్టి పుట్టి
ప్రకృతివశమునఁ బెరుగుచు – రాత్రివేళఁ
గ్రమముగా లీనమై– దినారంభవేళ
మఱలఁ బ్రభవించు చుండుఁ గ్రమమ్ము గాఁగ. 19

బ్రహ్మ సూక్ష్మ శరీరమ్ము బారి పడని
యల సనాతన మైన యవ్యక్తభావ
మనఁ బరగు పరబ్రహ్మ, మఖిలభూత
రాశి లయ మందఁ ; దాను మాత్రమ్ము నిలుచు. 20

అవ్యక్తో ఒక్షర ఇత్యుక్త
స్త మాహుః పరమాం గతిం,
యం ప్రాప్య న నివర్తన్తే
తద్ధామ పరమం మమ. 21

పురుషః స పరః పార్థ
భక్త్యా లభ్య స్త్వనన్యయా,
యస్యాన్తస్థాని భూతాని
యేన సర్వ మిదం తతమ్. 22

యత్ర కాలే త్వనావృత్తి
మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాన్తి తం కాలం
వక్ష్యామి భరతర్షభ. 23

అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః
షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛన్తి
బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

అక్షరం బ్రహ్మ్యో నవ్యక్త మైవ భావ-
మట్టి భావమ్మె సద్గతి యనఁగఁ బరగ-
దేనినిఁ బొంది మనుజులు దిరిగి జన్మ
మంద - రది పరమపద - మయ్యాదియె నాది.          21

ధాత్రి భూతమ్ము లెవని కంతర్గతమ్ము
లై తనర్చెనొ - యెవనిచే నఖిలజగము
వ్యాప్తమై పోల్చెనో యట్టి పరమపురుషుఁ
డవ్యయుఁడు లభ్యుఁ డింత కనన్యభక్తి.          22

ధ్యానయోగసమాధినిఁ దవిలి ప్రణవ
ముచ్చరించుచు మృతిఁబొందు యోగితతికి
జననరాహిత్యమును - బునర్జన్మ యనెడు
నిజు తెలుఁగు లొప్పు - వానినీ కిపుడు వినుతు.          23

* అనఘ! షణ్మాసముల - నుత్తరాయణమునఁ-
బగట - నగ్నిదీప్తిని- శుక్లపక్ష మందుఁ
బడసి మృతి - బ్రహ్మముఁ జేరి బ్రహ్మవేత్త,
లపునరావృత్తి సౌఖ్యంబు లనుభవింత్రు.          24

---

* సీ॥ ప్రాణముల్ దొఱగిన బ్రహ్మవేత్తను ముందు
జ్యోతిర్మయాగ్ని నిర్భీతిఁ గొనును
నవలఁ దాఁ గొంపోయి యతనినహ స్సను
నభిమానిదేవత కప్పగించుఁ
బదపడి నది శుక్ల పక్షాభిమాని దే
వత కడ నుండ నవ్వాని నిల్పు
నవ్వేనుక షణ్మాస మవధి గాఁ గల యుత్త
రాయణమున కద్ది యతనిఁజేర్చు

ధూమో రాత్రి స్తథా కృష్ణః
షణ్మాసా దక్షిణాయనం,
తత్ర చాన్ద్రమసం జ్యోతి
ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

శుక్లకృష్ణే గతీ హ్యేతే
జగతః శాశ్వతే మతే,
ఏకయా యా త్యనావృత్తి
మన్యయా వర్తతే పునః. 26

* అటులె షణ్మాసముల—దక్షిణాయనమున—
ధూమమున – కృష్ణపక్ష మందున—నిశీథ
మందు—మృతిఁ జెందు సంయము లిందు తేజ
మంది దివిఁ బొల్చి జన్మింతు రవల భువిని. 25

దేవపితృయానములఁ బ్రసిద్ధిని వహించు
శుక్లకృష్ణైకమార్గముల్ సూచితమ్ము;
లిందు నొకదాన జన్మరాహిత్యఫలముఁ
దనరు – మఱుపుట్టు రెండవదానఁ గలుగు. 26

---

తే॥ నిటుల నంచెలఁ బయనించి యిద్ధచరితుఁ
డైన యయ్యోగిపుంగవుఁ డతులశక్తి
భక్తి నలరారి యప్పరబ్రహ్మఁ గూడి
అపునరావృత్తి సౌఖ్యంబు లందు చుండు.

* సీ॥ నిష్కామయోగికి నెగడినకథ వింటి
వికఁ సకామి యగు యోగికథ వినుము
ధూమాభిమాని ముందుగ యోగిఁ గొని పోయి
రాత్ర్యభిమాని కర్పణ మొనర్చు
నయ్యది కృష్ణపక్షాభిమానికి వానిఁ
బదిలంబు గాఁ జేర్చి ముదముఁ గాంచు;
నది - వాని షణ్మాస మవధి గా గల దక్షి
ణాయనదేవత కప్పగించు;

తే॥ నదియుఁ గ్రమముగ వాని నిశాధినాథు
జ్యోతిలోఁ గల్ప - నతఁడు స్వీయోచితైక
కర్మఫలమును స్వేచ్ఛగా కడపటివఱ
కనుభవించి మర్త్యభువనమున జనించు.

నైతే సృతీ పార్థ జాన
న్యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు
యోగయుక్తో భవార్జున. 27

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం,
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్. 28

ఓమ్ తత్స దితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయామ్ యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున
సంవాదే అక్షరబ్రహ్మ యోగో
నామాష్టమోఽధ్యాయః.

★★★★★

ఉభయ విషయమ్ము లెఱిఁగిన యోగి యెవఁడు
మతిని గోల్పోయి మోహావంచితుఁడు గాడు
కాన నీవెల్ల వేళలఁ గడఁగి యోగి
వగుట కాయత్తపడుము వీరాగ్రగణ్య! 27

ఈ రహస్య మెఱుంగు యోగీంద్రుఁ డనఘ!
వేదదానతపోయజ్ఞ విధులవలనఁ
గలిగెడు ఫలమ్ము నిరసించి కాంచుఁ బరమ
పదము, నన్నింటి కాద్యమై పరగఁ యుంట. 28

ఇది శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యయనంబడు యోగశాస్త్ర
మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీ కృష్ణార్జున
సంవాదమున అక్షరబ్రహ్మ యోగ మను
ఎనిమిదవ యధ్యాయము.

★★★★★

ఓమ్ శ్రీ పరమాత్మనే నమః.

# గీతా సప్తశతి

## అథ నవమోఽధ్యాయః - రాజవిద్యారాజగుహ్యయోగము

—:o:—

శ్రీభగవానువాచ :

ఇదం తు తే గుహ్యతమం
ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞాన సహితం
యత్ జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్. 1

రాజవిద్యా రాజగుహ్యం
పవిత్ర మిద ముత్తమం,
ప్రత్యక్షావగమం ధర్మ్యం
సుసుఖం కర్తు మవ్యయం. 2

అశ్రద్దధానాః పురుషాః
ధర్మస్యా స్య పరంతప,
అప్రాప్య మాం నివర్తన్తే
మృత్యుసంసారవర్త్మని. 3

మయా తత మిదం సర్వం
జగ దవ్యక్త మూర్తినా,
మత్ స్థాని సర్వభూతాని
న చాహం తే ష్వవస్థితః. 4

శ్రీ మత్పరదేవతాయై నమః

# గీతాసప్తశతి

## తొమ్మిదవ అధ్యాయము - రాజవిద్యా రాజగుహ్యయోగము

—:o:—

ప్రల్లదంబైన బుద్ధి యెప్పుగిది లేని
నీకు విజ్ఞానభరితమై నెగడి పరమ
గుహ్యతరమైన జ్ఞానమ్ముఁ గూర్తు – దీనఁ
బడసెదవు ముక్తి దుఃఖప్రపంచ ముడిగి. 1

విజయ! యీజ్ఞానమే రాజవిద్య యగుట
రాజగుహ్యమ్మునై పవిత్రత్వ మంది
ధర్మ్యమయి, యుత్తమం బయి తనరి సాధ్య
మగుచుఁ బ్రత్యక్షఫలద – మవ్యయము నయ్యె.

జ్ఞానమయమైన యీధర్మసరణి శ్రద్ధ
లేని మనుజులు, నన్ జేర లేక తుదకు
మృత్యుజననైకరూప సంసృతిఁ బరిభ్ర
మించు చుందురు చక్రనేమిప్రవృత్తి. 3

నీటిలో మంచుకరుడు జీర్ణించినట్లు
లీప్రపంచమ్ము నాలోన నిముడు ; భూత
ములును నన్ జేరు సంకల్పమునను – నేను
భూతములఁ జేర – నవ్యక్తమూర్తి నగుట. 4

న చమత్‌స్థాని భూతాని
పశ్య మే యోగ మైశ్వరమ్,
భూతభృ న్న చభూతస్థో
మమాత్మా భూతభావనః. 5

యథాకాశస్థితో నిత్యమ్
వాయు స్సర్వత్రగో మహాన్.
తథా సర్వాణి భూతాని
మత్‌స్థానీ త్యుపధారయ. 6

సర్వభూతాని కౌన్తేయ !
ప్రకృతిం యాన్తి మామికామ్,
కల్పక్షయే పున స్తాని
కల్పాదౌ విసృజా మ్యహమ్. 7

ప్రకృతిం స్వా మవష్టభ్య
విసృజామి పునః పునః,
భూతగ్రామ మిమం కృత్స్న
మవశం ప్రకృతే ర్వశాత్. 8

న చ మాం తాని కర్మాణి
నిబధ్నన్తి ధనంజయ,
ఉదాసీన వదాసీన
మసక్తం తేషు కర్మసు. 9

మయాధ్యక్షేణ ప్రకృతి
స్సూయతే సచరాచరమ్,

తగులమే లేదు నాకు భూతమ్ములకును
దనరెఁ గద యోగమాయ తద్బంధు వగుచు
ననఘ! నాయాత్మ, భూతకోటిని సృజించి
తనువునే కాని తస్థిత్వమ్ముఁ గనదు. 5

ఆకసమునుండి పుట్టినయనిల – మెల్ల
కడలఁ దిరుగాడి మఱలనాకసము లోనఁ
దనరి నటు – లాత్మసంకల్ప జనితభూత
వితతి, నన్ జేరు ననుచు భావించి కొనుము. 6

అనఘ! భూతంబు లెల్లఁ గల్పాంత మందుఁ
బడయు విలయమ్ము మామక ప్రకృతిఁ గలిసి
మరిగి పోయిన వానిని మగిడి నేను
సృష్టిఁ గావింతుఁ గల్పాది స్వేచ్ఛఁ దవిలి. 7

విజయ! నాయోగమాయ నొప్పించి – యామె
వలవ సృజియింపఁ బడి – స్వభావముగ నస్వ
తంత్ర మందున్న పూర్ణ భూత ప్రతతిఁ–ద
దీయకర్మగతి సృజింతుఁ దిరిగి తిరిగి. 8

కర్మలింతకు నొక్కటన్ గదియఁ బట్టి
నన్ను బంధింప నేర వెన్నడును గాని
కడకుఁ బోఁదోలి వాని – నేకాకి నగుచు
మసలు చుండి యుదాసీనుమాడ్కి నుంట. 9

నన్ను నధ్యక్షమాత్రుగా నెన్నుకొన్న
త్రిగుణమయి యైన నాదగు దివ్యమాయ

హేతునానేన కౌన్తేయ
జగద్విపరివర్తతే. 10

అవజానన్తి మాం మూఢా
మానుషీం తను మాశ్రితం,
పరం భావ మజానన్తో
మమభూత మహేశ్వరమ్. 11

మోఘాశా మోఘ కర్మాణో
మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ
ప్రకృతిం మోహినీం శ్రితాః. 12

మహాత్మనస్తు మాం పార్థ
దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజన్త్య నన్యమనసో
జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. 13

సతతం కీర్తయన్తో మామ్
యతన్తశ్చ దృఢవ్రతాః,
నమస్యన్తశ్చ మాం భక్త్యా
నిత్యయుక్తా ఉపాసతే. 14

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే
యజన్తో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన
బహుధా విశ్వతోముఖమ్. 15

రచనఁ గావించు సచరాచరమ్ము జగముఁ
గాన – నది, జన్మమృతిచక్రగతి భ్రమించు. 10

అఖిలలోకైకనాథుఁడ నగుచు నలరు
నామహోన్నతభావ మెన్నంగ లేని
పామరులు నన్ను మనుజరూపమ్ముఁ దాల్చి
నపుడు సామాన్యనరునిగా నరసి కొంద్రు. 11

వ్యర్థకర్మాభిరతులు – నిరర్థమైన
జ్ఞానముఁగలారు – వ్యర్థవాంఛానిరతులు
నైన యజ్ఞానుల, సురదైత్యప్రవృత్తు
లంది కొనుచుఁ దమోగుణ మాశ్రయింత్రు. 12

దివ్యశక్తిస్వరూపులై తేజరిల్లు
ననఘు, లీభూతసృష్టి కవ్యయుఁడ ననియు
నాద్యుఁడ ననియు నెఱిఁగి నన్నభినుతించి
తనియు చుందు రనన్యచిత్తమ్ము తోడ. 13

పార్థ! దృఢశీలుఁ రైన మద్భక్తవరులు,
నాగుణమ్ములు బాడుచు నన్నుఁ జేర
యతన మొనరించు చింతకు నతు లొనర్చు
చమితభక్తి నుపాసింతు రనుదినమ్ము. 14

అన్నిటికి వాసుదేవుఁడే యని భజించు
నఖిలరూపుని నర్చి జ్ఞానయజ్ఞకలన
నొకఁడు; సేవించు సేవ్యసేవకవిధాన
వేఱొకఁడు – గొల్తు రిటు పెక్కువిధుల జనులు. 15

అహం క్రతు రహం యజ్ఞః
స్వధాహ మహ మౌషధమ్,
మన్త్రో౽హ మహ మే వాజ్య
మహ మగ్ని రహం హుతమ్. 16

పితామహస్య జగతో
మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార
ఋక్సామ యజు రేవ చ. 17

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ
నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రలయ స్థానమ్
నిధానం బీజ మవ్యయమ్. 18

తపామ్యహ మహం వర్షమ్
నిగృహ్ణామ్యు త్సృజా మి చ,
అమృతం చైవ మృత్యు శ్చ
స దస చ్చాహ మర్జున. 19

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే,
తే పుణ్య మాసాద్య సురేన్ద్ర లోక
మశ్నన్తి దివ్యా న్దివి దేవభోగాన్. 20

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,

శ్రౌతకర్మను నే నౌదు - స్మార్తకర్మ
నగుదు - నే నింక స్వధ నౌదు - నగ్ని నగుదు
ఔషధిని నేన - మంత్రమ్ము నౌదు - నాజ్య
మింత కేన - హుతమ్ము నేనే కదయ్య. 16

ఋగ్యజుస్సామ నిగమంబు లేన - యేన
ప్రణవనాదంబ; లోకైకభర్త నేన -
తల్లియును - దండ్రియును - మఱి తాత నేన
ఏన సర్వంబ - వేద్యుండ నేన యగుదు. 17

జీవరాశి సృజింపఁ; బోషింప - నొంప
దక్షుఁడను - నేన గతిని - నిధాన మేన
భర్త నే నౌదు - సాక్షిని - ప్రభువు నేన
ఏన శరణంబ - బీజంబ - హితుఁడ నేన. 18

పట్టువిడుపులు రెండింటఁ బరగు చుంట
నా తపం బేన వర్షంబ నగుదుఁ జూవె
సురల కమృతంబ - మృతిని భూచరుల కగుదు
సత్తు నగుదు నొకప్పు డసత్తు నగుదు. 19

విజయ! వేదత్రయోక్తసద్విధు లొనర్చి
యజ్ఞముల సోమపానాప్తి నఘము లుడిగి
కడకు నానుండి స్వర్గలోకమ్ము వడసి
యజ్వ; లద్దివ్యభోగమ్ము లనుభవింత్రు. 20

ఆగమోక్త సకామకర్మాభినిరతి
బుద్ధిమాలిన భోగేచ్ఛఁ బుట్టి గిట్టి

ఏవం త్రయీధర్మ మను ప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే.

అనన్యా శ్చిన్తయన్తో మాం
యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్.

యేఽప్యన్య దేవతా భక్తా
యజన్తే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మా మేవ కౌన్తేయ
యజన్త్య విధిపూర్వకమ్.

అహం హి సర్వయజ్ఞానామ్
భోక్తా చ ప్రభురేవ చ,
న తు మా మభిజానన్తి
తత్త్వేనాత శ్చ్యవన్తి తే.

యాన్తి దేవవ్రతా దేవాన్
పితౄన్యాన్తి పితృవ్రతాః,
భూతానియాన్తి భూతేజ్యా
యాన్తి మద్యా జినోఽపి మామ్.

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి,

అమరభోగంబు లివ్విధి ననుభవించి
సుకృతము నశింప భువి కేగు చంద్రు జనులు. 21

పార్థ! భక్తు లనన్యభావప్రసక్తిఁ
జెలఁగి నిష్కామయుక్తి భజింతు రేని
వారి కేను మదైక్యభావం బొసంగి
* యోగమ్ముఁ క్షేమ మొనఁ గూర్చి యోమికొందు. 22

తలఁపు లెద నిల్పి కొన్న భక్తప్రముఖ్యు
లితర దేవతలఁ శ్రద్ధ యినుమడింపఁ
గొలిచినను - దాని నాదిగా తలఁతుఁ - గాని
యరసికొనరు నన్ సర్వదేవాత్మకునిగ. 23

సర్వయజ్ఞేశ్వరుండ నై సర్వయజ్ఞ
భోక్తగాఁగూడనే నౌట వ్యక్తమ కద!
అట్టులయ్యును నన్నధియజ్ఞుఁగాఁగఁ
గనని వారు, పునర్జన్మఁ గాంతు రనఘ! 24

స్వర్గము భజింత్రు గాదె దేవవ్రతాళి;
పితృలోకమ్ముఁ గాంతురు పితృభక్తు;
లందెదరు భూతపరులు భూతైకలోక
ములను - మత్పరుల్ మద్భావమును గ్రహింత్రు. 25

ఫలమొ - పుష్పమ్మొ - పత్రమో - జలమొ _ యేది
యైన భక్తి సమర్పించు యతనశీలి

* భగవత్స్వరూప ప్రాప్తికే 'యోగ'మని పేరు. తత్ప్రాప్తికై యొనరించిన సాధనను రక్షించుకొను శక్తికే క్షేమ మని వ్యవహారము. ఈ రెంటికిని యోగక్షేమములని లోకవ్యవహారము.

త దహం భ క్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః. 26

య త్కరోషి య దశ్నాసి
యజ్జుహోషి దదాసి యత్,
య త్తపస్యసి కౌ న్తేయ
త త్కురుష్వ మదర్పణమ్. 27

శుభాశుభ ఫలై రేవమ్
మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగ యుక్తాత్మా
విముక్తో మా ముపైష్యసి. 28

సమోఽహం సర్వభూతేషు
న మే ద్వేష్యోఽ స్తి న ప్రియః,
యే భజ న్తి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్. 29

అపి చేత్సు దురాచారో
భజ న్తే మా మనన్యభాక్,
సాధు రేవ స మ న్తవ్యః
సమ్యగ్వ్యవసితో హి సః. 30

ప్రేమపూర్వక మగు వస్తువితతిఁ గొనుచుఁ
బార్థ! భజియింతు సగుణరూపమ్ము తోడ. * 26

నీవు గావించు కర్మను - నీవు దినెడు
భోజ్యము - హవిస్సనర్గ-బుద్ధిపూర్వకముగఁ
జేయు దానంబు - సద్విధిఁ జేయుతపము
నర్పణ మొనర్పు నాకు బ్రహ్మార్పణముగ. 27

కర్మ లర్పించు దృఢబుద్ధిఁ గలిగి యెల్ల
కర్మలు మదర్పణఁ మొనర్చి - కడకు నన్నుఁ
జేరుము - శుభాశుభ ఫల సంసిద్ధిరూప
కర్మబంధవినిర్ముక్తిఁ గాంచి పార్థ! 28

సర్వభూతమ్ములకు సర్వసముఁడ నౌదు
నొకని యెడ లేదు ద్వేష -మింకొకని పట్ల
లేదు ప్రేమమ్ము-నన్నుఁగొల్చెడు సుజనుల
యెడల నే నుందు - వారు నాయెడల నుంద్రు. 29

అతిదురాచారుఁ డయ్యు ననన్యభక్తి
జనుఁడు నన్ గొల్చెనేని సజ్జనుఁడు గాఁగ
నతఁడు భావింపఁ బడుఁ గాదె యఘము లుడుప
వాస్తవికబుద్ధి భజనతత్పరత నుంట. 30

---

* అగ్ని సాధన రూపకములగు నింధనముల మూలమునఁ బ్రత్యక్షమైనట్లు సూక్ష్మరూపమున సర్వత్ర వ్యాపించియున్నప్పటికిఁ బరమేశ్వరుఁ డనన్యచిత్తముతో భజించెడు భక్తులయంతఃకరణంబు లందు ప్రత్యక్షమగుచునే యుండును.

క్షిప్రం భవతి ధర్మాత్మా
శశ్వ చ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌన్తేయ ప్రతిజానీ హి
న మే భక్తః ప్రణశ్యతి. 31

మాం హి పార్థ వ్యపాశ్రిత్య
యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్ర
స్తేఽపి యాన్తి పరాం గతిమ్. 32

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా
భక్తా రాజర్షయ స్తథా,
అనిత్య మసుఖం లోక
మిమం ప్రాప్య భజస్వ మామ్. 33

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు,
మా మేవైష్యసి యుక్త్వైవ
మాత్మానం మత్పరాయణః. 34

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయామ్ యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
రాజవిద్యా రాజగుహ్య యోగో నామ
నవమోఽధ్యాయః.

ఆతఁ డతి శీఘ్రగతిని ధర్మాత్ముఁ డగుచు
నిత్యముగ దేజరిల్లు శాంతిని గ్రహించి
ధీరుఁడై మించి నెగడుఁగాంతేయ! నిజము
చెడడు మద్భక్తుఁడెన్నఁడు చేటుఁ గాంచి. 31

స్త్రీలు, వైశ్యులు, శూద్రులు జివఱ కెట్టి
పాపమతులైన నగఁజేరి పరమభక్తిఁ
జిత్తసంశుద్ధి సతము భజించి రేని
దివ్యగతిఁ గాంతు—రిందు సంచయము లేదు. 32

మహితపుణ్యవ్రతు లగు బ్రాహ్మణులఁ గూర్చి
దివ్యరాజర్షులైన క్షత్రియులఁగూర్చి
యింక వచియింప వలెనె నీ వీయనిత్య
మనుజదేహమ్ములోఁ గొల్వు మనఘ! నన్ను 33

నాయెడ మనమ్ము నిల్పు మనన్యభక్తి—
ననుఁ యజింపుము మత్పరాయణుఁడ వౌచుఁ
జేర్చియాత్మ—నమస్కృతిఁ జేసి—నాకు
భక్తుఁ డవు గమ్ము—మత్ప్రాప్తిఁ బడసె దీవు. 34

ఓమ్ తత్స దితి శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యాయనం బడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీకృష్ణార్జున
సంవాదమున రాజవిద్యారాజగుహ్య యోగ మను
తొమ్మిదవ అధ్యాయము.

---

శ్రీమత్పరమాత్మనే నమః

# గీతా సప్తశతి

## అథ దశమోఽధ్యాయః – విభూతియోగః

---

భూయ ఏవ మహాబాహో
శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ
వక్ష్యామి హితకామ్యయా. 1

న మే విదు స్సురగణాః
ప్రభవం న మహర్షయః,
అహ మాది ర్హి దేవానాం
మహర్షీణాం చ సర్వశః. 2

యో మా మజ మనాదిం చ
వేత్తి లోకమహేశ్వరం,
అసమ్మూఢ స్స మర్త్యేషు
సర్వపాపైః ప్రముచ్యతే. 3

బుద్ధిర్ జ్ఞాన మసంమోహః
క్షమా సత్యం దమ శ్శమః,
సుఖం దుఃఖం భవోఽభావో
భయం చా భయమేవ చ. 4

అహింసా సమతా తుష్టి
స్తపో దానం యశోఽయశః,

శ్రీమత్పరదేవతాయై నమః

# గీతా సప్తశతి

## పదియవ అధ్యాయము - విభూతియోగము

---

విజయ! నుడివిన నుడువులు వింటి - వింక
మీదఁ బ్రేమోదయమ్ము నామీఁద నీకు
వరల; నద్దాని గుది కూర్చి తిరిగి పరమ
తత్వ మెఱిఁగింతు వినుము - హితైషి నగుట. 1

అమరవరు లేని దివ్యమహర్షు లేని
దెలిసి కొన రైరి తమతమ దివ్యమహిమ
లలిత మౌనాదు జననలీలావిభూతి
ననఘ! నే వారి కాదికారణుఁడ నగుట. 2

అఖిలలోకైకవిభునిగా - నజునిగాఁగ -
న న్ననాదిగ నెఱిఁగిన నయవిదుండు
పాపనిర్ముక్తుఁడై ధాత్రిఁ బరగు - జ్ఞాన
వేత్తగా మానవాళి భావింపఁ బడుచు. 3

క్షమయు - జ్ఞానమ్ము - నిర్మలశమము-దమము -
నిశ్చయాత్మకబుద్ధియు - నిర్భయమ్ము -
భయము-దుఃఖమ్ము-సుఖము-సంభవము-లయము
విమలసత్యమ్ము - సమ్మోహవిరహితమ్ము. 4

సమతయును, దానమును, నహింసయుఁ దపమ్ము
యశము - నయశమ్ము - హర్షమ్ము నాది గాఁగ

భవన్తి భావా భూతానాం
మత్త ఏవ పృథగ్విధాః. 5

మహర్షయ స్సప్తపూర్వే
చత్వారో మనవ స్తథా,
మద్భావా మానసా జాతా
యేషాం లోక ఇమాః ప్రజాః, 6

ఏతాం విభూతిం యోగం చ
మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికంపేన యోగేన
యుజ్యతే నాత్ర సంశయః. 7

అహం సర్వస్య ప్రభవో
మత్త స్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజన్తే మాం
బుధా భావ సమన్వితాః. 8

మచ్చిత్తా మద్గతప్రాణా
బోధయన్తః పరస్పరం,
కథయన్తశ్చ మాం నిత్యం
తుష్యన్తి చ రమన్తి చ. 9

తేషాం సతతయుక్తానాం
భజతాం ప్రీతిపూర్వకం,
దదామి బుద్ధియోగం తం
యేన మా ముపయాన్తి తే. 10

వరలు భూతపృథగ్విధ భావసమితి
ప్రభవ మందెడుఁ గాదె నావలనఁ బార్థ! 5

శిష్టసనకాది యోగిచతుష్టయమ్ము-
నత్రిమున్యాదిదివ్యసప్తర్షి గణము-
మనుజ సృష్టికిఁ గర్తలై మను మనువులు
బదియు నల్వురు - మన్మనోభవులు గారె. 6

మామకైశ్వర్యమునకు సంబంధ మైన
యీవిభూతిని - యోగమ్ము - నెఱిఁగి నట్టి
యోగివర్యుండు నిశ్చలయోగయుక్తి
నెగడు మద్భావ మంది _ సందియము లేదు. 7

వాసుదేవస్వరూపాప్తి వరలు నన్ను
సర్వలోక విధాతగా జ్ఞాను లరసి
నావలన సర్వజగము చేష్టావిభూతి
నందె నని యెంచి భక్తి న న్ననుసరింత్రు. 8

అసువు లేని దొంఱంగి నాయందు చిత్త
మర్పణ మొనర్చి - నాగాథ లనుదినమ్ముఁ
గూడి పాడుచు బోధించి కొనుచు భక్త
లొండొరు ర మించు మర్త్య దృప్తి నొందు చుంద్రు. 9

ధ్యానయుక్తిని దవిలిఁ సంతతము నన్నుఁ
బ్రేమ పూర్వకముగఁ గొల్చు ధీమహితుల
కే నిడుదు జ్ఞానయోగ ; మద్దాని చేత
న న్నుపాసించి వార లున్నతిని గాంత్రు. 10

తేషా మేవానుకమ్పార్థ
మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మ భావస్థో
జ్ఞాన దీపేన భాస్వతా. 11

అర్జున ఉవాచ :

పరం బ్రహ్మపరం ధామ
పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య
మాది దేవ మజం విభుమ్. 12

ఆహు స్త్వా మృషయ స్సర్వే
దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాస
స్స్వయం చైవ బ్రవీషి మే. 13

సాధువుల యందుఁ గలిగిన జాలి చేతఁ
దన్మనస్సంస్థితుఁడ నౌచుఁ దనరు నేను
జ్ఞానరూపప్రదీపభాస్వత్ప్రదీప్తిఁ
బరపి యడఁగింతు నజ్ఞానభవముఁ దమము.  11

* అంతఁ బార్థుండు శౌరి కిట్లనె - వికుంఠ
భువనపతివి - శాశ్వతుఁడవు - పుణ్యమూర్తి-
వజుఁడ - వీవు - పరబ్రహ్మ - వఖిలవిభుఁడ-
వాదిదేవుండ వీవు దివ్యపురుషుఁడవు.  12

అనఘ! ఇటు నిన్ను మునులు గొండాడి - రటులె
పాడె దేవర్షి - గొల్చె దేవలుఁడు - వ్యాసుఁ
డును నుతించెడు - నసితుఁడున్ దనిసె - నింకఁ
దడవఁ బనియేల స్వయముగా నుడివి తీవ.  13

---

* సీ॥ శ్రీనివాసుం డిటు చేసిన బోధచే
నలరి పార్థుఁడు శౌరి కనియె నిట్లు
దేవ! పరబ్రహ్మవీవ - వైకుంఠప
తివి పవిత్రైకమూర్తివి మహాత్మ!
నిను దివ్య పురుషుగా నిఖిలదేవాదిదే
వునిగ శాశ్వతునిగా భూతపతిగ
నజునిగా నుతియించి రఖిలమునీశ్వరు
లిదిగా క దేవర్షి యే భజించె
తే॥ నసితుఁడు స్మరించె - దేవలు డనుసరించె
వ్యాసుఁ డింతకు నిన్ గొనియాడెఁ గాదె
వారు వీరననేటికి వారిజాక్ష!
నీవ స్వయము గనుడువవే నే వినంగ

సర్వ మేతదృతం మన్యే
యన్మాం యదసి కేశవ,
న హి తే భగవన్ వ్యక్తిం
విదు ర్దేవా న దానవాః. 14

స్వయమేవాత్మ నాత్మానం
వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ
దేవదేవ జగత్పతే. 15

వక్తు మర్హా స్య శేషేణ
దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభి ర్విభూతి భి ర్లోకా
నిమాన్ స్త్వం వ్యాప్య తిష్ఠతి. 16

కథం విద్యా మహం యోగిన్
స్త్వాం సదా పరిచిన్తయన్,
కేషు కేషు చ భావేషు
చిన్త్యోఽసి భగవ న్మయా. 17

విస్తరేణాత్మనో యోగం
విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తి ర్హి
శృణ్వతో నాస్తి మేఽమృతమ్. 18

శ్రీభగవానువాచ :
హన్త తే కథయిష్యామి
దివ్యా హ్యాత్మవిభూతయః,

నీవు పలికిన దంతయు నిక్కువ మని
నే నెఱింగితిఁ గేశవా! నీయనంత
లలితలీలాస్వరూపవిలాసములను—
అసురు లన నేల సుర లైన నరయఁ గలరె. 14

దేవదేవ! జగన్నాథ! దివ్యపురుష!
భూతభావన! భూతేశ! భూతవంద్య!
నిన్ను నీ వాత్మచేత నెంతేని దెలిసి
కొనెద; వితరులు నిర్గ నుం గొనఁ గలారె? 15

వేనిచే దేవ! కనఁ బడు విశ్వ మెల్ల
నిండి సర్వమ్ము నీవ యై నెగడు చుందు;
వట్టి భవదీయదివ్యలీలాంచితమ్ము
లగు చరిత్రలు విన్పింపఁ దగుదు వీవ. 16

ఏను, జిరకాలమున్ భజియించు చాత్మ
నెటుల సద్భక్తిఁ గందు యోగీంద్ర! నిన్ను?
నటులఁ గాదేని నే యే ప్రయత్నవిధుల
దేవ! ధ్యానింపఁ బడెదవో తెలుపు నాకు. 17

తావకైశ్వర్యభరిత లీలావిభూతి
గూర్చియును — యోగశక్తిని గూర్చి తిరిగి
విస్తరించి పలుకు — మెంత వినిన నమృత
మొలుకు పల్కులకు మనం బుత్సహించె! 18

తోడనే నవ్వి హరి యిటు క్రీడి కనియె
విను కురుశ్రేష్ఠ! నీకు నే వినుతు ముఖ్య

ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ
నా_స్త్యన్తో వి_స్తరస్య చ. 19

అహ మాత్మా గుడాకేశ
సర్వభూతాశయ స్థితః,
అహ మాది శ్చ మధ్యం చ
భూతానా మ_న్త ఏవ చ. 20

ఆదిత్యా నా మహం విష్ణు
ర్జ్యోతిషాం రవి రంశుమాన్,
మరీచి ర్మరుతా మస్మి
నక్షత్రాణా మహం శశీ. 21

వేదానాం సామవేదోఽస్మి
దేవానా మస్మి వాసవః,
ఇంద్రియాణాం మనశ్చాస్మి
భూతానా మస్మి చేతనా. 22

రుద్రాణాం శంకర శ్చాస్మి
వి_త్తేశో యక్షరక్షసాం,
వసూనాం పావక శ్చాస్మి
మేరు శ్శిఖరిణా మహమ్. 23

పురోధసాం చ ముఖ్యం మాం
విద్ధి పార్థ బృహస్పతిం,
సేనానీ నా మ హం స్కన్దః
సరసా మస్మి సాగరః. 24

ములగు మద్దివ్యఘనవిభూతులను - గాని
లేదు వానికిఁ దుది - విపులీకరింప. 19

సర్వభూతాంతరింద్రియసంస్థితుండ
నగుటయే కాక - సర్వాత్మ నగుదు నేను
జీవజీవభూతకోటి సృజించి పెంచి
నిరయ మొనఁ గూర్చువాఁడ నే నే కదయ్య. 20

అదితిసంతానమా ద్వాదశాత్మజులఁ ద్రి
విక్రమాకృతిఁ బరగిన విష్ణుమూర్తి
నగుదు - జ్యోతిస్సులన్ రవి నౌదు - శశిని
రిక్కల - మరుత్తు లందు మరీచి నేను. 21

వేదములలోన నన్ సామవేద మంత్రము;
దేవతల లోన - నే నౌదు దివిజపతిగ;
నింద్రియము లందు నే నంతరింద్రియంబ;
సర్వభూతమ్ములన్ జ్ఞానశక్తి నేన. 22

యక్షరాక్షసు లందు నే యక్షవిభుఁడ;
రుద్రుఁడఁ గద యేకాదశరుద్రు లందు;
వసువు లందున నేను బావకుఁడ నౌదు;
గొండ లందున బంగారుకొండ నగుదు. 23

తనరుదు బృహస్పతిగఁ బురోధసుల యందు;
సర్వసైన్యాధిపతుల దుర్జయబలప్ర
వీణతన్ మించు దేవసేనాని నగుదు;
సాగరము నేను దివ్యకాసారవితతి. 24

మహర్షీణాం భృగు రహం
గిరా మస్మ్యేక మక్షరం,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి
స్థావరాణాం హిమాలయః. 25

అశ్వద్ధ స్సర్వ వృక్షాణాం
దేవర్షీణాం చ నారదః,
గన్ధర్వాణాం చిత్రరథః
సిద్ధానాం కపిలో మునిః. 26

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం
విద్ధి మా మమృతోద్భవం,
ఐరావతం గజేన్ద్రాణాం
నరాణాం చ నరాధిపం. 27

ఆయుధానా మహం వజ్రం
ధేనూనా మస్మి కామధుక్,
ప్రజన శ్చాస్మి కన్దర్పః
సర్పాణా మస్మి వాసుకిః. 28

అనన్త శ్చాస్మి నాగానాం
వరుణో యాదసా మహం,
పితౄణా మర్యమా చాస్మి
యమ స్సంయమతా మహమ్. 29

ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం
కాలః కాలయతా మహం,

అనఘ! భృగుమహాని నగుదు మహార్షు లందు;
యజ్ఞముల లోన నే జపయజ్ఞమ కద!
స్థావరాళి గిరిపతి – వచస్సు లందుఁ
బ్రణవమన నొప్పు నేకాక్షరంబు నేన. 25

సర్వవృక్షాళి నశ్వత్థశాఖి నగుదు;
బ్రహ్మమానససుతుఁడ దేవర్షు లందుఁ;
బ్రథితగంధర్వులఁ జిత్రరథుఁడ నేన;
కపిలముని నౌదు సిద్ధసంఘమ్ము లోన. 26

సమదశాత్రవభంగ! ఉచ్చైశ్శ్రవ మను
నమృతజం బైన యశ్వంబ నగుదుఁ గాదె!
యేన యైరావతంబ గజేంద్రవితతి;
నరుల నరపతి గాఁగ నే వరలు చుందు. 27

సంతతికి హేతువౌ పంచశరుఁడ నగుదు ;
నాయుధంబుల లోన వజ్రాయుధంబ ;
నాల–వేలుపుగిడ్డి నై యలరు చుందు
నేన – సర్పాళి వాసుకి నే కదయ్య ! 28

నాగముల నొప్పు చుందు ననంతసంజ ;
వరుణదేవుండ జలదేవతల లోన ;
నర్యముఁడ నేన పితరులయందు – యముఁడ
నౌదు శాసకులైన సంయముల లోన. 29

నేన ప్రహ్లాదుఁడఁ దైత్యనివహ మందు;
సమయవిజ్ఞాతలఁ గాల సంజ్ఞఁ బరగి

మృగాణాం చ మృగేన్ద్రోఽహం
వైనతేయ శ్చ పక్షిణాం. 30

పవనః పవతా మస్మి
రామ శ్శస్త్రభృతా మహమ్,
ఝషాణా మ్మకర శ్చాస్మి
స్రోతసా మస్మి జాహ్నవీ. 31

సర్గాణా మాది రంత శ్చ
మధ్యం చైవాహ మర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం
వాదః ప్రవదతా మహమ్. 32

అక్షరాణా మ కారోఽస్మి
ద్వంద్వ స్సామాసికస్య చ
అహ మే వాక్షయః కాలో
ధాతా హం విశ్వతోముఖః. 33

మృత్యు స్సర్వ హర శ్చాహ
ముద్భవ శ్చ భవిష్యతాం,
కీర్తిః శ్రీవాక్చనారీణాం
స్మృతిర్మేధా ధృతిః క్షమా. 34

బృహత్సామ తథా సామ్నాం
గాయత్రీ ఛందసా మహం,
మాసానాం మార్గశీర్షోఽహ
మృతూనాం కుసుమాకరః. 35

మెలఁగు చుందు – మృగేంద్రుఁడ మృగము లందు ;
వైనతేయుండ నండజవ్రాత మందు. 30

వ్రతముగా నిత్యముఁ బవిత్ర మొనర్చు
పూతచరితులఁ బవన దేవుండ నేను–
శస్త్రధారుల రాముండ – ఝషసమూహ
మందు మకరంబ ; జాహ్నవి నగుదు నదుల. 31

సృష్టియందలి సంభవస్థితిలయస్వ
రూపములు నేన – ఉభయవాదోపవాద
సరణి నిర్ణీతతత్వనిశ్చయము నేన ;
విద్య లందలి యధ్యాత్మవిద్య నేన. 32

అక్షరమ్ములఁ దొలి వర్ణ మగు 'న' కార
మగుదు – ద్వంధ్వంబ నే సమాసాళి – నవ్య
యమగు కాల స్వరూపంబ – నఖిలభూత
పోషకుం డగు విశ్వతోముఖుఁడ నేను. 33

"సర్వహరుఁ" డనుమృత్యు సంజ్ఞను జరింతు ;
నవనిఁ బుట్టెడు వారి పుట్టు వను నగుదు ;
తరుణు లందున శ్రీయు – మేధస్సు – వాక్కు–
ధృతియు – స్మృతియును–క్షమయుఁ–గీర్తియును నేను.

సామగానమ్ములఁ బృహత్సామ మేన ;
యగుదు – ఛందస్సు లందు గాయత్రి నగుదు ;
మార్గశీర్షంబ నగుదు నే మాసవితతి ;
ననఘ! ఋతువుల నామని నగుదు నేన. 35

ద్యూతం ఛలయతా మస్మి
తేజ స్తేజస్వినా మహం,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి
సత్వం సత్వ వతా మహమ్. 36

వృష్ణీనాం వాసుదేవోఽస్మి
పాణ్డవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః
కవీనా ముశనా కవిః. 37

దణ్డో దమయతా మస్మి
నీతి రస్మి జిగీషతాం,
మౌనం చైవాస్మి గుహ్యానాం
జ్ఞానం జ్ఞానవతా మహమ్. 38

య చ్చాపి సర్వ భూతానాం
బీజం తదహ మర్జున,
న త ద స్తి వినా యత్స్యా
న్మయా భూతం చరాచరమ్. 39

నాన్తోఽ స్తి మమ దివ్యానాం
విభూతీనాం పర న్తప,
ఏష తూద్దేశతః ప్రోక్తో
విభూ తే ర్వి స్తరో మయా. 40

జూదగాండ్రాడు కొను నట్టి జూద మేన ;
సర్వతేజస్వులఁ బ్రభాశాలి నేన ;
జేతృవిజయంబ – నిశ్చయశీలిసుదృఢ
భావ మే నాదు – బలశాలి బలము నగుదు. 36

వాసుదేవుండ యదువంశభవుల లోనఁ ;
నరుఁడ నై యుందుఁ బంచపాండవుల యందు,
మునిగణమ్ముల బాదరాయణుఁ డ నాదు
గవులలో శుక్ర నామకకవియునగుదు. 37

దండమువిధించువారి యుద్దండశిక్ష
నేన – విజిగీషు లందలి నీతి నేన–
పరమగుహ్యంబులఁ మౌనభావ మేన–
జ్ఞానవంతుల విజ్ఞానశక్తి నేన. 38

సర్వభూతైక సృష్టి సంస్కారమునకు
బీజభూతంబ నే నని విజయ! బుద్ధి
నెఱుఁగు–మింతకు నీచరాచరము లందు
నేను లేని పదార్థమెందేని గలదె! 39

పుడమి మద్దివ్యలీలావిభూతివితతి
కంతమే లేదు – కాని నీస్వాంతమునకు
మోదముఁ గూర్ప నీకు దద్భూతివితతిఁ
జెప్పితిఁ గాదె పార్థ సంక్షిప్తరీతి. 40

యద్య ద్విభూతి మత్సత్త్వం
శ్రీమదూర్జిత మేవ వా,
త త్తదే వావగచ్ఛ త్వం
మమ తేజో౽ంశ సంభవమ్. 41

అథవా బహు నై తేన
కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహ మిదం కృత్స్న
మేకాంశేన స్థితో జగత్. 42

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే విభూతియోగోనామ
దశమో౽ధ్యాయః.



ఊర్జితం బయి కళ్యాణ యుక్త మగుచు
నెగడి యైశ్వర్యయుత మగు నిఖిలవస్తు
సమితి – మద్దివ్య తేజోఽంశజనిత మైన.
దాని గా నీవు తెలిసికోఁ దగుదు – పార్థ! 41

తత్వయుక్తిని దెలిసికోఁ దగిన దీని
నీకు సంక్షిప్త విధిని విన్పించినాఁడఁ
గలదె లాభమ్ము? పెక్కుల–నిలిచి యుంటి
* నఖిల జగ మొక్క యోగమాయాంశ నిల్పి. 42

ఇది శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యయనం బడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీ కృష్ణార్జున
సంవాదమున విభూతియోగం బను
పదియవ యధ్యాయము.

---

* పాదోఽస్య విశ్వాభూతాని
తై. అర. 3.

శ్రీమత్పరమాత్మనే నమః

# గీతా సప్తశతి

## అథైకాదశోఽధ్యాయః - విశ్వరూపదర్శనయోగః

అర్జున ఉవాచ :

మదనుగ్రహాయ పరమం
గుహ్య మధ్యాత్మ సంజ్ఞితం,
య త్త్వయోక్తం వచ స్తేన
మోహోఽయం విగతో మమ. 1

భవాప్యయౌ హి భూతానాం
శ్రుతౌ వి స్తరశో మయా,
త్వత్తః కమల పత్రాక్ష
మాహాత్మ్య మపి చావ్యయమ్. 2

ఏవ మే తద్యథాత్థ
త్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టు మిచ్ఛామి తే రూప
మైశ్వరం పురుషోత్తమ. 3

మన్యసే యది తచ్ఛక్యం
మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం
దర్శయాత్మాన మవ్యయమ్. 4

శ్రీమత్పరదేవతాయైనమః.

# గీతా సప్తశతి

## పదునొకండవ అధ్యాయము - విశ్వరూపదర్శనయోగము

—:o:—

అచ్చెరువు తోడ హరి కిట్టు లనియెఁ గ్రీడి,
నాయెడఁ జాలిఁ దలఁచి యెంతయు రహస్య
విషయ మాధ్యాత్మికముగ సద్విశదఫణితి
నుడివితివి గాదె-యజ్ఞాన ము డిగిపోవ ! 1

ప్రథితమగు భూతసంభవ ప్రలయరూప
చరిత మిదె వింటి నీనుండి సరసిజాక్ష !
దాని కంటెను నవ్యయమైన నీప్ర
భావముఁ గూడ విని తృప్తిఁ బడసి నాఁడ. 2

దేవ! నినుఁగూర్చి నీవుగాఁ దెలిపి కొన్న
నియతి వర్తింతు వీవు - సందియము లేదు
కాని బలవీర్యశక్తి సంగ్రథిత మైన
నీస్వరూపంబుఁ గనుఁగోర్కె నెగడె నాత్మ. 3

తావకవిరాట్ స్వరూప సందర్శనమ్ము
జేయఁ గలశక్తి నాయందుఁ జెలఁగె నేని
నవ్యయం బగు నీరూప మనఘ! నేను
గన వరం బిమ్ము కన్నుల కఱవుఁ దీర. 4

శ్రీభగవా నువాచ :

పశ్య మే పార్థ రూపాణి
శతశో౽థ సహస్రశః,
నానావిధాని దివ్యాని
నానావర్ణా కృతీ ని చ. 5

ప శ్యాదిత్యా న్వసూ న్రుద్రా
నశ్వినౌ మరుత స్తథా,
బహూ న్యదృష్టపూర్వాణి
ప శ్యాశ్చర్యాణి భారత. 6

ఇహైకస్థం జగత్కృత్స్నం
పశ్యాద్య సచరాచరం,
మమ దేహే గుడాకేశ
య చ్చాన్య ద్ద్రిష్టు మిచ్ఛసి. 7

న తు మాం శక్యసే ద్రష్టు
మనేనై వ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః
పశ్య మే యోగ మైశ్వరమ్. 8

సంజయ ఉవాచ :

ఏవ ముక్త్వాతతో౽రాజ
న్మహాయోగేశ్వరో హరిః,
దర్శయా మాస పార్థాయ
పరమం రూప మైశ్వరమ్. 9

నవ్వి యిటులాడెఁ గ్రీడితో నగధరుండు ;
తలఁపుఁ గల దేని నానావిధమ్ము లగుచు
వింతరంగుల - వందల వేలకొలఁదిఁ
దనరు మద్దివ్యరూపముల్ గనుము పార్థ! 5

దివ్యు లగు నాదితేయు లాదిత్యవరుల
రూపుఁ గాంచి - యేకాదశరుద్రులఁగని ;
అశ్వినుల - మరుత్తులను - వస్వష్టకమ్ము
నరసి - ము న్నరయని వాని నరయు మింక. 6

అనఘ! సచరాచరం బయి యలరి నాదు
దేహమున నొక్క-చోట సుస్థిరత నున్న
యీ సమస్త జగమ్ము నీ వింత కరసి
చూడ నెంచెదు వానిని జూడు మవల. 7

ప్రాకృతం బైననీ దృష్టి కందరాని
వానిగా నన్ను భావించి తేని వినుము
దివ్య దృష్టిఁ బ్రసాదింతు-దీనఁ గనెదు
నీవ మద్యోగ శక్తి ప్రభావములను. 8

''పరమ యోగేశ్వరుండైన హరియె యిట్టు
లని - నిజైశ్వర్యయుక్త దివ్యస్వరూప
మును గిరీటి గన్గొనఁ బ్రదర్శన మొనర్చె''
నని పతికిఁ దెల్పి - సంజయుఁ ; డనియె నిట్లు. 9

అనేకవక్త్రనయన
మనేకాద్భుతదర్శనం,
అనేకదివ్యాభరణం
దివ్యా నేకోద్యతాయుధమ్. 10

దివ్యమాల్యాంబరధరం
దివ్యగంధానులేపనం,
సర్వాశ్చర్య మయం దేవ
మనన్తం విశ్వతోముఖమ్. 11

దివి సూర్యసహస్రస్య
భవేద్యుగ పదుత్థితా,
యది భాస్సదృ శీ సా స్యా
ద్భాసస్తస్య మహాత్మనః. 12

తత్రైకస్థం జగత్కృత్స్నం
ప్రవిభక్త మనేకధా,
అపశ్యద్దేవ దేవస్య
శరీరే పాణ్డవస్తదా. 13

తత స్స విస్మయావిష్టో
హృష్టరోమా ధనంజయః.
ప్రణమ్య శిరసా దేవం
కృతాంజలి రభాషత. 14

అర్జున ఉవాచ :

పశ్యామి దేవాన్ స్తవ దేవ దేహే
సర్వాన్ స్తథా భూతవిశేష సంఘాన్,

వివిధముఖనేత్రముల్ గల్గి; వివిధదివ్య
భూషణంబులఁ దనరారి; భూరిశస్త్ర
వితతిసందీపితోద్యతశతసహస్ర
భుజబల విభూతి నద్భుతస్ఫూర్తి మించి. 10

దివ్య మాల్యాంబరైక దీధితిఁ జెలంగి
దివ్యగంధానులేపన దీప్తి నలరి
యచ్చెరువు మీర – దేవుఁ డనంతుఁ డపుడు
విశ్వతోముఖుఁడై నిల్చె విజయు నెదుట. 11

అర్కలోక వేయి మంది విహాయసమున
నొక్కమారుగ నుదయింప నొదవు కాంతి
కీడగునొ యేమొ – యిపు డిటఁ గ్రీడి యెదుట
హరి ప్రదర్శించు విశ్వరూపైకదీప్తి. 12

దేవ, పితృ, మానవులు విడఁదీయఁ బడుచు
వివిధముఖములఁ జెలువారు భువన మిపుడు
ప్రోగుగాఁ జేరి విశ్వరూపుని శరీర
మున నొదిగి యున్నయట్టు లర్జునుఁడు గనియె. 13

కనిన యంతనె విస్మయాక్రాంతుఁ డగుచుఁ
బులకితశరీరుఁడై పాండు భూపసుతుఁడు
శిరముఁ గీలించి హరికి జేజే లొనర్చి
యంజలి ఘటించి నిలిచి యిట్లనియె భక్తి. 14

దేవ! నీమేనఁ బశుపతిన్–దివ్యభుజగ
తతి – సురల–మానులన్ – భూతవితతిఁ–గాంచి

బ్రహ్మాణ మీశం కమలాసనస్థ
మృషీꣳశ్చ సర్వా నురగాన్ శ్చ దివ్యాన్.

అనేకబాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపం,
నాన్తం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప. 16

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతోదీప్తిమంతం,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్. 17

త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానం,
త్వ మవ్యయః శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే. 18

అనాది మధ్యాన్త మనన్త వీర్య
మనన్త బాహుం శశిసూర్య నేత్రం,
పశ్యామిత్వాం దీప్త హుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపన్తమ్. 19

ద్యావా పృథివ్యో రివ మన్తరం హి
వ్యాప్తం త్వయైకేన దిశ శ్చ సర్వాః,
దృష్ట్వా ద్భుతం రూప ముగ్రం త వేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. 20

తనియ కద్దానఁ; బుడమి నెత్తమ్మిలోని
మేరు వను కర్ణికఁ బరమేష్ఠిఁ గంటి. 15

నిన్ననేకభుజోదర నేత్రముఖుని
గా - ననంతస్వరూపునిగాఁ గనుఁగొని
ఆది మధ్యాంత రహితుండ వని మదాత్మ
విశ్వసించితి - విశ్వేశ! విశ్వరూప! 16

అంతట వెలుంగు వానిఁగా-నప్రమేయుఁ
గా - గదాచక్రమకుట సంగతుఁగ - దీప్త
భానువహ్నిద్యుతునిఁగఁ - దేజోనిచయుఁగఁ
జూచు చున్నాను దుర్నిరీక్ష్యునిఁగ-నిన్ను. 17

వేదితవ్యుండ వీ వింక విశ్వనిధివి-
నాశరహితుండ వీవు - సనాతనుండ-
వక్షరుఁ డ వైన బ్రహ్మ - వనాదిధర్మ
రక్షకుఁ డ వంచు నిన్ను నిర్ణయ మొనర్తు. 18

ఆదిమధ్యాంతరహితుఁగా-నమితబలుని
గా - ననంతభుజాన్వితుఁగా-రవీందు
నేత్రుఁగా-ప్రజ్వలితవహ్నినిబిడ ముఖుని
గా - స్వదీప్తి తప్తభువనుఁగా-నెఱిఁగితి. 19

దివికి భువికిని మధ్య వర్తించు నట్టి
యాకసంబును - దిశలు నీవై చెలంగ;
నద్భుతము - భీతిఁ - గొల్పు నీయాకృతిఁ గని
భువనములు మూఁడు వ్యాకులమ్మున మునింగె. 20

అమీ హి త్వాం సురసంఘా విశన్తి
కేచి ద్భీతాః ప్రాంజలయో గృణన్తి,
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. 21

రుద్రాదిత్యావసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపా శ్చ,
గన్ధర్వయక్షాసురసిద్ధసంఘా
వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే. 22

రూపం మహ త్తే బహువక్త్ర నేత్రం
మహాబాహో బహుబాహూరు పాదం,
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్త థాహమ్.

నభ స్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో. 24

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవకాలానలసన్నిభాని,
దిశో న జానే నలభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస. 25

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవా వనిపాలసంఘైః,

సురలు నీ మేని లోఁ జొచ్చుచుండి—రిచట
నచటఁ గొందఱు భీతి ని న్నభినుతించు
చుండి రంజలి సేసి – పైనుండి స్వస్తి
వచనముల - సిద్ధులును, మునుల్ ప్రస్తుతింప. 21

వసువులుఁ – రుద్రు – లాదిత్యు – లసురు – లశ్వ
నులును – సాధ్యులు – విశ్వదేవులు – మరుద్వి
తతి – పితరులు – యక్షులును – గంధర్వు లింక
సిద్ధు లిదె చూచుచుండి ర చ్చెరువు మీరి. 22

అమిత ముఖములతోడ--నేత్రముల తోడ
నమితబాహూదరోరు పాదములతోడ–
నలరు బహుళదంష్ట్రికరాళాంచితు – నిను
నరసి లోకమ్ము లడలె—నే ననఁగ నెంత! 23

వ్యోమ సంస్పర్శుఁ–బ్రజ్వలితోరు నేత్రు–
నిన్ను–వ్యాత్తానవక్త్రు – సందీప్తబహుళ
వర్ణునిఁ గాంచి యిచటఁ బ్రవ్యథితమతిని
గోలుపోయితి శమముతోఁ గూడ ధృతిని. 24

ప్రళయకాలానలోజ్జ్వల ప్రభలఁ దనరి
భయదదంష్ట్రికరాళ విభ్రాజితమ్ము
లగు మొగమ్ములఁ గని దిగ్భ్రమా ప్తి సుఖము
విడిచితి మహాత్మ! యిఁకఁ బ్రసన్నుఁడవు గమ్ము 25

ధార్తరాష్ట్రులు–భువిఁ గల ధాత్రిపతులు–
ద్రోణుఁడును, శాంతనవుఁడు – గర్ణుండు–నీదు

భీష్మో ద్రోణ స్సూతపుత్రా స్తథాసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః.
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచి ద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాంగైః

యథా నదీనాం బహవోఽంబువేగాః
సముద్ర మేవాభిముఖా ద్రవన్తి,
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభి విజ్వలన్తి.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః.

లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా
ల్లోకాం స మగ్రాన్ వదనై ర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో.

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవ వరప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం
నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్.

వదనగహ్వరములఁ జొరం బడుటకుఁ గటి
బద్ధు లైనారు మన చమూపతుల తోడ. 26

బెట్టిదము లైన దంష్ట్రల భీతిఁ గొల్పు
వదనముల నేను నే నని వరుసఁ గూలి;
రందుఁ గొందఱు కోరల యందుఁ దవులఁ-
బగులు చున్నట్లు దలలు గన్పట్టు చుండె! 27

తీవ్రగతితోడఁ బారునదీప్రవాహ
ములు, సముద్రాభిముఖములై చెలఁగి నటుల
నిఖిల నరపాలచయవాహినీవ్రజమ్ము
తావకజ్వలితాస్యాబ్ధిఁ దవిలె నొకట. 28

కడురయమ్మున మోహాప్తి మిడుఁత గుంపు
ప్రజ్వలిత మైన మంటలోఁ బడి వినాశ
మంది నటు-ఈ జనాళి చే టంది వేగ
మ్రగ్గుచున్నారు నీనోటి మంటఁ గూలి. 29

కాంతు లలమిన మాత్ర-లోకమ్ము లెల్లఁ
దపనశక్తికి లొంగి తప్తములు గాఁగ
మంట లెగసెడునోళుల వెంట వెడలు
మంటలన్ వాని గ్రసి యించు చుంటి వనఘ! 30

పలుకుము ప్రసన్నమతి నుగ్రఫణితి నలరు
నీ వెవండవు - నతి సేతు దేవ! నీకు
నీప్రవృత్తి నెఱుంగని నేను నీదు
మొదటి రూప మెఱుంగ నెంచెద మహాత్మ! 31

శ్రీభగవా నువాచ :

కాలోఽస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవ స్థితాః ప్రత్యనీకేషుయోధాః. 32

తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుజ్‌క్ష్వరాజ్యం సమృద్ధం,
మయైవైతే నిహతాః పూర్వ మేవ
నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్. 33

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యా నపి యోధవీరాన్,
మయా హతాన్ స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. 34

సంజయ ఉవాచ:

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః. 36

పలికె భగవానుఁ డిట్లు వివ్వచ్చుతోడ
లోకనాశన విధికిఁ గాలుండ నగుట
నీనిమిత్తము లేకయే నీ సమస్త
వైరులర్గ గూల్తు జగముతోఁ బాటు నిపుడు. 32

నిహతులైనారు పూర్వమే నీవిరోధు
లెల్ల నానుండి - కనుక లె మ్మింక రిపుల
రణమున జయించి – యశమొంది రాజ్య మందు
మింతకు నిమిత్తమాత్ర మీావంతె చాలు. 33

ద్రోణగాంగేయ సైంధవభానుసుతుల
తోడఁ జచ్చిన కడమయోధులను గూడ
జంపు మింకేల భయము – నీ శాత్రవాళిఁ
దునిమి జయ మందెదవు – లెమ్ము దుర మొనర్పు. 34

విజయుఁ డివ్విధి హరి నుడుల్ విని చలించి
వందవ మొనర్చి యంజలి బద్ధుఁ డగుచు
గజగజవడంకి భీతిచే గద్గదోక్తిఁ
బ్రణుతి సేసి మగిడి శౌరి కనియె నిట్లు. 35

తగును సుమ్మిద్ది – నీకీర్తి – జగము, రాగ
రంజితం బౌట మిగుల హర్ష మ్మొంౕదె
బలముఁ జెడి దైత్యగణము, దిక్కులకుఁ బర్వఁ
జేయుచున్నారు ప్రణుతులు సిద్ధు లొకట. 36

కస్మాచ్చ తేన నమేర న్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోప్యాదికర్త్రే,
అన న్త దేవేశ జగన్నివాస
త్వ మక్షరం సదస త్త త్పరం యత్. 37

త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానం,
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మన న్తరూప. 38

వాయు ర్యమోఽగ్ని ర్వరుణః శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ,
నమో నమ స్తే స్తు సహస్రకృత్వః
పున శ్చ భూయోఽపి నమో నమ స్తే. 39

నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అన న్త వీర్యామిత విక్రమ స్త్వం
సర్వం స మాప్నోషి తతోఽసి సర్వః. 40

సఖేతి మత్వా ప్రసభం యదు క్తం
హేకృష్ణ! హేయాదవ! హేసఖేతి,
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి. 41

యచ్చావహాసార్థ మ సత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు,

తొలుత సదసత్తులకు నతీతుండ వగుచు
నక్షరుఁడ వౌట మేటివై యలరి తీవు
సృష్టి కర్తకు నైతమ్ము సృష్టికర్త
వైన నీకింక మ్రొక్క ని యతఁ డెవండు? 37

ఆదిదేవుండ వఖిల విశ్వాశ్రయుఁడవు
వేద్యుఁడవు నీవ - మఱియును వేత్తవీవ-
పుణ్యధాముఁడవు - పురాణపూరుషుఁడవు
విశ్వపరిపూర్ణుఁడవు నీవు వేదవేద్య! 38

పవనుఁడవు - వరుణుఁడవు - వైశ్వానరుఁడవు
విధివి - ప్రపితామహుండవు - విధుఁడ - వంత
కుండవగు దీవు - నావేలకొలఁది నతులఁ
గొనుము - మఱిమఱి నాదు వందనము లివియె. 39

నతి నొనర్చెద నెదుట ననంతవీర్య!
అనఘ! కావింతు నటులె వెన్నొనుక నుండి
నిఖిల రూపివై జగమెల్ల నిండి యుంట
నలు ముఖంబుల నీకు మన్నతు లు దనరు. 40

దేవ! యీ నీప్రభావమ్ముఁ దెలియ కేను
బ్రణయమునఁ గాని - పొరపాటు వలనఁ గాని
ఓయి యాదవ! ఓకృష్ణ! ఓయి సఖుఁడ!
అనుచు మొరటుగ నెచ్చెలి వని పలికితి. 41

విహృతి, శయ్యా, సనా, శనవిధులఁ దొల్లి
నొంటి తఱిఁ గాని - మిత్రుల యొద్దఁ గాని

ఏకోఽథవా ప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయం.

పితాసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్య శ్చగురు ర్గరీయాన్,
న త్వత్సమోఽ స్త్య భ్యధికః కుతోఽన్యో
లోకత్రయోఽప్య ప్రతిమప్రభావ. 43

తస్మా త్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యం,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియా యార్హసి దేవ సోఢుమ్. 44

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే,
త దేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస. 45

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ,
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే. 46

శ్రీభగవా నువాచ :

మయా ప్రసన్నేన త వార్జు నేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్,

నిన్నుఁ బరిహాసమునఁ బల్కియున్న నన్ను
నోమి సైరింపు – మప్రమేయుండ వగుట. 42

జంగమ స్థావరాత్మక జగతి కీవు
తండ్రి వది కాక – దేశికో త్తముఁ డ వౌట
మాననీయుఁడ వప్రతిమప్రభావ!
సముఁడు లే డన - జాణ లోకములఁ గలఁడె? 43

కనుక సాష్టాంగ విధి నమస్కార మిపుడు
జేసి – నిను నీశ్యునిఁ బ్రసన్నుఁ జేసి కొందు
బ్రియను బ్రియుఁ డట్లు – కొమరుని బితవిధాన
హితుని హితుఁ డట్లు నన్ సైప నీవ తగుదు. 44

ఎన్నడున్ మున్ను గనని నీ యీ స్వరూప
మరసి తనిసితి – నెద భీతి, వ్యథ గలంప
సహజరూపమ్ము తోడ దర్శన మొసంగ
వేడుచున్నాఁడ దేవేశ! విశ్వరూప! 45

నీదుకరములఁ జక్రగదాదు లమరి;
మౌళి మకుటమ్ము రాజిల—మహితనూత్న
రూప మరయ నెంచితిఁ—జతుర్భుజవిశిష్ట
దివ్యదర్శన మిదె ప్రసాదింపు మనఘ! 46

కేశవుండంత నిర్విధిన్ గ్రీడి కనియె
విమలతేజోమయమ్ము నాద్యముఁ బరమ్ము

తేజోమయం విశ్వ మన న్త మాద్యం
యన్మే త్వ దన్యేన నదృష్టపూర్వాం. 47

న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై
ర్నచక్రియాభి ర్నతపోభి రుగ్రైః,
ఏవం రూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. 48

మా తే వ్యథా; మా చ విమూఢ భావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదం,
వ్యపేతభీః ప్రీతి మనాః పున స్త్వం
త దేవ మే రూప మిదం ప్రపశ్య. 49

సంజయ ఉవాచ :

ఇ త్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా. 50

అర్జున ఉవాచ :

దృష్ట్వేదం మానుషం రూపం
తవ సౌమ్యం జనార్దన,
ఇదానీ మస్మి సంవృ త్తః
సచేతాః ప్రకృతిం గతః. 51

విశ్వరూపమ్ము నిజయోగవిధిని నీకుఁ
జూపితి — నెవండు - మును దీని జూడ లేదు. 47

వేదయజ్ఞాధ్యయనదాన విధులఁ, గ్రియల
భయదతపముల నీరూపుఁ బడయజాల
రీవొకండవు తప్ప - మఱెవ్వఁ డిట్టి
రూపమున నున్న నన్ గన నోప డెందు. 48

చూపు చెదరెడు నావిశ్వరూప మరసి
వ్యాకులమ్ము విమూఢ భావమ్ము నంది
తింతదను—కట్టి భయ మీఁగి – సంతసమునఁ
బార్థ! కను మీవు గోరురూపమ్ము మగిడి. 49

పలికి యిమ్మాడ్కిఁ దిరిగి విశ్వంభరుండు
స్వీయరూపంబు దర్శింపఁ జేసి యపుడె
సౌమ్య భావమ్మునన్ దోఁచి, సాంత్వవచన
తతి భయస్వాంతుఁ బార్థు నోదార్చె నెలమి. 50

సాంత్వవచనంబులన్ దేరి సవ్యసాచి
పలికె హరితోడ – నీసౌమ్యభావకలిత
మనుజ రూపమ్ముఁ గాంచి నామానసమున
శాంత భావమ్ము దవిలె నైసర్గికముగ. 51

శ్రీభగవా నువాచ :

సుదుర్దర్శ మిదం రూపం
ద్రష్టు వానసి య న్మమ,
దేవా అప్యస్య రూపస్య
నిత్యం దర్శనకాంక్షిణః. 52

నా హం వేదై ర్నతపసా
న దానేన నచేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం
దృష్టవా నసి మాం యథా. 53

భక్త్యా త్వనన్యయా శక్య
అహ మేవం విధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన
ప్రవేష్టుం చ పరంతప. 54

మత్కర్మ కృన్మత్పరమో
మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వ భూతేషు
య స్స మా మేతి పాణ్డవ. 55

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
విశ్వరూపదర్శన యోగోనామై
కాదశోఽధ్యాయః.

వెన్నుఁ డిట్లాడె నన్వి – యవ్వేల్పు లెల్ల
దేని దర్శింప నెంతురో దానిఁ గనితి-
పోల్చు కొనరాని మచ్చతుర్భుజవిశిష్ట;
మీ స్వరూపంబుఁ గన నౌనె యేరి కేని! 52

వేదములఁ గాని, సత్తపోవిధులఁ గాని,
దానములఁ గాని, యజ్ఞసంతతులఁ గాని,
గానఁ బడరాని నేను నీకనుల యెదుట
నాల్గు భుజముల తోడఁ గన్పడితి నిపుడు. 53

ఇట్టి రూపంబు తోడ నింపెసఁగు నన్నుఁ
బరమభక్తు, లనన్యమౌ భక్తిఁ గాంచి
జ్ఞానతత్వ ప్రసక్తి నాజాడ లెఱిఁగి;
పడయు చుంద్రు మదైక్యభావమ్ముఁ గడకు. 54

దానయజ్ఞాది విధుల నర్ద దన్పు చెపుడు
మత్పరాయణుఁ డై పొల్చు మహితభక్త
వరుఁడు, భూతాళి యెడల నిర్వైరభావ
మంది నిస్సంగుఁ డగు నేని బొందు నన్ను. 55

ఓమ్ తత్స దితి శ్రీమదుపనిషద్బ్రిహ్మ విద్యాయనం బడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీకృష్ణార్జున
సంవాదమున విశ్వరూప దర్శన యోగం బను
పదునొకండవ అధ్యాయము.

---

ఓమ్ శ్రీ పరమాత్మనే నమః

# గీతా సప్తశతి

## అథ ద్వాదశోధ్యాయః - భక్తియోగః

---

అర్జున ఉవాచ :

ఏవం సతతయుక్తా యే
భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షర మవ్యక్తం
తేషాం కే యోగవిత్తమాః. 1

శ్రీభగవానువాచ :

మయ్యావేశ్యమనో యే మాం
నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా
స్తే మే యుక్తతమా మతాః. 2

యే త్వక్షర మనిర్దేశ్య
మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచిన్త్యం చ
కూటస్థ మచలం ధ్రువమ్. 3

సంనియమ్యేంద్రియ గ్రామం
సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువన్తి మా మేవ
సర్వభూతహితే రతాః. 4

శ్రీ మత్పరదేవతాయై నమః

# గీతా సప్తశతి

## పంద్రెండవ అధ్యాయము - భక్తి యోగము

---

తోడనే క్రీడి యిటు హరితోడఁ బలికె
సగుణబుద్ధిని గొంద ఱర్చన యొనర్తురు –
నిర్గుణ బ్రహ్మ వని గొల్తురు నిన్ మఱొక్క-
రీ యుభయభక్తులన్ శ్రేష్ఠు లెవ్వ రనఘ! 1

మెచ్చి వెన్నుండు వలికె విన్వాచ్చు నరసి
చేర్చి నాయెడ హృదయ మచింత్య భక్తి
సగుణరూపానఁ దనరు సీర్వారుని నన్నుఁ
దమి నుపాసించువార లుత్తములు గారె! 2

అకథనీయస్వరూపు – నవ్యక్తు – నచలు
నిత్యుని–నచింత్యుఁ–గూటస్థు–నిఖిలగతుని–
నాశనము లేని సచ్చిదానంద మయుని
నెవరు పాసింతురో భక్తి యినుమడింప! 3

వారు, విజితేంద్రియులు గాఁగ వరలి–సర్వ
భూత సంక్షేమనిరతి విస్ఫూర్తిఁ దనరి–
అఖిలభూతైక సమబుద్ధు లౌచు నలరి–
తవిలి నన్ జేరుకొంద్రు పృథాకుమార! 4

క్లేశో౽ధికతర స్తేషా
మవ్యక్తాస క్తచేతసాం,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం
దేహవద్భి రవాప్యతే. 5

యే తు సర్వాణి కర్మాణి
మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన
మాం ధ్యాయన్త ఉపాసతే. 6

తేషా మహం సముద్ధర్తా
మృత్యుసంసారసాగరాత్,
భవామి నా చిరాత్పార్థ
మయ్యావేశితచేతసామ్. 7

మయ్యేవ మన ఆధత్స్వ
మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ
అత ఊర్ధ్వం న సంశయః. 8

అథ చిత్తం సమాధాతుం
న శక్నోషి మయి స్థిరం,
అభ్యాసయోగేన తతో
మా మిచ్ఛాప్తుం ధనంజయ. 9

అభ్యాసే౽ప్యసమర్థో౽సి
మత్కర్మ పరమో భవ,

వ్యక్తమే కాని యవ్యక్తు నాశ్రయించి;
పర్యుపాసించు సుజనుల బాధ హెచ్చు-
మది లగింపని దేహాభిమానితతికి-
నను - నిరాకారు మనన మొనర్పఁ దరమె! 5

కర్మ లెల్ల మత్పరములుగా నొనర్చి-
యీవ గతి వని మత్పరు లెవ్వ-రేని
సగుణ రూపుండ నైన యీశ్వరుని-నన్ను-
ధ్యాన మొనరింత్రు నిశ్చలధ్యానయుక్తి. 6

అట్టి వారిని శీఘ్రంబ యరసి నేను,
మనము నాయెడ నిల్పిన యనఘు లగుటఁ
గరుణ-మృత్యు సంసార సాగరము నందుఁ
గూలఁ బడనీక రక్షించి కొందుఁ బార్థ! 7

చూడఁ దలఁతేని నాయెడన్ జొనిపి మనము
బుద్ధిని లగింపఁజేసి యపూర్వభక్తిఁ
బర్యుపాసింపు - మవల సద్భక్తవరుఁడ
వయి - ననున్ జేరి కొనెదు - సందియము లేదు. 8

'నిలుకడయె లేని చిత్తమ్ము నీ యెడ నెటు
నిల్పఁ జాలుదు' నని పల్క- నేర్తు వేమొ
కాని, యభ్యాసయోగాప్తిఁ గాని దేది?
కనుక నన్ జేరనెంచు మద్దాన నీవు. 9

కడకు నభ్యాస విధికిఁ బాల్పడుటకేని
జాల నని యందు వేమొ - యే సరణి నైన

మదర్థ మపి కర్మాణి
కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. 10

అథై తదప్యశక్తోఽసి
కర్తుం మద్యోగమాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం
తతః కురు యతాత్మవాన్. 11

శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్
జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మ ఫలత్యాగ
స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్. 12

అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారః
సమదుఃఖసుఖః క్షమీ. 13

సంతుష్ట స్సతతం యోగీ
యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పిత మనోబుద్ధి
ర్యో మద్భక్త స్సమే ప్రియః. 14

యస్మా న్నోద్విజతే లోకో
లోకా న్నోద్విజతే చ యః,
హర్షామర్ష భయోద్వేగై
ర్ముక్తో య స్స చ మే ప్రియః. 15

నలరి మత్కర్మ నిరతి మదర్థములగు
కర్మ లొనరించుచో సిద్ధిఁ గాంచఁ గలవు. 10

అందులకుఁ గూడ నేఁ జాల ననెదవేమొ
ఉచితగతి నన్నుఁ బొంద మద్యోగనిరతిఁ
జెదర నీయక స్వాంతమ్ముఁ జిక్కఁ బట్టి
సర్వకర్మ ఫలత్యాగ సరణిఁ గనుము. 11

విషయ మెఱుఁగని యభ్యాస విధము కంటె
జ్ఞానమే మిన్న — ధ్యాన మద్దాని మించె—
హెచ్చెఁ గర్మఫలత్యాగ మెల్ల రోసి—
త్యాగమున శాంతి వొడము—ననంతరమున. 12

సర్వసమ్మత మైన ప్రశాంతి—మిత్రుఁ
డగుచు భూతాళి ద్వేషింప కలరి; మఱియు,
క్షాంత — సమదుఃఖసుఖుఁ—డహంకార రహితు—
డతిదయాళువు — నిర్మముఁడై — తనర్చి— 13

నిత్య సంతోషి యై—దృఢ నిశ్చయుండు
నగుచు—విజితేంద్రియుండయి యలరి; తనదు
మనము, బుద్ధియు నాయెడఁ జొనుపు నెవఁడు—
వాఁడు, మత్ప్రియ భక్తుఁడై వరలుఁ బార్థ! 14

ఎవనిచే భీతిఁ గొనక — తా నితరులకును
భీతిఁ గల్పింప కెంతయుఁ బ్రేమ నలరి—
యసహనోద్వేగసంత్రాసహర్ష రహితుఁ
డయి తనర్చెడుయోగి మత్ప్రియసఖుండు. 15

అనపేక్ష శ్శుచి ర్దక్ష
ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ
యో మద్భక్త స్స మే ప్రియః. 16

యో న హృష్యతి న ద్వేష్టి
న శోచతి న కాంక్షతి,
శుభాశుభ పరిత్యాగీ
భక్తిమా న్య స్స మే ప్రియః. 17

సమ శ్శత్రౌ చ మిత్రే చ
తథా మానాపమానయోః,
శీతోష్ణ సుఖదుఃఖేషు
సమ స్సంగ వివర్జితః. 18

తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ
సంతుష్టో యేన కేనచిత్,
అనికేత స్స్థిరమతి
ర్భక్తిమాన్ మే ప్రియో నరః. 19

యే తు ధర్మ్యా మృత మిదం
యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా
భక్తా స్తేఽతీవ మే ప్రియాః. 20

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణా
ర్జున సంవాదే భక్తియోగోనామ
ద్వాదశోఽధ్యాయః

అఖిల కర్మ పరిత్యాగి యగుచు దేనిఁ
గోర కెంతయు శుచి యౌచుఁ గుంద కెట్టి
తటిఁ–దటస్థుఁడై – దక్షుఁడై – తనరు నెవ్వఁ
డతఁడు, మద్భక్తుఁడై – ప్రియుం డగుచు నెగడు. 16
సంతసింపక–మదిని ద్వేషమ్ముఁ గనక–
పరితపింపక – గోర్కెలు సరకు గొనక–
పలు శుభాశుభ కర్మల ఫలముఁ దొఱఁగి –
మనెడు భక్తుండు, నాకు సన్మహితహితుఁడు. 17
శత్రుమిత్రుల సమబుద్ధి సంచరించు;
చటులె మానావమానమ్ము లందు సమతఁ
జెలఁగి ; శీతోష్ణ సుఖదుఃఖముల సమత్వ
భంగి–మనుయోగి, ప్రియుఁడు నిస్సంగుఁ డగుట. 18
ఒకఁడు నిందింప బెగడొంద ; కొకడు బొగడ
నుబ్బి తబ్బిబ్బు వడక – దా నున్న దాన
నొంది సంతుష్టి – నివసించు నునికి మీఁది
మమత బోనాడు స్థిరమతి – మౌని, ప్రియుఁడు. 19
మత్పరాయణులై ధర్మమయసుధాప్తిఁ
దనిసి నిష్కామ భావతత్పరత భక్తి
నేను నుడివిన రీతి శ్రద్ధానిరూఢి
నన్ను పాసించు భక్తు లెంతయును బ్రియులు. 20

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యయనం బడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీత యందుశ్రీ కృష్ణార్జున
సంవాదమున భక్తి యోగ మను పంద్రెండవ
యధ్యాయము.

శ్రీమత్పరమాత్మనే నమః

# గీతా సప్తశతి

## అథ త్రయోదశోఽధ్యాయః – క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగః

---

శ్రీభగవా నువాచ :

ఇదం శరీరం కౌన్తేయ
క్షేత్ర మి త్యభి ధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతి తద్విధః. 1

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి
సర్వక్షేత్రేషు భారత,
క్షేత్ర క్షేత్రజ్ఞ యోర్జ్ఞానం
య త్తత్ జ్ఞానం మతం మమ. 2

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ
యద్వికారి యత శ్చ యత్,
స చ యో యత్ప్రభావ శ్చ
త త్సమాసేన మే శృణుః 3

శ్రీమత్పరదేవతాయై నమః

# గీతా సప్తశతి

## పదమూడవ అధ్యాయము - క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

---

మఱియు విను మింకఁ బార్థ! యిమ్మహితకాయ
మునకుఁ దత్త్వవేత్తలు, క్షేత్ర * మనుచుఁ బేరు
బెట్టి - రటు లౌట-నిద్దాని విధ మెఱుంగు
వాఁడు క్షేత్రజ్ఞుఁడై ధాత్రి వరలుఁ గాదె. 1

తవిలి యెల్ల క్షేత్రముల క్షేత్రజ్ఞసంజ్ఞఁ
జెలఁగు జీవాత్మగా నన్ను దెలిసికొనుము
ప్రకృతి పురుషుల గూర్చి నిర్ణయ మొనర్చు
జ్ఞానమే జ్ఞాన-మితరమ్ము జ్ఞాన మగునె! 2

శిష్టచరిత! వికార భూయిష్ఠమైన
క్షేత్రమును గూర్చి - క్షేత్రజ్ఞ స్థితిని దెలుపు
తత్ప్రభావమ్ముఁ గూర్చియుఁ-దత్పరమతి
వినుము సంక్షిప్తరీతి నే వినుతుఁ బార్థ! 3

---

* క్షేత్రమున నాటఁబడిన బీజము కాలాంతరమున ననురూప ఫల మొసంగినట్లు శరీరమను క్షేత్రమున నాటికొనియున్న కర్మ సంస్కార రూపబీజఫలములు సమయానుకూలమునఁ బ్రకటితము లగుచుండును. కనుకనే యీ శరీరమునకు క్షేత్ర మని వ్యవహారము గలిగినది.

ఋషిభి ర్బహుధా గీతం
ఛందోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదై శ్చైవ
హేతుమద్భి ర్వినిశ్చితైః. 4

మహాభూతా న్యహంకారో
బుద్ధి రవ్యక్త మేవ చ,
ఇంద్రియాణి దశైకం చ
పంచ చేన్ద్రియ గోచరాః. 5

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం
సంఘాత శ్చేతనా ధృతిః,
ఏతత్ క్షేత్రం సమాసేన
సవికార ముదాహృతమ్. 6

తాపసులు మున్ను వీని తత్వమ్ము లరసి;
రవల వేర్వేరుగా దెల్పె నఖిల విధుల
వేదములుఁ గూడ—నిఁక నిర్వివాద ఫణితి
బ్రహ్మసూత్రపదంబులుఁగా బలికెఁ బిదప. 4

శబ్ద, రస, గంధ, రూప సంస్పర్శము లగు
నింద్రియము లైదు — మఱియు * దశేంద్రియములు
బుధ్యహంకారములు—మహాభూతములును—♦
† త్రిగుణ మయి యైన మూలశక్తియు — మనమ్ము. 5

సుఖము — దుఃఖము — ద్వేషమ్ము — స్థూల దేహ
కలిత సర్వేంద్రియైక సంఘాత — మింక
ధృతియు, వాంఛయుఁ జైతన్య మిట్టి పలువి
కృతుల నగు క్షేత్రచరిత సంక్షేప మిదియ. 6

---

* శ్రోత్రము, త్వక్కు — నేత్రము — రసనము, ఘ్రాణము—(ఇట్లే) వాక్కు, హస్తము — పాదము. ఉపస్థ, గుదము మున్నగు — నియ్యవి దశేంద్రియములని వ్యవహారము.

♦ ఆకాశము, వాయువు — అగ్ని, జలము, పృధివియొక్క సూక్ష్మ భావము. ఇయ్యవిపంచ మహాభూతములు.

† సత్వగుణము, రజోగుణము, తమోగుణము—ఈ మూఁడును గుణము లనఁ బరగు చున్నవి. ఈ గుణములతోఁ గూడఁ బడినది త్రిగుణమయి. ఈమెయే మూల ప్రకృతి. యోగమాయయనియు మూలశక్తి యనియు నీమెకు నామాంతరములు గలవు.

అమానిత్వ మదమ్భిత్వ
మహింసా క్షాంతి రార్జవం
ఆచార్యోపాసనం శౌచం
స్థైర్య మాత్మవినిగ్రహః. 7

ఇన్ద్రియార్థేషు వైరాగ్య
మనహంకార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధి
దుఃఖదోషానుదర్శనమ్. 8

అసక్తి రనభిష్వంగః
పుత్రదారగృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వ
మిష్టానిష్టోపపత్తిషు. 9

మయి చానన్య యోగేన
భక్తి రవ్యభిచారిణీ,
వివిక్త దేశసేవిత్వ
మరతి ర్జనసంసది. 10

ఉత్తముఁడ నన్న యభిమాన ముడిగి కొనుచు;
* స్థైర్య ♦ శౌ † చార్జ ‡ వేంద్రియ సంయమనము
లంది; నిర్దాంభికత్వ మింపొందఁ బొంది;
క్షాంత్యహింసల నలరి; యాచార్యుఁ గొలిచి- 7
రహి నహంకార ముడిగి వైరాగ్యయుక్తి;
నుభయలోకైకభోగేచ్ఛ లుజ్జగించి;
జన్మమృత్యు జరావ్యాధి సకలదుఃఖ
జనితదోషాళిఁ బలు మారు జర్చ సేసి.- 8

దారపుత్రగృహాదులఁ దవులుశ్రద్ధ
వదలి - మమకారమునకు దావశముఁ గాక-
అను దినమ్ము ప్రియాప్రియ ప్రాప్తియందుఁ
దాలిమి మనమ్ము సమరసస్థాయి నిలిపి.- 9

ప్రభువుగా నన్ను భావించి-స్వార్థ రహిత
భక్తి జొన్పి నాయెడ ధ్యానభావయుక్తి-
విషయలోలుర చెలిమిఁ బోవిడి-తగిన
యునికి నేకాంతమున వాస ముండ నేర్చి- 10

---

* స్థైర్యము = అంతః కరణముయొక్క స్థిరత్వము.

♦ శౌచము = పరిశుద్ధ ప్రవర్తనమున నాహార వ్యవహారముల వ్యవహరించుచు జలమృత్తికాదులఁ బరిశుద్ధ మొనరించుకొనుట బాహ్యశౌచము; రాగద్వేషాదులనరికట్టి అంతఃకరణమును స్వచ్ఛముగ నుంచుకొనుటయే. అంతశౌచము.

† ఆర్జవము:-మనోవాక్కుల సరళత్వము.

‡ ఇంద్రియ సంయమనము-ఇంద్రియ నిగ్రహము.

అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం
తత్త్వజ్ఞానార్థ దర్శనం,
ఏతత్ జ్ఞాన మితిప్రోక్త
మజ్ఞానం య దతోఽన్యథా. 11

జ్ఞేయం య త్త త్ప్రవక్ష్యామి
యత్ జ్ఞాత్వా మృత మశ్నుతే,
అనాది మత్పరం బ్రహ్మ
న స త్త న్నాస దుచ్యతే. 12

సర్వతః పాణిపాదం
త త్సర్వతోఽక్షి శిరోముఖం,
సర్వత శ్శ్రుతిమల్లోకే
సర్వమా వృత్య తిష్ఠతి. 13

సర్వేన్ద్రియ గుణాభాసం
సర్వేన్ద్రియ వివర్జితం,
అస క్తం సర్వభృచ్చైవ
నిర్గుణం గుణభో క్తృ చ. 14

బహి ర న్త శ్చ భూతానా
మ చరం చర మేవ చ,

తత్వవిజ్ఞానఫణితి కర్థస్వరూపుఁ
డైన యీశ్వరు సర్వత్ర నరసి కొనుచు
సంతతాధ్యాత్మికజ్ఞాన సరణి మనుట
జ్ఞాన మగుఁ బార్థ! – యితర మజ్ఞాన మాను. 11

తెలిసికోఁ దగు దానినే తెలిపెద నీకుఁ
దద్విధి నెఱుంగఁ దవరు మోదమ్ము – నదియ ;
ఆదిలేని పరబ్రహ్మ ; మకథనీయ
మాట – సద సత్పద జ్ఞేయ మద్ది గాదు 12

శ్రుతి, చరణ, పాణి, నేత్ర, శిరో, ముఖముల
నెగడు చయ్యది సర్వత్ర నిండి యుంట
సర్వలోకావృతం బయి సర్వరూపి
* యై ప్రవర్తిల్లు చుండుఁ గురుప్రవీర! 13

విరహితేంద్రియ మయ్యుఁ ; దద్విషయ మెఱుఁగు
జాణ యిది వాస్తవముగ – నాసక్తి లేని
నిర్గుణం బయ్యు – గుణభోక్త – నిఖిల భూత
మహితపోషణ నిజయోగమాయఁ దవిలి! 14

భూతముల – లోన – వెలుపలఁ బొదలు నద్ది –
అచర మయ్యది – చరరూప మదియ తాల్చు—

---

* పృథ్వికిఁ గారణరూప మైనకారణమున వాయ్వగ్నిజలములచే నాకాశము వ్యాప్తమై నిలిచి నటులఁ బరమాత్ముఁడు గూడఁ గారణభూతుఁడైన కారణమునఁ జరాచరరూప మైన జగత్తును వ్యాపించి నిలిచి యున్నాఁడు.

సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం
దూరస్థం చాన్తికే చ తత్, 15

అవిభక్తం చ భూతేషు
విభక్తమివ చ స్థితం,
భూతభర్తృ చ తత్ జ్ఞేయం
గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. 16

జ్యోతిషామపి తత్ జ్యోతి
స్తమసః పరముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం
హృది సర్వస్య విష్ఠితం. 17

ఇతి క్షేత్రం తథా జ్ఞానం
జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏత ద్విజ్ఞాయ
మద్భావా యోపపద్యతే. 18

* సూక్ష్మమై యుంట నేరిచేఁ జూడఁ బడక ;
♦ దూరమున నుండి § చెంగట౯ దోచు నదియు. 15

బ్రహ్మ, మవిభక్త మయ్యు ; విభక్తరూప
మునఁ జరాచరసంపూర్ణ భూతకోటిఁ
గ్రాలి–పోషణ, లయ, సృష్టి కార్యగతుల
హరి, హర, విరించి రూప మై యలరు చుండు. 16

మాయ కంటె నతీత మై మనెడు సద్ది–
చెలఁగునది జ్యోతియై తేజములకు–గూడ
జ్ఞానమయమును – జ్ఞేయమ్ము—జ్ఞానగమ్య—
మఖిల భూతైక హృదయస్థ మదియె తుదకు. 17

పార్థ! యివ్విధి † క్షేత్ర సంబంధ మైన
విషయము౯ గూర్చి – ‡ జ్ఞానైక విధిని గూర్చి –
జ్ఞేయుఁ గూర్చి నుడివితి సంక్షిప్తరీతి
భక్తుఁ డరసిన దీని–మద్భావ మందు. 18

---

* సూర్యకిరణముల లోని నీరు మిక్కిలి కొలఁదిగా నున్న కారణమున నేరికిని గనరాని యటులఁ బరమాత్మ సూక్ష్మరూపి యగుటచే సాధారణ మనుష్యులకుఁ గనరానివాఁడని భావము.

♦ శ్రద్ధారహితులగు నజ్ఞానులకు దూరస్థుఁడగు చున్నాఁడు.

§ పరమాత్మ సర్వత్ర నిండియుండిన కారణమున సర్వాత్మయై యత్యంత సమీపమున నున్నట్లు గాన వచ్చు చున్నాఁడు.

† పదమూడవ యధ్యాయమున 5–6 శ్లోకములచే వికారసహిత క్షేత్రస్వరూప మభివర్ణింపఁ బడినది.

‡ 7 నుండి 11 వ శ్లోకమువరకు జ్ఞానమునుగూర్చి చెప్పఁ బడినది.

ప్రకృతిం పురుషం చైవ
విద్ధ్యనాదీ ఉభా వపి,
వికారాన్ శ్చ గుణాన్ శ్చైవ
విద్ధి ప్రకృతిసంభవాన్. 19

కార్యకరణ కర్తృత్వే
హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుష స్సుఖదుఃఖానాం
భోక్తృత్వే హేతు రుచ్యతే. 20

పురుషః ప్రకృతిస్థో హి
భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణ సంగోఽస్య
సదసద్యోని జన్మసు. 21

ఉపద్రష్టానుమన్తా చ
భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చా ప్యుక్తో
దేహేఽస్మిన్ పురుషః పరః. 22

* ప్రకృతి పురుషులు నిర్వు రీశ్వరుని ప్రకృతు
లగుటచే నాదిశూన్యు లం చరసి కొనుము
ద్వేషరాగాది వికృతులుఁ, ద్రిగుణములును
వరలె - వారిర్వు రం దున్న - ప్రకృతి వలన. 19

♦ కార్యకరణ కర్తృత్వ సంగతికిఁ బ్రకృతి—
హేతు వని పండితులు వచియించి - నట్లె
సుఖము దుఃఖమ్ము ననుభవించుటకుఁ గూడఁ
బురుషుఁ డింతకు హేతువై పొదలెఁ గాదె! 20

ప్రకృతి గతుఁ డౌటఁ బురుషుండు ప్రకృతిజన్య
గుణమయపదార్థ వితతిఁ దా ననుభవించు;
దాన—గుణ సంగతి - సదసద్యోనుల-జన
నము వడయు దేహి, కాలచక్రమునఁ దవిలి. 21

దేహగతుఁ డయ్యుఁ బురుషుఁ డతీతుఁ డగుట
దైవముగ - భర్తగా - నుపద్రష్టగాఁగ -
సమ్మతి యొసంగు వాఁడుగా-సర్వదేవ
వరుఁడుగా - భోక్తగా నెంచఁ బడును గాదె! 22

---

* 12-నుండి 17 వ శ్లోకమువఱకు జ్ఞేయుని గూర్చి నుడువఁ బడినది.

♦ ఆకాశము-వాయువు - అగ్ని-జలము-పృథ్వి-శబ్దము - స్పర్శము - రూపము - రసము - గంధము వీనికి గార్యములని పేరు. బుద్ధి-అహంకారము - మనము - శ్రోత్రము - త్వక్కు - రసనము - నేత్రము-ఘ్రాణము - వాక్కు - హస్తము - పాదము - ఉపస్థ - గుదము. వీనికి కరణము లని (సాధనములు) పేరు.

మొత్తముమీద నివియన్నియును వికారము లగు చున్నవి.

య ఏవం వేత్తి పురుషం
ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి
న స భూయోఽభిజాయతే. 23

ధ్యానే నాత్మని పశ్యన్తి
కేచి దాత్మాన మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన
కర్మయోగేన చాపరే. 24

అన్యేత్వేవ మజానన్తః
శ్రుత్వాన్యేభ్య ఉపాసతే.
తేఽపి చాతితర న్త్యేవ
మృత్యుం శ్రుతి పరాయణాః. 25

యావ త్సంజాయతే కించి
త్సత్త్వం స్థావరజంగమం,
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా
త్తద్విద్ధి భరతర్షభ. 26

సమం సర్వేషు భూతేషు
తిష్ఠంతం పరమేశ్వరం,
వినశ్య త్స్వవినశ్యన్తం
యః పశ్యతి స పశ్యతి. 27

జ్ఞేయుఁ డగు నిట్టిపురుషుని శీల మరసి
కొనుచు–సత్వరజ స్తమోగుణ విశిష్ట
మైన ప్రకృతి చరిత్ర మాధ్యాత్మికముగ
నెఱుఁగువాఁ డెట్టిఁ డైన - లేదింక జన్మ. 23

ధ్యానయోగమ్ముచేఁ బరమాత్మ సూక్ష్మ
బుద్ధి – హృదిఁ గాంత్రు కొంద – అపూర్వఫణితి–
నింకొక ఱు జ్ఞానయోగా ప్తి నెఱిఁగికొంద్రు–
వేఱొకరు కర్మయోగైక విధిని గంద్రు. 24

జడులు కొందఱు భక్తి – నజ్ఞాను లయ్యుఁ;
దత్వవేత్తల కడఁ బర తత్వ మెఱిఁగి
శ్రుతిపరాయణు లౌట సంస్తుతుల నన్నుఁ
దనుపుచు భజించి మృత్యువార్ధిని దరింత్రు. 25

జంగమస్థావరాత్మక జగము లోన
నే పదార్థమ్ము పొడసూపె నేని దాని
బ్రకృతి పురుషుల సంయోగ భాగ్యవశతఁ
బొడలు దానినిగా తలపోయు మనఘ! 26

నశ్వరం బగు భూత సంతాన మందు
నాశనము లేక చరియించు నవ్యయాత్మఁ
డైన పరమాత్మఁ, డెల్లర యాత్మ సమతఁ
దోఁచి మను నని కనువాఁడె చూచువాఁడు. 27

సమం పశ్యన్ హి సర్వత్ర
సమవస్థిత మీశ్వరం,
న హినస్త్యాత్మ నాత్మానం
తతో యాతి పరాం గతిం. 28

ప్రకృత్యైవ చ కర్మాణి
క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాత్మాన
మకర్తారం స పశ్యతి. 29

యదా భూతా పృథగ్భావ
మేకస్థ మనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం
బ్రహ్మసంపద్యతే తదా. 30

అనాదిత్వా న్నిర్గుణత్వా
త్పరమాత్మాయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌన్తేయ
న కరోతి న లిప్యతే. 31

యథా సర్వగతం సౌక్ష్మ్యా
దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే
తథాత్మా నో పలిప్యతే. 32

దేహము నశించి పోయినన్ దేహి కెందుఁ
జావు లేదంచు—నెల్లరన్ సమతఁ జెలఁగు
నీశు సమదృష్టిఁ గను జనుం డెపుడు దాను
బాలు పడ కెట్టి హింసకుఁ బడయు ముక్తి. 28

ప్రకృతియా యోగమాయ సర్వప్రకార
ముల స్వశక్తి నొనర్చు సంపూర్ణ కర్మ
లరసి – జీవాత్మఁ గర్తగా నరయ నట్టి
వాఁడె పో తత్వ మరసిన వాఁడు క్రీడి! 29

బహుముఖస్థితభూత భావంబు లొకట
వరలి – పరమాత్మ సంకల్ప వశత నటుల
తిరిగి వ్యాపించు నని యెవ్వఁ డరయు నెప్పు—
డప్పుడే బ్రహ్మ సంపత్తి నందు నతఁడు. 30

ఆది రహితుండు నిర్గుణుం డగుటకతన
నవ్యయుఁడు పరమాత్మ దేహస్థుఁ డయ్యు;
గర్తృతైకాభి మానమ్ము గాంచకున్కిఁ
గర్మఫల లంపటుండ యి క్రాలకుండు. 31

వ్యోమ, మెల్లెడ వ్యాపించి యుండి కూడ
సూక్ష్మ గతి నుంట దేనితో జోక్య మంద
కలరి నట్టుల–జీవాత్మ యఖిలభూత
దేహగతుఁ డయ్యుఁ దద్గుణస్థితిని మనఁడు. 32

యథా ప్రకాశ యత్యేకః
కృత్స్నం లోక మిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం
ప్రకాశయతి భారత. 33

క్షేత్రక్షేత్రజ్ఞ యోరేవ
మన్తరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతి మోక్షంచ
యే విదుర్యాన్తి తే పరం. 34

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగోనామ
త్రయోదశోఽధ్యాయః.



భానుఁ డొకఁడయ్యు; బ్రహ్మాండ భాండ మెల్ల
నిండి వెలుఁగొంది నట్లు కౌంతేయ! పురుషుఁ
డైన జీవాత్మ, యోగమాయా స్వరూప
మైన ప్రకృతిని వెలయించు నాత్మశక్తి. 33

సుజనుఁ డింతకు జ్ఞానచక్షుస్సుచేతఁ
బ్రకృతి పురుషుల భేదమ్ము, ప్రజ్ఞనెఱిఁగి–
దాన – భూత ప్రకృతినుండి తప్పుకొనెడు
యుక్తి సాధించు నేని సాయుజ్య మందు. 34

ఇది శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యయనంబడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీ కృష్ణార్జున
సంవాదమున క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగ మను
పదమూఁడవ అధ్యాయము.



శ్రీమత్పరమాత్మనే నమః

# గీతా సప్తశతి

---

## అథ చతుర్దశోఽధ్యాయః - గుణత్రయ విభాగయోగః.

శ్రీభగవానువాచ :—

పరం భూయః ప్రవక్ష్యామి
జ్ఞానానాం జ్ఞాన ముత్తమం,
యత్ జ్ఞాత్వా మునయ స్సర్వే
పదాం సిద్ధి మితో గతాః. 1

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య
మమసాధర్మ్య మాగతాః,
సర్గేఽపి నోపజాయన్తే
ప్రలయే న వ్యథన్తి చ. 2

మమ యోని ర్మహద్బ్రహ్మ
తస్మి న్గర్భం దదా మ్యహం,
సంభవ స్సర్వభూతానాం
తతో భవతి భారత. 3

సర్వయోనిషు కౌన్తేయ
మూర్తయ స్సంభవన్తి యాః,
తాసాం బ్రహ్మమహ ద్యోని
రహం బీజప్రదః పితా. 4

శ్రీమత్పరదేవతాయైనమః.

# గీతా సప్తశతి

## పదునాల్గవ అధ్యాయము - గుణత్రయవిభాగ యోగము

—:o:—

దేని కతన మునీశ్వరుల్ దివ్యపదము
నంది భవ వార్ధి దాటి యానంద మొందఁ
గలిగిరో ; యట్టి జ్ఞానైక నిలయ మైన
జ్ఞాన ముపదేశ మొనరింతు నేన మగిడి. 1

అనఘ ! నేఁదెల్పు నీ జ్ఞాన మాశ్రయించి
జనులు, సాధర్మ్యమంది నన్ననుసరించి
వాసుదేవుండు తమకు సర్వస్వ మగుటఁ
బుట్టి సృష్ట్యాది—లయమునఁ గిట్ట రెపుడు. 2

త్రిగుణమయి యైన ప్రకృతి నాదేవి యగుట
గర్భధారణ విధిని సఖ్యం బొనర్చి
బీజనిక్షేప మొనరింతుఁ—బిదప భూత
వితతి, జడచేతనైక సంగతిఁ జనించు. 3

నరవరోత్తమ ! వినుము నానా ప్రకార
యోనిసంభూతభూత సంతానమునకుఁ
దల్లియై యొప్పెఁ బ్రకృతి, తద్ధారణమునఁ—
దండ్రి నే నౌదుఁ బీజప్రదాత నగుట. 4

సత్వం రజ స్తమ ఇతిగుణాః
ప్రకృతి సంభవాః,
నిబధ్నంతి మహాబాహో
దేహే దేహిన మవ్యయం. 5

తత్ర సత్వం నిర్మలత్వా
త్ప్రకాశక మనామయం,
సుఖసంగేన బధ్నన్తి
జ్ఞాన సంగేన చానఘ. 6

రజో రాగాత్మకం విద్ధి
తృష్ణాసంగ సముద్భవం,
తన్నిబధ్నన్తి కౌన్తేయ
కర్మసంగేన దేహినం. 7

తమ స్త్వజ్ఞానజం విద్ధి
మోహనం సర్వదేహినాం,
ప్రమాదాలస్య నిద్రాభి
స్తన్నిబధ్నాతి భారత. 8

సత్వం సుఖే సంజయతి
రజః కర్మణి భారత,
జ్ఞాన మావృత్య తు తమః
ప్రమాదే సంజయత్యుత. 9

రజ స్తమ శ్చాభి భూయ
సత్వం భవతి భారత,

అవ్యయుం డగు దేహి, దేహస్థుఁ డగుచుఁ
దనర-సత్త్వరజస్తమోగుణము లనఁగ
బరఁగు నీమూఁడుఁ, బ్రకృతి సంభవము లగుటఁ
బొంచి లోఁ గొను మేన బంధించి యతని. 5

పార్థ! అమ్మూఁటి లోని సత్త్వమ్ము, నిర్వి
కారమయి - నిర్మలంబయి-కడుప్రకాశ
వంతమై యుంట-జీవాత్మ బద్ధుఁ జేసి
లోఁగొనుఁ సౌఖ్య విజ్ఞానలోలవశత. 6

రాగ సంబంధ మైన రజోగుణమ్ము
కామనాసంగజనితమై క్రాలుకతన
మేర మీరి జీవాత్మను మిట్టిపడుచుఁ
గర్మ సంగప్రసక్తిచేఁ గట్టివైచు. 7

అనఘ! దేహాభిమానులౌ జనుల కెల్ల
మోహ ముదయింపఁ జేయు తమోగుణమ్ము-
జీవు - నజ్ఞానభవ మౌట నావరించుఁ
గాదె యాలస్య నిద్రా ప్రమాద విధుల. 8

సౌఖ్య మేవేళఁ గలిగించు సత్త్వగుణము-
జొనుపు మదిఁ గర్మలందు రజోగుణమ్ము-
మానవుఁ బ్రమాదమున డించి జ్ఞాన మెల్ల
బుగ్గి పాల్జేసి కూల్చుఁ దమోగుణమ్ము. 9

సత్త్వము, రజస్తమమ్ముల సరకు గొనని
యటు - రజస్సత్త్వముల రెంటి నడఁచుఁ దమము-

రజ స్సత్వం తమశ్చైవ
తమ స్సత్వం రజ స్తథా 10

సర్వద్వారేషు దేహేఽస్మిన్
ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా
ద్వివృద్ధం సత్వ మిత్యుత. 11

లోభః ప్రవృత్తి రారంభః
కర్మణా మశమ స్స్పృహా,
రజ స్యేతాని జాయన్తే
వివృద్ధే భరతర్షభ. 12

అప్రకాశో ఽప్రవృత్తి శ్చ
ప్రమాదో మోహ ఏవ చ,
తమ స్యేతాని జాయన్తే
వివృద్ధే కురునన్దన. 13

యదా సత్వే ప్రవృద్ధే తు
ప్రలయం యాతి దేహాభృత్,
తదోత్తమ విదాం లోకా
నమలాన్ ప్రతిపద్యతే. 14

రజసి ప్రలయం గత్వా
కర్మసంగిషు జాయతే
తథా ప్రలీన స్తమసి
మూఢయోనిషు జాయతే. 15

బలిమి నక్లే తమస్సత్త్వములను నెట్టి
సాగి ముందంజవేయు రజోగుణమ్ము. 10

పార్థ! ఇమ్మేని యందు గన్పట్టుచున్న
ద్వారముల నెల్లఁ జేతనత్వమ్ము దవిలి
జ్ఞాన ముదయించు నప్పుడే సత్త్వగుణము,
నకు బలం బొప్పు నని యన్కొనంగవలయు. 11

ఇద్ధచరిత! రజోగుణవృద్ధి యందు
విషయభోగైక వాంఛయు; విగతశమము;
నఖిల కర్మ సమారంభ; మధికలోభ
మును; బ్రవృత్తియుఁ గల్గుచుండును నిజమ్ము. 12

అప్రకాశమ్ము గలిగి—మోహప్రవృత్తి
వ్యర్థచేష్టలఁ దవిలి—చేయంగఁ దగిన
చేఁతల—మనమ్ము వర్తింపఁ జేయ నీక
వరలుట తమోగుణప్రభావమ్ము సుమ్ము. 13

సత్త్వగుణ వృద్ధి దనరిన సమయ మందు
మృత్యుగతుఁ డైన దేహి, యుత్కృష్ట కర్మ
నిరతులగు వారి కిర వౌచు నెగడు నట్టి
దివ్యలోకస్థితిప్రాప్తిఁ దేజరిల్లు. 14

విజయ! వినుము రజోగుణ వృద్ధవేళ
మరణ మందిన జీవి; కర్మ ప్రధాన
మనుజులన్ బుట్టు – నటులె తమః ప్రవృద్ధిఁ—
జెలఁగుఁ బశుకీటకాది యోనుల జనించి. 15

కర్మణ స్సుకృతస్యాహు
సాత్త్వికం నిర్మలం ఫలం,
రజస స్తు ఫలం దుఃఖ
మజ్ఞానం తమసః ఫలం. 16

సత్త్వా త్సంజాయతే జ్ఞానం
రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో
భవతోఽజ్ఞాన మేవ చ. 17

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా
మధ్యే తిష్ఠన్తి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా
అధోగచ్ఛన్తి తామసాః. 18

నాన్యం గుణేభ్యః కర్తారం
యదా ద్రష్టాను పశ్యతి,
గుణేభ్య శ్చ పరం వేత్తి
మద్భావం సోఽధిగచ్ఛతి. 19

గుణా నేతా నతీత్య త్రీన్
దేహీ దేహ సముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై
ర్విముక్తోఽమృత మశ్నుతే. 20

జ్ఞానవైరాగ్య సుఖములు సత్వజనిత
నిర్మల ఫలంబు లని జ్ఞాన నిధులు పలికి—
యవల – దుఃఖావివేక దాయకము లంచు
బలికిరి రజస్తమోగుణంబులను గుఱించి. 16

సత్వమున నుండి జ్ఞానమ్ము సంఘటిల్లుఁ;
దనరుఁ గాదె లోభమ్ము రజోగుణము నుండి;
మోహముఁ, బ్రమాద, మవివేకమును గ్రమముగ
జననముఁ బొందుఁగా తమోగుణము కతన. 17

సత్వగుణ సంశ్రయుల్ గాంత్రు స్వర్గసుఖము—
రాజసులు మర్త్యలోకపరాయణులయి
ధరఁ జరింత్రు – తమోగుణ ధర్మ నిరతు—
లనఘ! జన్మింత్రు పశుకీటకాదు లందు. 18

గుణము – లెల్లయవస్థలఁ దనరు చుంటఁ –
గర్మ లన్నింటి కవ్వియే కర్త లయ్యె
ననుచుఁ దద్గుణాతీతుఁగాఁ దన నెఱుఁగు
ద్రష్ట, మద్భావ మంద నర్హత వహించు. 19

స్థూలదేహైక జననహేతు స్వరూప
ములగు నీమూఁడు గుణములఁ బో విదల్చి
జన్మమృత్యు జరాది సంజనిత దుఃఖ
ముక్తుఁడై దేహి, యానందముఁ భజించు. 20

అర్జున ఉవాచ :

కైర్లింగై స్త్రీన్గుణా
నేతా నతీతో భవతి ప్రభో,
కి మాచారః కథం చైతాన్
స్త్రీన్గుణా నతివర్తతే. 21

శ్రీభగవానువాచ :

ప్రకాశం చ ప్రవృత్తిం చ
మోహ మేవ చ పాణ్డవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని
న నివృత్తాని కాంక్షతి. 22

ఉదాసీనవదాసీనో
గుణైర్యో న విచాల్యతే,
గుణావర్తన్త ఇత్యేవ
యోఽవ తిష్ఠతి నేంగతే. 23

సమదుఃఖసుఖస్స్వస్థః
సమలోష్టాశ్మకాంచనః,
తుల్యప్రియాప్రియో ధీర
స్తుల్య నిన్దాత్మ సంస్తుతిః. 24

మానావమాన యో స్తుల్య
స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ
గుణాతీత స్స ఉచ్యతే. 25

విజయుఁ, డివ్విధి విని పల్కె వెన్నునరసి
దేవ! నీవన్న యాగుణాతీతుఁ డెట్టి
చిన్నెలు గలాఁడు – మఱివాని శీల మెట్టి
దగు – నతఁడు గుణాతీతుఁ డయ్యె నెట్లు?   21

అనవుడు వచించె హరి, పార్థు నరసి యిట్టు
లనఘ! సత్వర జస్తమోగుణ జనితము
లగు ప్రకాశ ప్రవృత్తి మోహముల నెవఁడు
వైర మూని – నివృత్తిఁ – గావలయుననఁడో.   22

గుణము లొండొరు వర్తించు నని తలంచి
యవిచలుం డౌచుఁ జరియించు చన్నివిధుల
సాక్షిభంగిఁ దటస్థుఁడై సాత్వికాది
గుణములకు లొంగ కెవ్వాఁడు మనఁగలండో.   23

స్వస్థుఁ డై; సమలోష్టాశ్మ జాతరూపుఁ
డగుచుఁ; దుల్య ప్రియాప్రియుం డై; సమాన
కష్టసుఖుఁ డయి; ధీరతఁ గ్రాలి సమత
నెవఁడు నిందాస్తుతుల భరియింపఁ గలఁడో   24

శత్రుమిత్రుల యెడలఁ దా సమత నెఱపి;
తుల్యమానాపమానుఁ డై; తొడరి దేహ
ధారణకు వలను పడని నిస్సారకర్మ
లుడుగు–నతఁడె– గుణాతీతుఁ డుర్విఁ బార్థ!   25

మాం చ యోఽవ్యభి చారేణ
భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్
బ్రహ్మభూయాయ కల్పతే. 26

బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ
మమృత స్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య
సుఖస్యైకాన్తి కస్య చ. 27

ఓమ్ తత్స దితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
గుణత్రయ విభాగో నామ
చతుర్దశోఽధ్యాయః.

* * *

* స్వాభిమానమ్ముఁ దొఱఁగి నిస్స్వార్థ భక్తి
నన్నుఁ గొల్చెడి జ్ఞానసంపన్నుఁ డీయ
నంతగుణ శక్తికి నతీతుఁ డగుచు నెగడి
బ్రహ్మసాయుజ్యపదవి కర్హత వహించు. 26

అమృతమునకును—మఱియు నిత్యమ్మునకును—
సౌఖ్యమునకు—నఖండ రసమ్మునకును—
నమల ధర్మమ్మునకు—నవ్యయమమ్మునకును
నాశ్రయుఁడ నౌదు నేఁ బరమాత్మనగుట

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్య యనం బడు యోగ
శాస్త్ర మందలి శ్రీ మద్భగవద్గీత యందు శ్రీకృష్ణార్జున
సంవాదమున గుణత్రయవిభాగ మను పదు
నాల్గవ అధ్యాయము

---

* ఈ భక్తి కవ్యభిచారిణి భక్తి యని పేరు. అనగా భగవంతునిదవ ప్రభువుగాఁదలఁచి స్వార్థాభిమానములను వీడి శ్రద్ధతో ప్రేమ పూర్వకముగా నిరంతరము చింతనచేయు భక్తి కవ్యభిచారిణి భక్తియని పెద్దలు పేరిడిరి.

## అథ పంచదశోఽధ్యాయః - పురుషోత్తమయోగః

శ్రీభగవానువాచ :

ఊర్ధ్వమూల మధశ్శాఖ
మశ్వత్థం ప్రాహు రవ్యయం,
ఛందాంసి యస్య పర్ణాని
య స్తం వేద స వేదవిత్. 1



సంసారాశ్వత్థ వృక్షము

# గీతాసప్తశతి

## పదునైదవ అధ్యాయము - పురుషోత్తమయోగము

---

* ఆగమవిదేకవేద్య ; మవ్యయము ; నిగమ
పర్ణవిలసిత మహా భవాశ్వత్థమహిత
పాదపమ్మునకుఁ ◆ బరబ్రహ్మ మూర్ధ్వ
మూల మగుట † శాఖాకృతిఁ గాలె బ్రహ్మ

---

* పై పద్యము వ్యాఖ్యానానుసారము - ఇది మూలానుసారము:—
అవ్యయం బయి - పైకి వేళ్ళమరి - క్రింది
భాగమున వ్రేలు కొమ్మలఁ బరగు వేద
పర్ణకలిత భవాశ్వత్థ పాదపమ్ము
విషయ మెఱుఁగు నతండె పో వేదవిదుఁడు.

◆ పరబ్రహ్మమే ఆదిభగవానుఁడగు నారాయణుఁడు. మాయాతీతుఁ డగుట నితఁడు మాయాపతియు; నత్యున్నత స్థాన నివాసియగుట వైకుంఠపతియు నగుచున్నాఁడు. వైకుంఠ మనఁగా పరంధామము. లోకములకన్నిటి కిది అగ్రస్థానము వహించినది. కనుక నే పరబ్రహ్మ స్వరూపుఁడగు నారాయణుఁ డీ సంసార రూపాశ్వత్థ వృక్షమున కూర్ధ్వమూలుఁ డైనాఁడు.

ఈ వృక్షము నేటి ప్రపంచములో మనము చూచుచున్న వృక్షము వంటిది గాదు. ఇది తలక్రిందై ప్రత్యేకవిశిష్టత గడించికొనిన యొకానొక విచిత్రవృక్షము, కనుక నే దీనికి వేళ్ళుపైకి ఉండును. కొమ్మలు క్రిందికి వ్రేలాడుచుండును. దీనంజేసి పరబ్రహ్మకంటెఁ దక్కువవాఁడగు బ్రహ్మ, శాఖా స్వరూపుఁడై అధోలోక మగు సత్యలోక నివాసి యయ్యెను.

† వృక్షశాఖా స్వరూపుఁడగు బ్రహ్మ యజ్ఞరక్షకుఁడు. యజ్ఞము వేదసంరక్షితము. కనుక నే వేదము లీ వృక్షమునకుఁ బర్ణములైనవి. వేదము లవ్యయము లగుటం జేసి సంసార రూపాశ్వత్థ వృక్షముఁగూడ నవ్యయ దీని తత్త్వ మెఱింగిన విజ్ఞులు వేదవిదు లగుచున్నారు.

అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాలాః,
అధ శ్చ మూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్య లోకే. 2

న రూప మస్యేహ తథోపలభ్యతే
నా న్తో న చాది ర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తన్తి భూయః,
త మేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4

నిర్మాన మోహాజిత సంగదోషా
అధ్యాత్మ నిత్యా వినివృత్తకామాః,
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞైః
గచ్ఛన్త్య మూఢాః పద మవ్యయం తత్.

న తద్భాసయతే సూర్యో
న శశాంకో న పావకః,

త్రిగుణ జలవృద్ధి – విషయముల్ జిగురు లమర
* నెగడెఁ దచ్ఛాఖ లెదిగి క్రిందికిని బైకి –
♦ నలరి కర్మానుబంధమ్ములగుచు వేళ్లు †
ప్రాకె సర్వత్ర మానవ లోక మందు. 2
‡ తత్త్వ విజ్ఞాన మొదవిన తఱి వచింపఁ
బడినగతిఁ దుదిమొద లగుపడక యుండి;
బాగుగా నాటఁబడని యశ్వత్థనామ
తరువు వైరాగ్యరూప శస్త్రమునఁ దునిమి 3
పిదపఁ – ప్రాచీన సంసార వృక్షవృత్తి
విస్తృతి నొనర్చి నట్టి యవ్విశ్వమయుఁడు
నాకు దిక్కని – చనిన మానవులు మఱలి
రాని సద్గతి చర్చుకుఁ బూన వలయు. 4
సంగదోషైక రహితులై జ్ఞాను–లవలఁ
దవులు సుఖదుఃఖరూపద్వంద్వములు వీడి –
మానమోహమ్ములుడిగి – కామము జయించి –
అవ్యయపదమ్ముఁగాంతు రధ్యాత్మ నిరతి. 5
మనుజు లెద్దాని భజియించి మఱలి రాక
స్వస్థులై యుందు; రదియె మత్పరమధామ

---

* శాఖలు = దేవమానవ తిర్యగ్రూపజాతులు.

♦ కర్మాను బంధము = కర్మాను సారముగ.

† మూలములు :—మమతాహంభావాది విషయ వాసనారూపము లగు వేళ్లు.

‡ కలఁగాంచి నిదురనుండి లేచిన వానికి స్వప్నగత దృశ్యముల దృశ్యములై నట్లు – తత్త్వ జ్ఞానోదయానంతరమున జ్ఞానికి వృక్షస్వరూపమై గానరాదని భావార్థము.

య ద్గత్వా న నివ ర్త న్తే
త ద్ధామ పరమం మమ. 6

మమైవాంశో జీవలోకే
జీవభూత స్సనాతనః,
మన ష్షష్ఠానీ న్ద్రియాణి
ప్రకృతిస్థాని కర్ష తి. 7

శరీరం య దవాప్నోతి
యచ్చా ప్యుత్క్రా మ తీశ్వరః,
గృహీ త్వైతాని సంయాతి
వాయు ర్గంధా ని వాశయాత్. 8

శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ
రసనం ఘ్రాణ మేవ చ,
అధిష్ఠాయ మనశ్చాయం
విషయా నుపసేవతే. 9

ఉత్క్రామం తం స్థితం వాపి
భుంజానం వా గుణాన్వితం,
విమూఢా నాను పశ్య న్తి
పశ్య న్తి జ్ఞాన చక్షుషః. 10

యతం తో యోగిన శ్చైనం
పశ్య న్త్యాత్మ న్యవస్థితం.

మని తలంపుము - దాని నయ్యనశశాంక
చిత్రభానులు భాసింపఁ జేయ లేరు. 6

అఖిల భూతశరీరస్థుఁ డై తనర్చు
దేహిని మదంశమాత్రుఁగాఁ దెలిసి కొమ్ము
ప్రకృతిగత మైన యింద్రియపంచకమును
మనసుతోఁ బాటు నతఁడు లోఁగొను సతమ్ము. 7

అలరు నెత్తావిఁ గొని వాయు వరిగి నట్లు
తరలి పోవుచు జీవాత్మ-తనువు నుండి
యింద్రియము లైదుతో నంతరింద్రియమును
గొనుచు రెండవ మెయిఁ జేర్పఁ జనెడుఁ గాదె. 8

త్వక్కు-, చక్షుస్సు, జిహ్వ, శ్రోత్రమ్ము-ఘ్రాణ
మాదిగాఁగల యైదింద్రియముల - మనముఁ
జేర్చి జతఁ గూర్చి స్పర్శాది విషయసుఖము
లనుభవించెడు దేహి, దేహస్థుఁ డగుచు. 9

మేనఁ జెలఁగెడు వారును - మేని నుండి
పోవువారును - విషయైక భోగరతులు
§ గుణయుతులు నైన జీవుల గుణము-లజ్ఞు
లరయఁ గాలేరు - జ్ఞానులే యరసి కొంద్రు. 10

హృదయగతుఁ డైన జీవాత్మకృత్యములను
యతన మొనరించి కనుగొందు రఖిలమునులు -

§ గుణయుతులు = సత్వరజస్తమోగుణములతోఁ గూడినవారు.

యతన్తో ప్య కృతాత్మానో
నైనం పశ్య న్త్యచేతసః. 11

య దాదిత్య గతం తేజో
జగద్భాస యతేఽఖిలం,
య చ్చాంద్ర మసి య చ్చాగ్నౌ
త త్తేజో విద్ధి మామకమ్. 12

గా మావిశ్య చ భూతాని
ధారయా మ్యహ మోజసా,
పుష్ణామి చౌషధీ స్సర్వాః
సోమో భూత్వా రసాత్మకః. 13

అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినాం దేహ మాశ్రితః,
ప్రాణాపాన సమా యుక్తః
పచామ్య న్నం చతుర్విధమ్. 14

సర్వస్య చాహం హృదిసన్నివిష్టో
మత్త స్స్మృతిర్ జ్ఞాన మపోహనం చ,
వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాన్త కృ ద్వేద విదేవ చాహమ్. 15

యతన మొనరించియును - నకృతాత్ము లజ్ఞు
లరయఁ జాలరు దేహికృత్యంబు లెపుడు. 11

రవిగతం బౌచు నెద్ది సర్వప్రపంచ
మున వెలింగెడు – నేది చంద్రుని ప్రకాశ-
మగ్ని యందున్న తేజ మెయ్యదియొ – యట్టి
దీప్తినికరమ్ము నాదిగాఁ దెలిసి కొమ్ము. 12

లీల నీభూతధాత్రి విలీనుఁ డనయి
జీవకోటిని నిజశక్తి చే భరింతు,
నమృతమయుఁ డైన శశిరూప మాశ్రయించి
జగముఁ బోషించి కొందు నోషధు లొసంగి. 13

అనఘ! వైశ్వానరుండ నే నగుచు నెల్ల
జీవకోటుల మేనులఁ జెలఁగు చెపుడు
ప్రాణయుక్తి నపాన సంశ్రయత నొప్పి
* నలు తెఱంగుల భుక్తి జీర్ణం బొనర్తు. 14

నిగమగమ్యుండ; భూతహృన్నిలయగతుఁడ;
♦ స్మృత్యపోహన విజ్ఞాన సృష్టికర్త
నగుదు; నిదిగాక వేదపారగుఁ డ నౌట
ననఘ! వేదాంత కర్త నై యలరు చుందు. 15

---

* భక్ష్య (నమలఁ దగిన అన్నము,రొట్టె మొ॥) భోజ్య (మ్రింగఁ దగిన పాలు మొ॥) చోష్య (పీల్చఁ దగినవి చెఱకు రసము మొ॥) లేహ్య (చప్పరింపఁ దగిన పచ్చడి మొ॥) ములు. ఇవి చతుర్విధములు.

♦ తత్త్వ విచారముచే బుద్ధి లోనుండు సంశయ విపర్యాదిదోషము లను దొలఁగించుటకే అపోహన మని పెద్దల వ్యవహారము.

ద్వా విమౌ పురుషౌ లోకే
క్షర శ్చాక్షర ఏవ చ,
క్షర స్సర్వాణి భూతాని
కూటస్థోఽ క్షర ఉచ్యతే. 16

ఉత్తమః పురుష స్త్వన్యః
పరమా త్మే త్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య
బి భర్త్యవ్యయ ఈశ్వరః. 17

యస్మాత్ క్షర మతీతోఽహ
మక్షరా దపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ
ప్రథితః పురుషోత్తమః. 18

యో మా మేవ మసంమూఢో
జానాతి పురుషోత్తమం,
స సర్వవిద్భజతి మాం
సర్వభావేన భారత. 19

ఇతి గుహ్య తమం శాస్త్ర
మిద ముక్తం మయానఘ,
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా
త్కృతకృత్య శ్చ భారత. 20

ఓమ్ తత్స దితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
పురుషోత్తమయోగోనామ
పంచదశోఽధ్యాయః.

---

కలరు లోకాన క్షరుఁడు - నక్షరుఁడు ననెడు
పురుషు లిర్వురు - వారిలో క్షరుఁ డుసర్వ
భూత దేహస్వరూపుఁ డై పొదలుఁ; గడమ
యతఁడు కూట స్థుఁ డగు దేహి యై చెలంగు. 16
అవ్యయుం, డీశ్వరుఁడు బరమాత్మ యనఁగ
నొప్పి - యిర్వురఁ గడమవాఁ డుత్తముఁ డయి
ముజ్జగంబుల వారిని బోషణాది
విధుల రక్షింపఁ దా జగద్విదితుఁ డయ్యె. 17
అనఘ! క్షరున కతీతుండ నగుట కాక
కడకు నక్షరుఁడౌ దేహికంటెఁ గూడ
నుత్తముఁ డ నౌట నట్ట బురుషోత్తమాఖ్య
శ్రుతులు నుతిసల్పె - జగతి తద్గతి భజింప. 18
నన్నుఁ బురుషోత్తమునిగఁ దా నెన్నుకొనుచుఁ
దత్త్వ ఫణితి నెఱింగిన తత్త్వవేత్త-
వాసుదేవుండు నాకు సర్వస్వ మనెడు
భావమున భజించు ననన్యభక్తి యుక్తి. 19
అతిరహస్యమయం బౌట ననఘ! నీకు
బోధఁ జేసిన యీ శాస్త్రమును సభక్తి
నెవ్వఁ డైనఁ దత్త్వ విధి గ్రహించె నేని-
నతఁడు కృత కృత్యుఁ డై జ్ఞాని యౌచు వరలు. 20

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషత్సు బ్రహ్మవిద్యాయనంబడు యోగ
శాస్త్ర మందలి శ్రీ మద్భగవద్గీతయందు శ్రీకృష్ణార్జున
సంవాదమునఁ పురుషోత్తమ యోగ మను
పదునైదవ యధ్యాయము.

---

శ్రీమత్పరదేవతాయై నమః

# గీతా సప్తశతి

## అథ షోడశోఽధ్యాయః - దైవాసురసంపద్విభాగ యోగః

---

శ్రీభగవానువాచ :

అభయం సత్త్వ సంశుద్ధిర్
జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమ శ్చ యజ్ఞ శ్చ
స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

శ్రీమత్పరదేవతాయైనమః.

# గీతాసప్తశతి

## పదునాఱవ అధ్యాయము - దైవాసుర సంపద్విభాగయోగము

---

అనఘ! [1]స్వాధ్యాయ[2]దా [3]నా భ [4]యార్జవములు;
[5]జ్ఞాన యోగవ్యవస్థితి; [6]సత్వశుద్ధి
యును; [7]దమమ్ము; స్వధర్మపాలముకొఱకు
శ్రమవహించుట; యజ్ఞమ్ము సలుపుటయును 1

---

1. స్వాధ్యాయము - వేదశాస్త్ర పఠన పూర్వకభగవన్నామ కీర్తనము.

2. సాత్వికదానము.

3. అభయము=సర్వత్ర భయము విడుచుట.

4. ఆర్జవము = ఇంద్రియముల యొక్కయు, మనస్సు యొక్కయు, శరీరము యొక్కయు సరలత్వము.

5. జ్ఞానయోగ వ్యవస్థితి = తత్వజ్ఞానమునకై కావించు నిరంతర దృఢస్థితి.

6. సత్వశుద్ధి = అంతః కరణము యొక్క స్వచ్ఛత్వము.

7. దమము = ఇంద్రియనిగ్రహము.

అహింసా సత్య మక్రోధ
స్త్యాగ శ్శాన్తి రపైశునం,
దయా భూతేష్వ లోలుప్త్వం
మార్దవం హ్రీ రచాపలమ్. 2

తేజః క్షమా ధృతిః శౌచ
మద్రోహో నాతిమానితా,
భవన్తి సంపదం దైవీ
మభిజాతస్య భారత. 3

దంభో దర్పోఽభి మాన శ్చ
క్రోధో పారుష్య మేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య
పార్థ సంపద మాసురీం. 4

దైవీ సంపద్విమోక్షాయ
నిబంధా యాసురీ మతా,
మా శుచ స్సంపదం దైవీ
మభిజాతోఽసి పాణ్డవ. 5

సత్య—మక్రోధమును — నహింసయును—[1]మార్ద
వమ్ముఁ—బరనిందయును — ద్యాగ వర్తనమ్ము —
దయయు — శాంతియు — [2] నిస్పృహత్వమ్ము — విగత
చాపలమ్ము — [3] సముచితలజ్జాభరమ్ము — 2

క్షమయు — ధృతియును — దేజమ్ము — శౌచవిధియు—
[4]నాతిమానిత్వ—[5]మద్రోహ — మీ తెఱంగు
లైన వివిధ గుణమ్ములో యనఘ! దివ్య
సంపదల నొప్పు వాని లక్షణము లరయ. 3

దాంభికత్వమ్ముఁ, గ్రోధ, ముద్ధతియుఁ, బలుకు
ప్రల్లదనమును, నవివేక భావ, మతుల
దురభి మానమ్ము మున్నగు దుర్గుణమ్ము
లసుర సంపద కలవాని కలరు సూవె! 4

దైవ సంపద మోక్షసంధాయకమ్ము
దైత్య సంపద నిర్బంధ దాయకమ్ము
క్రీడి! విను దైవ సంపద తోడ నీవు
బుట్టి — తటు లాట — దుఃఖమ్ముఁ బొందఁ దగవు. 5

---

1. మార్దవము = మృదుల ప్రవర్తనము.

2. నిస్పృహత్వము = ఎట్టి కోరికలు లేకుండుట.

3. సముచితలజాభరమ్ము = శాస్త్ర విరుద్ధాచరణముల దలవంచు కొనుట.

4. నాతిమానిత్వము = తనయందున్న పూజ్యాభిమానమును వదలి కొనుట.

5. అద్రోహము = ఎవనియందును శత్రుభావము లేక ద్రోహము చేయకుండుట.

ద్వౌ భూత సర్గౌ లోకేఽస్మిన్
దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త
ఆసురం పార్థ మే శృణు. 6

ప్రవృత్తిం చ నివృత్తిం చ
జనా న విదురా సురాః
న శౌచం నా పి చాచారో,
న సత్యం తేషు విద్యతే. 7

అసత్య మప్రతిష్ఠం తే
జగ దాహు రనీశ్వరం,
అపరస్పరసం భూతం
కి మన్యత్కామ హైతుకం. 8

ఏతాం దృష్టి మవష్టభ్య
నష్టాత్మానో ఽల్పబుద్ధయః,
ప్రభవన్త్యుగ్ర కర్మాణః
క్షయాయ జగతో ఽహితాః. 9

కామ మాశ్రిత్య దుష్పూరం
దమ్భమానమదా న్వితాః,
మోహా ద్గృహీత్వా సద్గ్రాహాన్
ప్రవర్తన్తే ఽశుచి వ్రతాః. 10

చిన్తా మపరి మే యాం చ
ప్రలయాన్తా ముపాశ్రితాః,

వరలె దైవాసురస్వభావములు, రెండు
తెగలుగా భూతసంసృష్టి. జగతిలోన
మున్ను దెలిపితి దైవవిభూతి విపుల
ముగ ; వచించెద నసురవిభూతి నిపుడు. 6

చేయఁ దగినట్టి కార్యముల్ జేయలేక –
చేయఁ దగని యకృత్యముల్ జేయుచుండు
దనుజవృత్తి ప్రవిష్టులౌ జనులు సత్య
శౌచశీల పరిభ్రంశులై చరింత్రు. 7

స్త్రీపురుషయుక్తి సంతతి జెలఁగుచుండ–
వసుధ దైవం బదేడ – సర్వంబు కల్ల–
బ్రదికినన్నాళ్లు సుఖముగా బ్రదుకవలయు
నంచు భాషింత్రు జనులు, దైత్యప్రవృత్తి. 8

నష్టశీలురు గొందఱు జ్ఞానమతులు,
నాస్తికోక్తుల కలరి జ్ఞానమ్ముఁ దొఱగి
క్రూరకర్మాభిరతిఁ జేటుఁ గూర్చి ప్రజకు
చేటునకె పుట్టి రనెడు ప్రసిద్ధిఁ గాంత్రు. 9

దంభమానమదాన్విత దైత్యవృత్తి
నేగతిని గోరికలు గొనసాగకున్కఁ
గల్లసిద్ధాంతములను ముష్కరతఁ గొంచు
నశుచివర్తన వర్తింతు రధమజనులు. 10

ఇంతకంటె సుఖమ్ము వేరెచట దొఱక
దనుచుఁ గామోపభోగపరాయణు లయి

కామోపభోగపరమా
ఏతావ దితి నిశ్చితాః. 11

ఆశాపాశ శతైర్బద్ధాః
కామక్రోధపరాయణాః,
ఈహన్తే కామభోగార్థ
మన్యాయేనార్థ సంచయాన్. 12

ఇద మద్య మయాలబ్ధ
మిమం ప్రాప్స్యే మనోరథం,
ఇద మస్తీ ద మపి మే
భవిష్యతి పున ర్ధనమ్. 13

అసౌ మయా హతః
శత్రు ర్హనిష్యే చా పరా నపి,
ఈశ్వరోఽహ మహం భోగీ
సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

ఆఢ్యోఽభిజనవా నస్మి
కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య
ఇత్యజ్ఞాన విమోహితాః. 15

అనేకచిత్త విభ్రాన్తా
మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు
పతన్తి నరకే ఽశుచౌ. 16

అసుర వృత్తిఁ బ్రవర్తిల్లు నల్పమతులు
చచ్చు నందాక చింతతో సంచరింత్రు. 11

పలు రకములైన యాశలన్ బాశములకుఁ
గట్టువడి — క్రోధమునకును గామమునకు
దాసి లొంగుచుఁ బరుల సొత్తును గ్రహింప
నజ్ఞు లాసింత్రు విషయభోగైకనిరతి. 12

మొదలె నాయిల్లు లచ్చికిన్ బుట్టినిల్లు
దీనికిన్ దోడు నాకోర్కె దీర నింత
కిబ్బడిగఁ గూర్తు ధన మని హీను లెపుడు
గోరు కొను చుంద్రు గొంతెమ్మ కోర్కె లురక. 13

చచ్చె నాచేత వీఁ ; డింకఁ జావఁ గలరు
ప్రభువు నే నౌదు — భోగిని — బలయుతుండ
సిద్ధు లన్నింటి లోనఁ బ్రసిద్ధిఁ గాంచి
యుంట సుఖినైతి నని మూర్ఖు లుబ్బు చుంద్రు. 14

మొదలె యుత్తమకులజుండ; నిదియ కాక
యేను ధన మున్నవాఁడ నాకేమి కొదువ
వితరణమ్ముల నిష్టిఁ గావింతుఁ దుష్టి
నెవఁడు నాకుద్ది యని మూర్ఖు లిల వచింత్రు. 15

మోహజాల సమావృతమూఢ మతులు;
చిత్త విభ్రాంతిమై మనస్థిమిత ముడిగి
అతను భోగ విలాస పరాయణు లయి
చివికి జీర్ణించి నరకమ్ముఁ జేరి కొంద్రు. 16

ఆత్మసంభావితా స్తబ్ధా
ధనమాన మదాన్వితాః,
యజన్తే నామయజ్ఞై స్తే
ధమ్భేనావిధి పూర్వకమ్. 17

అహంకారం బలం దర్పం
కామం క్రోధం చ సంశ్రితాః
మామాత్మ పరదేహేషు
ప్రద్విషన్తోఽభ్యసూయకాః. 18

తానహం ద్విషతః క్రూరాన్
సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్ర మశుభా
నాసురీష్వేవ యోనిషు. 19

ఆసురీయోని మాపన్నా
మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవ కౌన్తేయ
తతో యాన్త్యధమాం గతిమ్. 20

త్రివిధం నరకస్యేదం
ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ
స్తస్మా దేతత్త్రయం త్యజేత్. 21

ఏతై ర్విముక్తః కౌన్తేయ
తమోద్వారై స్త్రిభి ర్నరః,

విత్తమాన మదాన్విత చిత్తులగుచుఁ
గ్రతువు దలపెట్టి నామ మాత్రముగ - నాత్మ
సంస్తుతి నొనర్చుకొనుచు న శాస్త్రవిధిని
దంభయుక్తిని మూర్ఖు లుద్ధతి నొనర్తు. 17

కామమును, క్రోధమును, నహంకార, మతుల
బలము, గర్వమ్ము, గలిగినవ్యర్థ మతులుః
బరుల నిందించుచుఁ స్వీయ పరహృదంత
రగతుఁ డ నగు నా యెడల వైరము వహింత్రు. 18

నాయెడల ద్వేష మూనెడు వరపశువులు
నశుభ చరితులు సంతత మసురయోను
లందుఁ ద్రోయంగఁబడి బాము లనుభవింప
నేను గల్పింతుఁ దత్కర్మ నియతిఁ బార్థ!, 19

అసురయోని జనించెడు నధమమతులు ;
నన్ను నేవిధిఁ జేరకే యెన్నిజన్మ
లైన నటులె జనించి హీనాతి హీన
మైన దుర్గతిఁ కరుగుచు నలమటింత్రు 20

ఆత్మ నాశనమునకుఁగా నను వు పడఁగఁ
గ్రోధలోభ కామమ్ము లన్గ నెడిమూఁడు
దసరె నరకమ్మునకు ముఖద్వారములుగఁ
బడయు నిమ్మూటి విడిచినవాఁడు సుఖము. 21

ఇరుల కిరలైన యిమ్మూడు నరకమార్గ
ములను దప్పించు కొన్నట్టి బుధుఁడు, తనకు

ఆచరత్యాత్మనః శ్రేయ
స్తతో యాతి పరాం గతిమ్. 22

యశ్శాస్త్ర విధి ముత్సృజ్య
వర్తతే కామకారతః,
న స సిద్ధి మనాప్నోతి
న సుఖం న పరాం గతిం. 23

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే
కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం
కర్మ కర్తు మిహార్హసి. 24

ఓమ్ తత్సదితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
దైవాసురసంపద్విభాగయోగోనామ
షోడశోఽధ్యాయః



శ్రేయ మొనఁ గూర్చుకొనె నరన్ జెలఁగి సత్ప్ర
వర్తనుండయి యవలఁ గైవల్య మందు, 22

విధి విహితమైన శాస్త్రంబు విడిచి తనకు
నిచ్చ వచ్చిన గతిఁ జరియించు వాఁడు
కార్యసిద్ధి దొఱఁగుట గాక సుఖము
సైతమున్ బొంద–డింక మోక్షమ్ముఁ గనునె? 23

కనుక సత్కార్య మెదియొ యకార్య మెదియొ
శాస్త్రముఁ బ్రమాణముగఁ గొని చర్చ జేసి
విషయము గ్రహించి శాస్త్రోక్త విధి నిహామునఁ
గర్మము లొనర్ప వర్తనన్ గాంచి తీవు. 24

ఇది శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యాయనం బడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీ కృష్ణార్జున
సంవాదమున దైవాసుర సంపద్విభాగయోగమను
పదునాఱవ అధ్యాయము.



శ్రీమత్పరమాత్మనేనమః

# గీతా సప్తశతి

## అథ సప్తదశోఽధ్యాయః - శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జున ఉవాచ :

యే శాస్త్రవిధి ముత్సృజ్య
యజన్తే శ్రద్ధయాన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ
సత్త్వ మాహో రజ స్తమః. 1

శ్రీభగవా నువాచ :

త్రివిధా భవతి శ్రద్ధా
దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ
తామసీ చేతి తాం శృణు. 2

సత్త్వాను రూపా సర్వస్య
శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో
యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః. 3

యజన్తే సాత్త్వికా దేవాన్
యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాన్ శ్చాన్యే
యజన్తే తామసా జనాః. 4

శ్రీమత్పరదేవతాయై నమః

# గీ తా స ప్త శ తి

## పదునేడవవ అధ్యాయము - శ్రద్ధాత్రయవిభాగయోగము

---

వెన్నునిఁ గాంచి వచియించె విజయుఁ డిట్లు
శాస్త్రవిధి వీడి శ్రద్ధ యజ్ఞము లొనర్చు
వారి కగు నిష్ఠ యెద్ది చెప్పం గదయ్య.
సాత్వికమ - రాజసమ - తామసంబ - కృష్ణ! 1

నావు డివ్విధి హరి వల్కెనరు ని గాంచి
సాత్వికము, రాజసముఁ, దామ సంబనఁ బడు
త్రివిధ మగు శ్రద్ధ నైజమై దేహు లందుఁ
దనరు - నద్దాని వినుము నే వినుతుఁ బార్థ! 2
అర్జునా! విను - శ్రద్ధా సమన్వితుండు
పురుషుఁ డింతకుఁ దద్రూప భరితుఁ డగుచు
నలరు - వేయేల - శ్రద్ధ, సత్వానురూప
మై ప్రవర్తిల్లు నని మాత్ర మరసి కొనుము. 3
దేవ పూజాది విధుల సాత్వికులు జెలఁగ;
రాజసులు, యక్షరాక్ష సార్చనలఁ దనరు
చుందు - రవ్విధిఁ దామసుల్ క్షుద్ర బుద్ధి
భూతములఁ బ్రేతములఁ గొల్చి పొదలు చుంద్రు. 4

అశాస్త్ర విహితం ఘోరం
తప్యన్తే యే తపో జనాః,
దంభాహంకార సంయుక్తాః
కామరాగబలాన్వితాః. 5

కర్షయన్త శ్శరీరస్థం
భూతగ్రామ మచేతసః,
మాం చైవాంత శ్శరీరస్థం
తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్. 6

ఆహార స్త్వపి సర్వస్య
త్రివిధో భవతి ప్రియః.
యజ్ఞ స్తప స్తథా దానం
తేషాం భేద మిమం శృణు. 7

ఆయు స్సత్త్వ బలారోగ్య
సుఖప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా
ఆహారా స్సాత్త్విక ప్రియాః. 8

కట్వమ్లలవణా త్యుష్ణ
తీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజ సస్యేష్టా
దుఃఖశోకా మయప్రదాః. 9

యాతయామం గతరసం
పూతి పర్యు షితం చ యత్,

అనఘ! దంభ మహం కారమును గలం పఁ-
గామరాగబలాం చితోగ్ర ప్రవృత్తి
శాస్త్ర విధి మాని స్వేచ్ఛాప్రసక్తి ఘోర
తపము సాగించుచుందు రుద్ధతిని నెవరు. 5

వారు, నిజదేహగత భూత పంచకమును-
మఱియు నంతశ్శరీరసుస్థిరనివాసు;-
నన్ను నలయింతు - రట్టి య జ్ఞానమతుల
నాసుర విభూతి యుతులుగా నరసి కొనుము. 6

తమ స్వభావాను గుణముగఁ దాము దినెడు
తిండి యింతకు జనులకుఁ ద్రివిధ మయ్యెఁ-
గ్రతువులు, దపమ్ములున్, దానవితతి గూడఁ
ద్రివిధములు గాదె - వినుము - తద్రీతి వినుతు. 7

ఆయురారోగ్య బుద్ధి రాహ్లాద సుఖబ
లప్రవర్ధకములును - సలక్షణములు -
నగుచు హృద్యంబు లైన యాహారవస్తు
వులు మహిన్ సాత్త్వికప్రియంబు లయి చెల్లు. 8

ఉప్పు, బులుసును, గలిగి యత్యుష్ణ మగుచుఁ
జేదుతోఁ గూడి రూక్షమై జిహ్వ యందుఁ
జిమ చిమల్ గల్గఁ; గన్నులుఁ జెమ్మగిల్ల;
వరలు రాజసాహారముల్ వ్యాధిదములు. 9

ఉడికి యుడుకని యోదన, ముప్పు తేని
చప్పిడి గ నుండు నెంగిలి చలిదిశాక

ఉచ్ఛిష్ట మపి చామేధ్యం
భోజనం తామస ప్రియమ్. 10

అఫలాకాంక్షి భి ర్యజ్ఞో
విధి దృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతి మనః
సమాధాయ స సాత్త్వికః. 11

అభిసంధాయ తు ఫలం
దంభార్థ మపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ
తం యజ్ఞం విద్ధి రాజసం. 12

విధిహీన మసృష్టాన్నం
మన్త్రహీన మదక్షిణం,
శ్రద్ధావిరహితం యజ్ఞం
తామసం పరిచక్షతే. 13

దేవద్విజ గురుప్రాజ్ఞ
పూజనం శౌచ మార్జవం,
బ్రహ్మచర్య మహింసా చ
శరీరం తప ఉచ్యతే. 14

అనుద్వేగ కరం వాక్యం
సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్య స నం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే. 15

ములఁ జెలంగుచు న పవిత్రమునకు నునికి
యైన తిండి, తామసుల కే యగుఁ బ్రియమ్ము. 10

శాస్త్ర విధి చేత నియత మౌ సవన మున్నఁ
జేయ వలె నని వాంఛించి చిత్త శుద్ధి
ఫలమ పేక్షింప కే చేయఁ బడెడు మహిత
యజ్ఞ – మింతకు సాత్వికయజ్ఞ మంద్రు. 11

జనులు, నీసాటివాఁ డులే డనుచుఁ బొగడఁ–
దనను బ్రకటించు కొన నెంచి దంభమునకు
ఫల మ పేక్షించి కావింపఁ బడెడు క్రతువు
'రాజసం' బ ని తలపంగ రాదె పార్థ! 12

దక్షిణలు లేక – తుద కన్న దానమునకు
రోసి–మంత్రవిహీనమై–రూఢిఁ దనరి
శాస్త్ర విధి మాని–య శ్రద్ధ సలుపఁ బడిన
యజ్ఞమును 'దామ సం' బని యరసి కొనుము. 13

దేవ, గురు, విప్ర, విబుధ, పూజా విధాన
ములఁ జరించుచు శౌచవిస్ఫూర్తి మించి
సరలతాహింసలఁ బ్రహ్మ చర్య నొప్పి
మనుట దైహికతప మని మాను లంద్రు. 14

ప్రియహిత మ్మయి, యలరి యుద్వేగ మపన
యించి, సత్య భాషణము భాషించుటయును.
వేదశాస్త్రమ్ములఁ వల్లె వేయుటయును
వాఙ్మయతపో విధమ్ము లై పఱగు నివ్వి. 15

మనః ప్రసాద స్సౌమ్యత్వం
మౌన మాత్మవినిగ్రహః,
భావ సంశుద్ధి రిత్యేత
త్తపో మానస ముచ్యతే. 16

శ్రద్ధయా పరయా తప్తం
తప స్త త్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభి ర్యుక్తై
స్సాత్త్వికం పరిచక్షతే. 17

సత్కార మాన పూజార్థం
తపో దంభేన చైవ యత్,
క్రియతే త దిహ ప్రోక్తం
రాజసం చల మధ్రువమ్. 18

మూఢ గ్రాహేణాత్మనో య
త్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా
త త్తామస ముదాహృతం. 19

దాతవ్య మితి య ద్దానం
దీయతేఽ నుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ
తద్దానం సాత్త్వికం స్మృతం. 20

యత్తు ప్రత్యుప కారార్థం
ఫల ముద్దిశ్య వా పునః,

సౌమ్య భావమ్ము, హృదయప్రసన్నతయును;
భావ సంశుద్ధియును - మౌనభావ, మాత్మ
నిగ్రహము మున్నుగాఁ గల నిరుపమాన
విషయములు మానసికతపోవిధిఁ జెలంగు. 16

ఫలముఁ గోరని నిష్కామభావ యుక్తు
లైన యోగుల చే శ్రద్ధ నలరి చేయఁ
బడిన యిమ్మూఁడు తెరగుల బరగు తపము
'సాత్త్వికం' బని పలికిరి తత్త్వ విదులు. 17

జనుల సత్కార రూప పూజా ఫలమ్ము
వడయ; దంభమ్ముచేఁ జేయఁ బడిన తపము
క్షణికఫల వంతమై యనిశ్చలముఁ నగుచు,
దనరుటం జేసి 'రాజసం'బ నిరి బుధులు. 18

తన శరీరమ్మునకు బాధఁ దనరఁ జేసి
కొనుట కైగాని-పరహాని కొఱకుగాని-
పట్టుదల, మౌఢ్యమునఁ జేయఁబడు తపమ్ముఁ
'దామసము' గాఁ గ నుడివిరి తజ్ఞు లవని. 19

దాన మిడుటయె తనకుఁ గర్తవ్య మనుచు
దేశకాల పాత్రమ్ముల తీరుఁ గాంచి
ప్రత్యు పకృతి నొనర్పని వారి కిడెడు
దానమే 'సాత్త్వి' కమ్మని తజ్ఞు లంద్రు. 20

తిరిగి యుపకార మందంగఁ దెంపుఁజేసి
ఫలముఁ గాంక్షించి తా కష్ట పడుచు నెటులొ

దీయతే చ పరిక్లిష్టం
త ద్దానం రాజ సం స్మృతం. 21

అదేశకాలే యద్దాన
మపాత్రేభ్య శ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం
త త్తామస ముదాహృతమ్. 22

ఓం తత్స దితి నిర్దేశో
బ్రహ్మణ స్త్రి విధః స్మృతః,
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ
యజ్ఞా శ్చ విహితాః పురా. 23

తస్మా దో మి త్యుదా హృత్య
యజ్ఞ దాన తపః క్రియాః,
ప్రవ ర్తన్తే విధానోక్తా
స్సతతం బ్రహ్మవాదినామ్. 24

త ది త్యనభి సంధాయ
ఫలం యజ్ఞ తపః క్రియాః,
దానక్రియా శ్చ వివిధాః
క్రియ న్తే మోక్ష కాంక్షిభిః. 25

యెఱవుగాఁ దెచ్చుకొను ప్రేమ నిడిన దాన
మవని 'రాజస' మని పల్కి రనఘమతులు. 21

దేశకాల పరిస్థితుల్ దెలిసికొనక;
పూజ మాని తిరస్కార పూర్వకముగ
హీనులైన యపాత్రుల కీయఁ బడెడు
దాన మింతకుఁ 'దామస'దాన మయ్యె. 22

* విజయ! 'ఓమ్‌తత్స' దను మూఁడు విధములైన
నామములు బ్రహ్మ కెపుడో నిర్ణయము లయ్యె-
వీనిచేఁ గాదె సృష్ట్యాది విప్రవరులు;
వేదయజ్ఞ విశిష్టులై విహితులైరి. 23

కనుకనే మూఁటిలోని 'ఓం' కార రూప
మునఁ దెలంగెడు ప్రణవమ్ము ముందు పలికి-
యవల దానతపోయజ్ఞ వివిధ విధులు
శాస్త్ర విధి బ్రహ్మవాదులు, సల్పుచుంద్రు. 24

అంతయును బరమేశ్వరా యత్త మనెడు
నర్థ మొసఁగెడు తచ్ఛబ్ద మర్థి వలికి
ఫలముఁ గోరక యజ్ఞతపః క్రియాది
దానము లొనర్తురు మోక్ష తత్పరులు జగతి. 25

* ఓమ్-తత్-సత్ - ఈ మూఁడును విధికి నామములు. ఆ మహాత్ముని నామోచ్చారణము నిరంతరముఁ జేయుచు నిష్కామభావముతోఁ బరమేశ్వర ప్రీతికై నియమింపఁ బడిన శాస్త్ర విధిచేఁ గర్మలను మాత్రము శ్రద్ధోత్సాహములతో మనుష్యుఁడు గావించుచుండవలెనని యీశ్లోకము యొక్క పరమాశయము.

సద్భావే సాధుభావే చ
స దిత్యే తత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా
స చ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26

యజ్ఞే తపసి దానే చ
స్థితి స్స దితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం
స దిత్యే వాభిధీయతే. 27

అశ్రద్ధయా హుతం దత్తం
తప స్తప్తం కృతం చ యత్,
అస దిత్యుచ్యతే పార్థ
న చ తత్ప్రేత్యనో ఇహ. 28

ఓమ్ తత్స దితి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
శ్రద్ధాత్రయ విభాగయోగోనామ
సప్తదశోఽధ్యాయః.



విధికి మూఁడవ పేరుగా విహిత మగుచు
నలరు సచ్ఛబ్ద, ముత్తమ మైన కర్మ
లను ప్రయోగింపఁ బడుచు విలక్షణ మగు
భావమున నొప్పు సాధుభావమునఁ దవిలి. 26

దానవిధి. యజ్ఞమందున, దపము నందు,
నలరు స్థితి గాదె సచ్ఛబ్దమై తనర్చు-
నింత యేటికి భగవదర్థియ మైన
కర్మ సచ్ఛబ్ద సహితమై క్రాలు చుండు. 27

ఈయఁబడు దాన మైనను-జేయఁబడెడు
తప మయిన - వేల్వఁ బడెడు హుతమయిన-నిక
శ్రద్ధ లేని మఱెట్టి కర్మములు నైన
నగు నసత్తు; లిహపరముల నడఁచు నివియ. 28

ఓమ్ తత్సదితి శ్రీమదుపనిషద్బ్రహ్మ విద్యయనం బడు యోగ
శాస్త్ర మందలి శ్రీమద్భగవద్గీత యందు శ్రీ కృష్ణార్జున
సంవాదమున శ్రద్ధాత్రయ విభాగయోగ మను
పదు నేడవ యధ్యాయము.



ఓమ్ శ్రీ పరమాత్మనే నమః.

# గీతా సప్తశతి

## అథాష్టాదశోఽధ్యాయః - మోక్షసన్న్యాసయోగః

---

అర్జున ఉవాచ :

సన్న్యాసస్య మహాబాహో
తత్త్వ మిచ్ఛామి వేదితుం,
త్యాగస్య చ హృషీకేశ
పృథక్కేశి నిషూదన. 1

శ్రీభగవా నువాచ :

కామ్యానాం కర్మణాం న్యాసం
సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం
ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

శ్రీమత్పరమాత్మనే నమః

# గీతా సప్తశతి

## పదునెనిమిదవ అధ్యాయము - మోక్షసన్న్యాస యోగము

---

అంత విజయుఁ డిటు లాడె హరిని గూర్చి
త్యాగసన్న్యాసముల నిశ్చితార్థములను
వేఱు వేఱుగఁ గనుఁగొన వేడుచుంటిఁ
గేశిదనుజాంతకా! హృషీకేశ! యిపుడు. 1

సవ్యసాచిఁ గనుంగొని సరసిజాక్షుఁ
* డనియె నిటు – కామ్య కర్మ సన్న్యాసమునకుఁ
గవులు 'సన్న్యాస' మన – సర్వకర్మ ఫలము
† లుడుగుటయె 'త్యాగ' మనిరి వేఱొకరు తలఁచి. 2

---

* స్త్రీ పుత్రధనాది ప్రియవస్తు ప్రాప్తికై కాని మఱియు రోగ నివృత్తికై కాని - చేయఁబడెడు యజ్ఞ దాన తపోనియమాదులగు కర్మలకే కామ్య కర్మ లని పేరు. ఈ కర్మలను తన ప్రియమును నెరవేర్చుకొనుట ప్రతి మనుష్యుఁడు చేయు చుండును.

† ఈశ్వర భక్తియు, దేవతా పూజయు, మాతాపితల సేవయు, గురుజన శుశ్రూషయుఁ జేయు మనుజుని యజ్ఞదానతపః క్రియాదులగు (వర్ణాశ్రమాను సారము నిర్వర్తించు) కర్మలందలిగల కోరికలను త్యాగము చేయుటకును, తత్కర్మ ఫల త్యాగమునకును 'త్యాగ' మని పేరు.

త్యాజ్యం దోష వదిత్యేకే
కర్మ ప్రాహు ర్మనీషిణః,
యజ్ఞదాన తపః కర్మ
న త్యాజ్య మితి చాపరే. 3

నిశ్చయం శృణు మే తత్ర
త్యాగో భరతసత్తమ,
త్యాగో హి పురుష వ్యాఘ్ర
త్రివిధ స్సంప్ర కీర్తితః. 4

యజ్ఞదానతపః కర్మ
న త్యాజ్యం కార్య మేవ తత్,
యజ్ఞో దానం తప శ్చైవ
పావనాని మనీషిణాం. 5

ఏతాన్య పి తు కర్మాణి
సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యా నీతి మే పార్థ
నిశ్చితం మత ముత్తమం. 6

నియతస్య తు సన్న్యాసః
కర్మణో నోపపద్యతే,
మోహా త్తస్య పరిత్యాగ
స్తామసః పరికీర్తితః. 7

దుఃఖ మిత్యేవ యత్కర్మ
కాయక్లేశ భయా త్త్యజేత్,

తుదకుఁ గర్మలు బంధహేతు ప్రసక్తి
దోషదము లౌట వానిని దొఱఁగు టుచిత
మని బుధులు గొంద ఱనఁ; దపోయజ్ఞదాన
విధులు గ్రాహ్యంబు లం చన్య విబుధు లనిరి. 3

త్యాగ విషయంబు నం దివ్విధ మగు ద్వివిధ
వాద మున్నను – మన్మనో భావ మింక
వినుము – సత్త్వరజ స్తమోగుణయుత మయి
'త్యాగ' మలరె ననుట విదితంబ కాదె. 4

యజ్ఞదాన తపః కర్మ లపరిహార్య
ములగుటఁ దదాచరణ మిల ముఖ్య మయ్య –
యిష్టియైనఁ దపం బైన – నెట్టి దాన
మైన నది విజ్ఞులకుఁ బూత మైన కర్మ. 5

కడకుఁ బ్రాజ్ఞులు నుడివిన కర్మ లివ్వి
యైన – వీని ఫలమ్ములున్ – వానివలనఁ
దవరు నాసక్తి, యును వీడి కర్మ వితతిఁ
జేయఁ దగు నని మద్వినిశ్చితమతమ్ము. 6

తమ కులాచార విధిని శాస్త్ర నియత మగు
ధర్మ ముడుగుటఁ దగ దెట్టి తఱిని – నట్టు
లయ్యుఁ ద్యజి యించి రేని మోహ ప్రసక్తి-
దాని విబుధులు 'దామ సత్యాగ' మంద్రు. 7

పార్థ! శారీరక క్లేశభయము చేతఁ
గష్టభూయిష్ట మని కామ్యకర్మఁ దొఱఁగు

స కృత్వారాజ సం త్యాగం
నైవ త్యాగఫలం లభేత్. 8

కార్య మిత్యేవ యత్కర్మ
నియతం క్రియ తేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలం చైవ
స త్యాగ స్సాత్వికో మతః. 9

న ద్వేష్ట్య కుశలం కర్మ
కుశలే నాను షజ్జతే,
త్యాగీ సత్వసమా విష్టో
మేధావీ ఛిన్నసంశయః. 10

న హి దేహ భృతాశక్యం
త్యక్తుం కర్మా ణ్యశేషతః,
య స్తు కర్మ ఫలత్యాగీ
స త్యాగీ త్యభి ధీయతే. 11

అనిష్ట మిష్టం మిశ్రం చ
త్రివిధం కర్మణః ఫలం,
భవ త్య త్యాగినాం ప్రేత్య
న తు సన్న్యాసినాం క్వచిత్. 12

పంచైతాని మహాబాహో
కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని
సిద్ధయే సర్వ కర్మణాం. 13

నతని త్యాగమ్ము 'రాజసత్యాగ'మగుట
వాని జెందడు త్యాగైక ఫలము సుంత. 8

తనకు నియ్యది చేయఁగాఁ దగిన కార్య
మను; చనాసక్తి ఫలముపై నాసఁ దొఱఁగి;
శాస్త్ర విధిచేత జనునిచే సల్పఁ బడెడు
కర్మయే 'సాత్వికం' బౌచుఁ గ్రాలు జగతి. 9

అశుభ కర్మల వైర మావంత లేక–
శుభము లౌ వాని యెడఁ బ్రేమఁ జూప కుండు
నతఁడు సత్త్వ సమావిష్టుఁ డగుచు; ఛిన్న
సంశయుం డయి – త్యాగియై; జ్ఞాని యగును. 10

నిర్విశేషమ్ముగా కర్మ నిచయ మనఘ!
దొఱఁగ నే దేహధారికిఁ దరము గాదు–
కానఁ గర్మఫలమ్ముఁ ద్యాగం బొనర్చు
వాఁడె పో 'త్యాగి' యనఁ బడి వసుధ నెగడు. 11

మృతికి వెనుక శుభాశుభ మిశ్రగతుల
జెలఁగు మువ్విధముల కర్మఫలము లొకటఁ
దలఁపు లెదఁ గల్గువానికే తనరుఁ గాని–
తలఁపు లెద లేని సన్న్యాసి దఱికిఁ జొరవు. 12

అర్జునా! యింక సాంఖ్య సిద్ధాంత మందు
సకల సంపూర్ణ కర్మసిద్ధికిఁ గ్రమముగఁ
గారణము లైదు వచియింపఁ గాఁబడెఁ గద!
విశదముగ వాని బోధఁ గావింతు నీకు. 13

అధిష్ఠానం తథా కర్తా
కరణం చ పృథ గ్విధం,
వివిధా శ్చ పృథక్ చేష్టా
దైవం చై వాత్ర పంచమమ్. 14

శరీరవాఙ్మనో భి ర్య
త్కర్మ ప్రారభ తే నరః,
న్యాయ్యం వా విపరీతం వా
పంచై తే తస్య హేతవః. 15

త త్రైవం సతి కర్తార
మాత్మానం కేవలం తు యః,
పశ్య త్య కృత బుద్ధిత్వా
న్న స పశ్యతి దుర్మతిః. 16

యస్య నాహం కృతో భావో
బుద్ధి ర్యస్య న లిప్యతే.

విను [1]మధిష్ఠానముఁ – [2]గర్తయును– [3]విభిన్న
కరణతతియును; [4]జేష్టలుఁ గలిసి వెరసి
నాలుగయి యొప్పె – [5]దైవమీ నాల్గుతోడ
నలరెఁ – గర్మకు హేతువు లైదనంగ! 14

వాఙ్మనఃకాయసంశుద్ధివలనఁ గాని–
శాస్త్ర విధి చేతఁ గాని – యశాస్త్ర విధిని
గాని–మనుజుఁ డారంభించు కర్మ కెపుడు
గ్రాలెదుఁ గాదె యీ యైదు కారణములు. 15

విషయ మిటులుండ; జనుఁ డవివేకి యగుచు
నీ పరిస్థితి శుద్ధ స్వరూపుఁ డైన
యాత్మనే కర్తగా నెంచి యతి మలీన
మానసుం డయి సత్యమ్ము మాటు పఱచు. 16

పార్థ! "నేఁ గర్త" నను నహంభావ ముడిగి
బుద్ధిఁ గర్మలఁ జొన్పకే పొదలు దేహి–

---

1. అధిష్ఠానము = ఇచ్ఛ, ద్వేషము, సుఖదుఃఖములు, జ్ఞానము మున్నగువాని కాశ్రయ మగు శరీరము.

2. కర్త = ఉపాధి రూప భోక్తయగు జీవుఁడు.

3. విభిన్న కరణ...తతి శబ్దాది విషయములను గ్రహించు నట్టి శ్రోత్రేంద్రి యాదులు.

4. చేష్ట...లు నిశ్వాస ప్రశ్వాసాదిభిన్నభిన్న వాయుసంబంధి క్రియలు.

5. దైవము = చక్షురా దీంద్రియ ప్రదాత – సూర్యుఁడు – అదృష్టము.

హత్వాపి స ఇమాన్ లోకా
న్న హన్తి న నిబధ్యతే. 17

జానం జ్ఞేయం పరిజ్ఞాతా
త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి
త్రివిధః కర్మ సంగ్రహః. 18

జ్ఞానం కర్మ చ కర్తా చ
త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే
యథావ చ్ఛృణు తా న్యపి. 19

సర్వభూతేషు యే నైకం
భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు
తత్ జ్ఞానం విద్ధి సాత్త్వికం. 20

పృథక్త్వేన తు యత్ జ్ఞానం
నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు
తత్ జ్ఞానం విద్ధి రాజసం. 21

యత్తు కృత్స్నవదే కస్మిన్
కార్యే సక్త మహైతుకం,
అతత్త్వార్థ వదల్పం చ
తత్తామస ముదాహృతం. 22

ప్రాణివధఁ జేయుఁ గాక యెప్పగిది నతఁడు;
పాపిగా లేడు దురితలంపటుఁడుఁ గామి. 17

జ్ఞాతయుఁ – జ్ఞేయమును – బరిజ్ఞాన మనఁగఁ
దనరె నిమ్మూఁడుఁ గర్మచోదనము లౌచుఁ;
గరణ మనఁ – గర్మ మన–మఱి కర్త యనఁగఁ
గ్రాలు నీ మూఁడుఁ గర్మ సంగ్రహము లవని. 18

కడకు గుణసాంఖ్యమున జ్ఞాన, కర్త, కర్మ
ల గుణముల విభేదములకుఁ దగిన రీతి
భాగములు మూఁడు మూఁడుగాఁ బరిగణింపఁ
బడి విభక్తమ్ము లయ్యె – నవ్వాని వినుతు. 19

అవ్యయం బైన పరమాత్మ నద్వితీయ
భావ – మవిభక్తయుక్తి విభక్త భూత
సమితి – మనుజుండు గన్గొను జ్ఞానమునకు
"సాత్త్విక జ్ఞాన"మని బుధుల్ సంజ్ఞ నిడిరి. 20

వివిధజీవుల మనుజుండు, భిన్నగతుల
వేరువేరుగ నానాప్రకార భావ
ములను దిలకించు జ్ఞానమ్ము, ముఃఖ్యముగను
"రాజస జ్ఞాన"మగు నని ప్రాజ్ఞు లనిరి. 21

కార్యసిద్ధికిఁ గల మైదు కారణముల
నొం డనం దగు మెయి – శ్రద్ధ నొప్పు నదియు;
నల్పము; నకౌశలమును; దత్త్వార్థ మరయ
లేని జ్ఞానమ్ము, తామస జ్ఞాన మనఘ! 22

నియతం సంగరహిత
మరాగ ద్వేషతః కృతం,
అఫలప్రేప్సునా కర్మ
యత్త త్సాత్త్విక ముచ్యతే. 23

యత్తు కామేప్సునా కర్మ
సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం
తద్రాజస ముదాహృతం. 24

అనుబన్ధం క్షయం హింసా
మనవేక్ష్య చ పౌరుషం,
మోహా దారభ్యతే కర్మ
యత్తత్తామస ముచ్యతే. 25

ముక్త సంగోఽనహం వాదీ
ధృత్యుత్సాహ సమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః
కర్తా సాత్త్విక ఉచ్యతే. 26

రాగీ కర్మఫల ప్రేప్సు
ర్లుబ్ధో హింసాత్మకో ఽశుచిః,
హర్ష శోకాన్వితః కర్తా
రాజసః పరికీర్తితః. 27

విజయ! విను వీతరాగవిద్వేషుఁ డగుచు;
జనుఁ, డహంభావమ్ముఁ వీడి శాస్త్ర విధిని
గర్మఁ - దత్ఫల మాసింపకయ యొనర్చు
చో నదియ 'సాత్వికం' బౌచు సొంపుఁ దనరు. 23

కష్ట పడు చెట్టులో యహంకారవశత
ఫల మపేక్షించి - మిగుల దంభమునఁ జెలఁగి;
కడఁగి యొనరించు పురుషుని కామ్య కర్మ -
'రాజసం' బని పండితప్రవరు లనిరి. 24

మొదలె సామర్థ్యపరిణామములను గూర్చి
చర్చ సేయక - హాని హింసలకు నోర్చి -
పదల క జ్ఞానమునఁ జేయఁ బడెడు కర్మ-
'తామసాత్మక' మనిరి తత్త్వజ్ఞు లవని! 25

విగతసంగుఁ; డహంకారవిరహితుండు;
సాహసాఢ్యుండు; ధైర్య విస్తారయుతుఁడు;
సిద్ధ్య సిద్ధుల సమబుద్ధిఁ జెలఁగు చుండు
వాఁడు, 'సాత్త్విక కర్త' యై వసుధ నెగడు. 26

కర్మ ఫలకాంక్షి - హర్ష శోక ప్రసక్తుఁ-
డశుచి - పిసునారి - ఘోరహింసాత్మకుండు-
విషయ భోగానురాగైక వివశుఁ డగుచుఁ
గ్రాలు నాతఁడు, 'రాజసకర్త' సుమ్ము, 27

అయుక్తః ప్రాకృత స్తబ్ధః
శఠో నైష్కృతి కోఽలసః,
విషాదీ దీర్ఘ సూత్రీ చ
కర్తా తామస ఉచ్యతే. 28

బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ
గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ
పృథక్త్వేన ధనంజయ. 29

ప్రవృత్తిం చ నివృత్తిం చ
కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షం చ యో వేత్తి
బుద్ధి స్సా పార్థ సాత్వికీ. 30

యయా ధర్మ మధర్మం చ
కార్యం చాకార్యమేవ చ,
అయథావ త్ప్రజానాతి
బుద్ధి స్సా పార్థ రాజసీ. 31

శఠుఁ ; డయుక్తుండు ; గర్వి ; శిక్షావిరహితుఁ;
[1]డలసుఁ; డేడ్చెడు నలవాటు గలుగు వాఁడు;
[2]దీర్ఘసూత్రియు – [3]బహు నైష్కృతికుఁడుఁగాఁగఁ
దనరు నతఁడు, 'తామసకర్త' యనఁగఁ జెల్లు. 28

అనఘ! సత్వ రజస్తమోగుణ విభాగ
యుక్తి – బుద్ధికి–ధారణాశక్తి–కనువు
పడెడు రీతి విభాగింపఁ బడిన మూఁడు
విధము లున్నవి – వానిని వినుతు విడిగ. 29

తగిన పనియును – జేయంగఁ దగని పనియు–
మఱి [4]ప్రవృత్తి [5]నివృత్తుల మార్గములును–
బంధ మోక్షమ్ములుఁ – భయాభయ విషయము–
లరసి కొను బుద్ధి 'సాత్వికి' యనఁగ నొప్పు. 30

ధర్మ విధమును – మఱియు నధర్మ విధముఁ–
జేయఁ దగినట్టి కార్యమ్ముఁ–జేయరాని
కార్యమును–వాస్తవికదృష్టిఁ గాంచలేని
బుద్ధి నార్యులు 'రాజసి' బుద్ధి యనిరి. 31

---

1. అలసుఁడు = మందుఁడు 2. దీర్ఘసూత్రి= కొలఁది కాలములో ముగియు పనినైనను గాలము జరుపుచు జేయనివాఁడు 3. బహు నైష్కృతికుఁడు = మరణ పర్యంతము నాశనము గలిగించు స్వభావము గలవాఁడు.

4. గృహస్థాశ్రమములోనుండి జనకునివలెఁ బ్రవర్తించు మార్గమునకు 'ప్రవృత్తి' మార్గమని పేరు.

5. దేహాభిమానమును వదలికొన్న శుకదేవుని వలెఁ బ్రవర్తించు మార్గమునకు 'నివృత్తి'మార్గమని పేరు.

అధర్మం ధర్మ మితి యా
మన్యతే తమసా వృతా,
సర్వార్థాన్ విపరీతాన్ శ్చ
బుద్ధి స్సా పార్థ తామసీ. 32

ధృత్యా య యా ధారయతే
మనః ప్రాణేన్ద్రియ క్రియాః,
యోగే నావ్యభిచారిణ్యా
ధృతి స్సా పార్థ సాత్త్వికీ. 33

యయా తు ధర్మకామార్థాన్
ధృత్యా ధారయతే ఽర్జున,
ప్రసఙ్గేన పలాకాంక్షీ
ధృతి స్సా పార్థ రాజసీ. 34

యయా స్వప్నం భయం శోకం
విషాదం మద మేవ చ,
న విముంచతి దుర్మేధా
ధృతి స్సా పార్థ తామసీ. 35

సుఖం త్విదానీం త్రివిధం
శృణు మే భరతర్షభ,
అభ్యాసా ద్రమతే యత్ర
దుఃఖాన్తం చ నిగచ్ఛతి. 36

కడక ధర్మమ్ము ధర్మమ్ముగాఁ దలంచి-
యర్థముల కెల్ల వైపరీత్యంబుఁ గూర్చి-
పార్థ! తమ సావృతం బయి పరగు బుద్ధిఁ
'దామసి' గ నెంచు చుందురు తత్త్వవిదులు. 32

విజయ! సాంసారికము లైన విషయములకుఁ
బట్టు బడ నట్టి ధారణాపటిమ, జనుఁడు-
ధ్యాన విధిఁ బ్రాణహృదయేంద్రియక్రియాళి
నిల్పు ధృతి 'సాత్త్వికి' యనంగ నెగడెఁ గాదె! 33

మనుజుఁ, డాసక్తి ఫలవాంఛ మాను కొనక-
ధర్మకామార్థసంగతిఁ దవిలి - వాని
ధారణ యొనర్చు ధృతిని దద్ధర్మ విదులు,
వ్యవహరించిరి 'రాజసి' యనెడు పేర. 34

జ్ఞాన హీనుండు, శోక, విషాద, భీతి,
మద, సుషుప్తిగతుం డయి మాన కెపుడు
వానినే ధారణ మొనర్చు నేని వాని
ధారణాశక్తి, 'తామసి' యై రహించు. 35

ఎద్ది, అభ్యాస విధి మది కింపుఁ గూర్చి
దుఃఖ నిర్మూలమునకును దోడు పడునో;
అట్టి త్రిగుణాత్మకం బయి యలరు సుఖముఁ
గూర్చి విను మింక నిప్పు డో కుంతి తనయ! 36

యత్తదగ్రే విష మివ
పరిణామే ఽమృతోపమం,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త
మాత్మ బుద్ధి ప్రసాదజమ్. 37

విషయేన్ద్రియ సంయోగా
ద్యత్త దగ్రేఽమృతోపమం,
పరిణామే విష మివ
తత్సుఖం రాజసం స్మృతమ్. 38

య దగ్రే చాను బన్ధే చ
సుఖం మోహాన మాత్మనః,
నిద్రాలస్య ప్రమాదోత్థం
త త్తామస ముదాహృతమ్. 39

న తద స్తి పృథివ్యాం వా
దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతి జై ర్ముక్తం
య దేభి స్స్యాత్త్రిభి ర్గుణైః. 40

* మొదట విషముగఁ గను పట్టి-తుద కమృతము
తీరుగాఁ దోఁచి-యాత్మబుద్ధి ప్రసాద
జనిత మగు నీ సుఖమ్మును 'సాత్విక' మని
తత్వవిదులు, వాకొనిరి పృథాకుమార! 37

ఉర్వి విషయేంద్రియైక సంయోగ విధిని
†దొలుత నమృతంబుగాఁ దోఁచి తుదకు విషస
మమ్ముగాఁ దోఁచు నట్టి సుఖమ్ముఁ బార్థ!
'రాజ' సమ్మని నుడివి రార్యప్రవరులు. 38

ఆదినిఁ గాని-యంతంబు నందుఁగాని-
మోహమున ముంచి తన నెటో మోసగింపఁ
దలఁచు సుఖము, నాలస్య నిద్రా ప్రమాద
జనిత మై యుంటఁ 'దామ' స మని తలంపు. 39

ప్రకృతి సంభవ మా గుణత్రయము చేత
విరహితుం డైన ప్రాణి యిద్ధరణిఁ గాని -
స్వర్గమునఁ గాని - తుదకు దేవతలఁ గాని -
నగపడడు - సర్వ జగము మాయా వృతమ్ము. 40

---

* క్రీడాసక్తుఁడగు బాలకుని విద్యాభ్యాసము లోనికి దించి నపుడు ప్రప్రథమున నతనికి విషతుల్యముగఁ దోచి నటుల విషయాసక్తుఁ డగు పురుషునకును ప్రథమములో భగవద్భజనాది సాధనములు విషతుల్యముగనే తోచు చుండును.

† బలము-వీర్యము, బుద్ధి, ధనము, ఉత్సాహము ఇవి యన్నియుఁ బరలోక నాశన కారకములు. ఇంద్రియములవలని కలుగు సుఖము, పరిణామమున (మొదట నమృతముగా నున్నను) విషసదృశము ముగాఁ జూపట్టును.

బ్రాహ్మణ క్షత్రియ విశాం
శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని
స్వభావ ప్రభవై ర్గుణైః. 41

శమో దమ స్తప శ్శౌచం
క్షాన్తి రార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం
బ్రహ్మ కర్మ స్వభావజమ్. 42

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం
యుద్ధే చాప్యపలాయనం,
దాన మీశ్వర భావ శ్చ
క్షాత్రం కర్మ స్వభావజమ్. 43

కృషిగౌరక్ష్య వాణిజ్యం
వైశ్యకర్మ స్వభావజం.
పరిచర్యాత్మకం కర్మ
శూద్రస్యాపి స్వభావజమ్. 44

స్వే స్వే కర్మణ్యభి రత
స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మ నిరత స్సిద్ధిం
యథా విన్దతి త చ్ఛృణు. 45

యతః ప్రవృ త్తి ర్భూతానాం
యేన సర్వ మిదం తతం,

పూర్వకృత కర్మ సంస్కార పూర్వకముగఁ
బ్రాహ్మణ క్షత్ర వైశ్య శూద్ర ప్రవరుల
ప్రకృతి జము లయ్యె; గుణనికర ప్రసక్తి
వరలు కర్మలు, విభజింపఁ బడియె జగతి. 41

అనఘ! జ్ఞానమ్ము; విజ్ఞాన; మార్జవమ్ము;
శమము; దమమును; దపమును; క్షమయు; మఱియు
శౌచ; మాస్తిక్య మాదిగా నకల విధులు,
బ్రహ్మ కర్మ స్వభావ సంభవము లవని. 42

ధృతియు; శౌర్యమ్ముఁ; దేజమ్ముఁ; జతురతయును;
బవరమున వెన్ను జూపనిబంటు తనము;
దాన, మీశ్వర భావాద్యనూన విధులు
క్షత్ర కర్మ స్వభావ సంజనితము లగు. 43

వర్తకమ్మును; కృషియు; గోపాలనమును;
వైశ్య కర్మ స్వభావ సంభవము లవనిఁ–
లలితమై యొప్పు పరిచర్య వలనఁ దనరు
వర్తనము, శూద్ర కర్మ స్వభావజమ్ము. 44

తమ స్వభావాను గుణముగఁ దమకు నియమి
త మగు కర్మాభినిరతినిఁ దవులువారు
సిద్ధిఁ గైకొంద్రు గాదె – తత్సిద్ధి – స్వీయ
కర్మరతి మానవుం డందు క్రమము వినుతు. 45

సర్వభూతంబు లెవని కతన నైగఁ బుట్టు;
నెవనిచే వ్యాప్తమై జగ మింపుఁ గూర్చు;

స్వకర్మణా త మభ్యర్చ్య
సిద్ధిం విన్దతి మానవః. 46

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ
కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 47

సహజం కర్మ కౌన్తేయ
సదోష మపి న త్యజేత్,
సర్వారమ్భా హి దోషేణ
ధూమేనాగ్ని రి వావృతాః. 48

అసక్తబుద్ధి స్సర్వత్ర
జితాత్మా విగత స్పృహః,
నైష్కర్మ్య సిద్ధిం పరమాం
సన్న్యాసే నాధిగచ్ఛతి. 49

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ
త థాప్నోతి నిబోధ మే,
సమాసే నైవ కౌన్తేయ
నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో
ధృత్యాత్మానం నియమ్య చ,

నట్టి పరమాత్ము నిజకర్మ నర్చసేసి
మానవుఁడు బొందుఁ దత్కృపామహితసిద్ధి. 46

అన్యధర్మాను సరణకృత్యమునకంటె
విగుణమయ్యు; స్వధర్మమే యగు శుభదము
నిక్క వం బింతకు – స్వభావనియత కర్మ
మనుజుఁ డొనరించి దురితలంపటుఁడు గాఁడు. 47

సహజముగఁ గర్మ దోష సంసక్త మగుచు
వరలు చున్నను – విడువంగ వలను పడదు–
అగ్ని, ధూమావృతం బౌచు నలరు నట్లు
సర్వ కర్మంబులును దోషసంభృతములు. 48

జనుఁడు, విజితేంద్రియుం డౌచుఁ దనరి; బుద్ధి
విషయముల నుండి తొలఁగ–నిస్పృహతఁ జెలఁగి ;
సాంఖ్య యోగమ్ము కతన నైష్కర్మ్యరూప *
పరమ సంసిద్ధివడసెడుఁ బాండుతనయ! 49

జ్ఞాన నిష్ఠకు మిగుల ప్రశస్తమగుట
నంత రింద్రియశుద్ధి సాంఖ్యమున సిద్ధి
నలరు మనుజుండు ; బ్రహ్మైక్య మందు తెఱఁగు
వినుము సంక్షిప్తరీతి నే వినుతు నీకు! 50

పార్థ! పరిశుద్ధ బుద్ధి సంపన్నుఁ డగుచు
నెగడి సుజనుండు, ధృతి నాత్మ నిగ్రహించి –

---

* నైష్కర్మ్యరూప పరమసంసిద్ధి=నిష్క్రియ బ్రహ్మ సంప్రాప్తి.

శబ్దాదీన్ విషయాన్ స్త్యక్త్వా
రాగ ద్వేషౌ వ్యుదస్య చ. 51

వివిక్తసేవీ లఘ్వాశీ
యతవాక్కాయ మానసః,
ధ్యానయోగ పరో నిత్యం
వైరాగ్యం సముపాశ్రితః. 52

అహంకారం బలం దర్పం
కామం క్రోధం పరిగ్రహం,
విముచ్య నిర్మమ శ్శాన్తో
బ్రహ్మ భూయాయ కల్పతే. 53

బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా
న శోచతి న కాంక్షతి,
సమ స్సర్వేషు భూతేషు
మద్భక్తిం లభతే పరామ్. 54

భక్త్యా మా మభిజానాతి
యావా న్య శ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా
విశతే తదనన్తరమ్. 55

సర్వకర్మా ణ్యపి సదా
కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి
శాశ్వతం పద మవ్యయమ్. 56

దొఱఁగి శబ్దాదివిషయసందోహ మెల్ల-
రాగ విద్వేషములను దూరముగ నెట్టి- 51

నియతవాక్కాయ మానసుం డయి తనర్చి -
యలరి వైరాగ్యమున - మితాహారి యగుచుఁ-
దివిరి యేకాంతవాస సంస్థితిని దవిలి -
సంతతధ్యానయోగ నిష్ఠను భజించి - 52

కామమున్-క్రోధమును-నహంకార-మతుల
బలమును-బరిగ్రహమ్ము-దర్పమ్ముఁ-దొఱఁగి;
మమత విడనాడికొని ; శాంతమహిత చిత్తుఁ
డగుచు బ్రహ్మైక్య పదవి కర్హత వహించు. 53

బ్రహ్మభావమ్ము వడసిన ప్రాజ్ఞుఁ డగుటఁ;
గడు ప్రసన్నాత్ముఁ డై దేని గాంక్ష సేయ;
కది లభింపమిఁ జింతింప - కలరి సర్వ
భూత సమదృష్టి మద్భక్తిఁ బొందు నతఁడు. 54

పొంది యున్నట్టి భక్తి నా పొందుఁ గోరి
యెంత వాఁడనో - నాయునికి- యెవ్విధానఁ
దనరుదునో - దాని నెల్లఁ దత్వప్రసక్తి
నరసి కొని - నన్నుఁ జేరు దేహాంత మందు. 55

మామ కాత్మీయుఁ డైన నిష్కామ కర్మ
యోగి యగు నాతఁడ, ఖలకర్మోద్యమములఁ
దవిలి యుండియు మత్ప్రసాదమ్ము కతన
శాశ్వతావ్యయపదవి నిశ్శంక వడయు. 56

చేతసా సర్వ కర్మాణి
మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య
మచ్చిత్త స్సతతం భవ. 57

మచ్చిత్త స్సర్వదుర్గాణి
మత్ప్రసాదా త్తరిష్యసి,
అథ చే త్త్వమహంకారా
న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. 58

య దహంకార మాశ్రిత్య
న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయ స్తే
ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59

స్వభావజేన కౌన్తేయ
నిబద్ధ స్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా
త్కరిష్య స్యవశోఽపి తత్. 60

ఈశ్వర స్సర్వ భూతానాం
హృద్దేశోఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని
యన్త్రారూఢాని మాయయా. 61

త మేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత,

అఖిల కర్మలు నాకు 'బ్రహ్మార్పణ' మని
చిత్త సంశుద్ధి నొసఁగి – నా చెలిమిఁ గోరి–
ఘనతరం బగు నిష్కామ కర్మయోగ
మంది – మది నిల్పు మయ్య నా యందుఁ బార్థ! 57

నన్నుఁ జిత్తంబులో నిల్పుకొన్న నీకు
నలరు మత్కృప సర్వదుర్గైక తరణ;
మటులఁ గాక – అహంకార మంది నాదు
మాట విన వేని గౌంతేయ! చేటు మూడు. 58

ఈ, వహంకృతి నాపలు కీసడించి
రణ మొనర్ప నటంచు వా కొనెద వేమొ
కాని యది మిథ్య యై క్రాలుఁ గాదె – నిన్ను
నీ స్వధర్మమ్మె, యని కీడ్చు నిజము పార్థ! 59

బవర మొనరింప నజ్ఞానవశము చేత
నీవు దల పడ కున్నచో నీస్వభావ
సిద్ధ మగు కర్మచేత నిబద్ధుఁ డవయి
వివశతఁ బోరు సల్పెదు – విజయ! నిజము. 60

క్రీడి! తనుమాత్ర యంత్ర నిర్మితసమస్త
జీవకోటిని – దన్మనస్స్థితిఁ జెలంగి
యీశ్వరుఁడు, స్వీయమాయఁ దదీయకర్మ
గతికిఁ దగి నట్లు నాడించుఁ గాదె సతము. 61

అట్టి బ్రహ్మాండ విభుని యనన్యశరణ,
మన్ని విధముల గ్రహియింపు మయ్య పార్థ!

తత్ప్రసాదా త్పరాం శాంతిం
స్థానం ప్రాప్స్య సి శాశ్వతమ్. 62

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం
గుహ్యా ద్గుహ్య తరం మయా,
విమృశ్యై తద శేషేణ
య థేచ్ఛ సి తథా కురు. 63

సర్వ గుహ్యతమం భూయః
శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢ మితి
తతో వక్ష్యామి తే హితమ్. 64

మన్మ నా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు,
మా మే వైష్యసి సత్యం తే
ప్రతిజానే ప్రియోఽసి మే. 65

సర్వ ధర్మాన్ పరిత్యజ్య
మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి – మా శుచః. 66

తత్ప్రసాదాప్తి శాంతికి ధామ మైన
శాశ్వతస్థాన మందికోఁ జాలె దీవు. 62

అనఘ! నే నిట్లు పరమరహస్య తమము
జ్ఞాన ముపదేశ రూపమ్ముగా నుడివితి
మానసమ్మున దీని విమర్శనమ్మొ
నర్చి కావింపు మిఁక నీకు నచ్చి నట్లు. 63

సర్వ గుహ్యతమమ్ము; మజ్జల్పితమ్ము;
వినియు మార్వల్క వైతివి విజయ! దీని
కంటె హిత మైన వచన మొక్కటి వచింతు
వినుము హితుఁడవు నాకౌట - వినుతు నీకు. 64

ప్రతిన యొనరింతు నిను బ్రోవ హితుఁ డ వౌట;
మనము నాయెడ నిలుపుము - ననుభజించు
భక్తుఁ డవు గమ్ము - సర్వ మర్పణ మొనర్చి
యాజి వగుము-'నమోనమ' యని యెరగుము. 65

* సర్వధర్మమ్ము లుడిగిపో సన్న్యసించి -
నన్నుఁ బరమాత్ము నొకని నే నమ్ముకొనుచు
శరణు సొచ్చుము-పార్థ! నీ సర్వదురిత
ములను వారింతు - దుఃఖమ్ముఁ బొంద కింక. 66

---

* ఈశ్లోకము ఉపదేశములలోఁ గట్ట కడపటిది. కనుకఁ 'చరమశ్లోక' మైనది. అవసానకాలమందు స్మరింపఁ దగినది కనుక దీని నే చరమశ్లోక మని మతికొందఱు పెద్ద లందురు.

ఇదం తే నాతపస్కాయ
నాభక్తాయ కదాచన,
న చాశు శ్రూషవే వాచ్యం
న చ మాం యోఽభ్యసూయతి. 67

య ఇమం పరమం గుహ్యం
మద్భక్తేష్వ భిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా
మా మే వైష్య త్య సంశయః. 68

న చ తస్మా న్మను ష్యేషు
కశ్చి న్మే ప్రియకృ త్తమః,
భవితా న చ మే తస్మా
దన్యః ప్రియతరో భువి. 69

అధ్యేష్య తే చ య ఇమం
ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞాన యజ్ఞేన తే నాహ
మిష్ట స్స్యా మితి మే మతిః. 70

శ్రద్ధ వానన సూయ శ్చ
శృణు యా దపి యో నరః,
సోఽపి ము క్త శ్శుభాన్ లోకాన్
ప్రాప్ను యా త్పుణ్య కర్మణామ్. 71

కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ
త్వయై కాగ్రేణ చేతసా,

తప మొనర్పని వానికి – దైవభక్తి
లేని వానికి – వినుకోర్కె లేనివాని,–
కెపుడు నను దూఱువానికి – హితముఁ గోరి
నీకు వినిచిన గీత విన్పింప వలదు. 67

పార్థ ! నాయెడ నుత్తమ భక్తిఁ దవిలి
కోరి – యీ గోప్య మైన గీతారహస్య
మెవఁడు మద్భక్తకోటికి నెఱుక పఱచు –
వాఁడు, నిశ్శంక మత్పద ప్రాప్తి వరలు. 68

వాని కంటెను మించిన వాఁడు హితుఁడు
మానవుల నేటి కెవ్వండు గాన రాఁడు–
ఇంత యేటికిఁ బ్రియతరుం డింకొకండు
బుడమి–ముందే నిఁ గన్పింపఁ బోఁడు నాకు. 69

నాకు నీకును జరిగిన జ్ఞాన రూప
మైన యీ వాదమును నెవ్వఁ డహరహమ్ముఁ
బఠన మొనరించునో–వాని వలన జ్ఞాన
యజ్ఞ విధి నర్చితుఁ డ నౌదు నని తలంతు. 70

చుప్పనాతి తనమ్మునఁ జప్పరింప
కెవ్వఁ డీ తత్త్వశాస్త్ర మెంతే ని శ్రద్ధ
తోడ నాలించు – నతఁ డఘదూరుఁ డగుచుఁ
బుణ్య కర్మ్మల శుభలోకమున వసించు. 71

అనఘ! నీవింత దనుక నేకాగ్రబుద్ధి
సలరి విన్న దానికిఁ జరితార్థ మున్నె?

కచ్చి దజ్ఞాన సంమోహః
ప్రనష్ట స్తే ధనం జయ. 72

అర్జున ఉవాచ :

నష్టో మోహ స్స్మృతి ర్లబ్ధా
త్వత్ప్రసాదా న్మ యాచ్యుత,
స్థితో౽స్మి గత సందేహః
కరిష్యే వచనం తవ. 73

సంజయ ఉవాచ :

ఇ త్యహం వాసుదేవస్య
పార్థస్య చ మహాత్మనః,
సంవాద మిమ మశ్రౌష
మద్భుతం రోమహర్షణమ్. 74

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా
నేత ద్గుహ్య మహం పరం,
యోగం యోగేశ్వరా త్కృష్ణాత్
సాక్షా త్కథయత స్స్వయమ్. 75

రాజన్ సంస్మృత్య సంస్మృత్య
సంవాద మిమ మద్భుతం,
కేశవార్జునయోః పుణ్యం
హృష్యామి చ ముహు ర్ముహుః. 76

త చ్చ సంస్మృత్య సంస్మృత్య
రూప మత్యద్భుతం హరేః,

'వినితి' నని దేమొ – అజ్ఞాన జనిత మైన
మోహ మింతకుఁ బోఁదోలి ముదముఁ గనితె! 72

తోడనే హరి నుడి కిట్లు క్రీడి వలికె
దేవ! నశియించె మోహమ్ముఁ – దేరి కొంటి –
విగత సంశయబుద్ధి నై నెగడి యుంటి
నిటుల నీకృప–నీ చెప్పి నటు లొనర్తు. 73

అచ్చెరువు తోడ రోమాంచ మలరఁ జేయు
పార్థసారథి పార్థ సంవాద మిటుల
వింటి నని సంజయుండు, దా విన్న విధము
వాకొని యె నెల్లఁ గురుపతి యూఁ కొనంగ. 74

జ్ఞాన దృష్టి ని వ్యాసప్రసాద కలన
నంది – యోగేశ్వరుఁడు కృష్ణుఁ డర్జునునకు
విశదముగఁ దెల్పు నీగోప్య విమలయోగ
మెల్ల స్వయముగ నేను గట్టెదుట వింటి. 75

పుణ్యాకర మౌచు నద్భుతమ్మును ఘటించు
మురహరక్రీడి సంవాదమును స్మరించి
మాటి మాటికి స్మరియించి మనము నందుఁ
బరమహర్షంబు నొందితిఁ గురుకులేశ! 76

అంబుజాక్షుని రూప మత్యద్భుతమ్ము
దాని స్మరియించి – స్మరియించి తనియు చుందు–

విస్మయో మే మహాన్ రాజన్
హృష్యామి చ పునః పునః. 77
(699)

యత్ర యోగేశ్వరః కృష్ణో-
యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి
ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ. 78
(700)

ఓమ్ తత్స దితి శ్రీమన్మహాభారతే శత సాహస్ర్యాం వైయా
సిక్యాం భీష్మ పర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
మోక్షసన్న్యాస యోగోనామా
ష్టాదశోఽధ్యాయః.

ఓమ్తత్సత్ - ఓమ్తత్సత్ - ఓమ్తత్సత్.
శ్రీరాధాకృష్ణార్పణమస్తు.



నింత యేటికి విస్మయా క్రాంత మతిని
మాటి మాటికి హర్షింతు మావవేశ ! 77

* అధిప ! యోగేశ్వరుఁ డు గృష్ణుఁ డలరు నెచట-
నెట ధనుర్ధారి యై పార్థుఁ డింపుఁ గూర్చు -
నచట భూతియు ; శ్రీయు; జయమ్ము; నీతి;
జెలఁగు ననుట ధ్రువం బని తలఁచు వాఁడ. 78

శ్రీమన్మహా భారతము లోని భీష్మ పర్వమందలి శ్రీమదు
పనిషద్బ్రహ్మ విద్య యనం బడు యోగశాస్త్ర
ప్రయుక్త శ్రీమద్భగవద్గీత యందు శ్రీకృష్ణార్జున
సంవాదమున మోక్షసన్న్యాసయోగమను
పదు నెనిమిదవ యధ్యాయము,

ఓమ్ తత్సత్ - ఓమ్ తత్సత్ - ఓమ్ తత్సత్.

శ్రీ రాధాకృష్ణార్పణమస్తు.

---

* మొదటి యధ్యాయమున 1 మొదలు 47 వ శ్లోకము వఱకు భగవద్గీతలో పూర్వ పీఠికగా పరిగణింపఁ బడి నట్లు-పదునెన్మిదవ యధ్యాయములో 67 వ శ్లోకము నుండి 78 వ శ్లోకము వఱకు నుత్తర పీఠిక యని గ్రహింపవలయును.

## ఫ ల శ్రు తిః

శ్లో॥ గీతా శాస్త్ర మిదం పుణ్యం
యః పఠేత్ప్రియతః పుమాన్
విష్ణోః పద మవాప్నోతి
భయశోకాదివర్జితః

*          *          *          *

'గీతా స ప్తశతీ'' నామ
గ్రంథ స్త్వాంధ్రీ కృతో మయా,
లక్ష్మీ నారాయణాఖ్యేన
'చల్లా' వంశా ర్ణ వేందునా.



## ఫలశ్రుతి

విదిత పుణ్య గీతా శాస్త్ర మిది – ప్రయత్న
మున నెవఁడు దీని బఠియించి మోద మందు –
నతఁడు భయశోక వర్జితుండై వికుంఠ
భువన సంవాస సౌఖ్యంబుఁ బొందఁ గలఁడు.

*     *     *     *

దీనిఁ దిర్పతి వేంకటేశ్వరుల కంతేవాసియై మించి; "–చల్లా" నామాన్వయ దుగ్ధవార్ధి శశియై "లక్ష్మీపురిఁ*" గ్రాలి–లక్ష్మి నర్సాంబకు, సీతయాహ్వాయునకుఁ జ్యేష్ఠాత్మజుండైన లక్ష్మీనారాయణుఁ డాంధ్ర మందనువదించెఁ †శ్రీశుప్రేరేపణఁ

---

* లక్ష్మి......గ్రాలి = కృష్ణా మండలాంతర్గ మగు గృధ్ర నగరమున (గుడివాడ) కనతిదూర మందలి "లక్ష్మీపురము" నివాసముగాఁ గలిగి.

† 1. శ్రీ...పణఁ = ఇష్టదైవ మగు రాధాకృష్ణుని ప్రేరణ రూప మగు అనుగ్రహవిశేషము చేత.

2. 'శ్రీశనామధేయుఁ' డగు నొకానొక నైష్ఠిక బ్రహ్మచారి ప్రేరణము చేత.

# రాధాకృష్ణ రచనావళి

**తెలుగు :**

తెనుగు విందు
తమిళ విందు
వ్యాస మంజూష
మదరాసు తెలుగు
దళవాయి రామప్పయ్య
శాంతిసూక్తం
వేమన సూక్తులు
సి.పి. బ్రౌన్ సాహితీ సేవ
ఆడపిల్ల తండ్రిని
శ్రీ విజయం
మధురనాయకరాజులు
చరిత్ర కెక్కిన చరితార్థులు
అంతా ఒక్కటే
రాణి మీనాక్షి
రాణి మంగమ్మ
ఆర్తిగీతాలు
శ్రమలో స్వర్గం
తమిళ పంచ కావ్య కథలు
తమిళ సాహిత్య చరిత్ర
ఆధునిక తమిళ సాహిత్య నిర్మాతలు
సుబ్రహ్మణ్యభారతి
తెలుగు- దాక్షిణాత్య సాహిత్యాలు
రామాయణ వ్యాసాలు
తులనాత్మక సాహిత్యం
తెలుగు తమిళ కవితలు
జాతీయ వాదం
గరిమెళ్ల సాహిత్యం
ఆర్కాటు సోదరులు

**తెలుగుసేతలు :**

ఆత్మ చింతనము
తమిళ కథానికలు
తరతరాల తమిళ కవిత
చిట్టికి చిరుగంట
రంగు రంగుల పూలు
భారతి వచన రచనలు
దారి చూపిన తాత: గాంధి
తిరుక్కురళ్
మా తాతయ్యే కొకయేను గుండేది.
తమిళ సాహిత్య కథలు
మొదలగునవి

**తమిళం :**

ఆయిరం తలైనాగం
తెలుంగు ఇలక్కియ విరున్దు

**ఆంగ్లం :**

The Ramayana in Telugu and Tamil - A Study
Landmarks in Telugu Literature
Tales From Telugu
Ramblings in Telugu Literature
Palkuri Somanatha
Collected Essays of Prof. C.R. Sarma.